# పెరిగే పాపాయిలకు

## కావాలి ఒక ప్రత్యేకమైన ఘన ఆహారం...

# ఫారెక్స్



## ఎందుకంటే ఫారెక్స్ పాపాయిల సత్వరమైన మరియు సంపూర్ణమైన పెరుగుదల కోసం అధిక పుష్టికరమైన ఘన ఆహారం.

### మీ పాపాయి పెరుగుదల కోసం ప్రొటీన్‌తో సమృద్ధమైనది ఫారెక్స్

నిర్దేశించిన రీతిలో ఫారెక్స్ తయారుచేసి ఇస్తే అది మీ పాపాయి పెరుగుదలకు అత్యావశ్యకమైన ప్రొటీన్ సమృద్ధంగా కల్గి వుంటుంది.

### ఆరోగ్యవంతమైన రక్తం కోసం అదనంగా ఐరన్ కల్గి వున్నది ఫారెక్స్

పాపాయి రక్తానికి, రోగ-ప్రతిరోధక శక్తిని ఎక్కువ చేయడానికి, అతని సామాన్య ఆరోగ్యం మరియు పెరుగుదల కోసం ఐరన్ అత్యంత ముఖ్యం. మీ పాపాయికి పుట్టుకతోనే ప్రకృతి అందించే కానుక ఐరన్. అతడు పెరిగే కొద్దీ దీని నిల్వ తరిగిపోతుంది.

మూడు-నాలుగు నెలల తర్వాత మీ పాపాయికి కావలసిన ఐరన్ కేవలం పాలు మాత్రమే సమకూర్చలేవు. అందుచేత, ఆ దశలో, మీ పాపాయికి ఐరన్ కల్గిన ప్రత్యేక ఘన ఆహారం కావాలి. బ్రాండు చేయబడిన ఇతర ఘన ఆహారాల కంటే ఫారెక్స్‌లో ఎక్కువ ఐరన్ కలదు.

### పాపాయి పళ్లు మరియు ఎముకలకు అతి ముఖ్యమైన కాల్షియం మరియు ఫాస్ఫరస్ సరియైన నిష్పత్తిలో కల్గి వున్నది ఫారెక్స్

పళ్లు మరియు ఎముకలు చక్కగా ఏర్పడటానికి మీ పాపాయికి కావాలి కాల్షియం మరియు ఫాస్ఫరస్. కాని ఈ రెండూ 2 : 1 నిష్పత్తిలో కలిసి వుంటేనే పాపాయికి ఎక్కువ లాభం చేకూరుతుంది. ఈ అత్యావశ్యక తత్వములను ఆదర్శప్రాయమైన నిష్పత్తిలో కల్గి వున్నది ఫారెక్స్. ఇది మీ పాపాయి ఎక్కువ ఆరోగ్యవంతమైన ఎముకలు మరియు ఎక్కువ దృఢమైన పళ్లు నిశ్చయంగా పొందేలా చేస్తుంది.

### ఎంతో సులభంగా జీర్ణమవుతుంది ఫారెక్స్

మీ పాపాయి సున్నితమైన జీర్ణశక్తికి అనువుగా ప్రత్యేకంగా ముందుగానే పచనం చేయబడినది ఫారెక్స్.






డాక్టర్లు సిఫార్సు చేస్తారు

**ఫారెక్స్**® గ్లాక్సో ఉత్పాదన

CLARION/GX/1/244 TEL

# ప్రతి గృహిణి సంతోషానికి

# డిమ్సన్

## గ్యాస్ స్టౌ








**36 నెలల గ్యారంటీ**

గ్యాస్ వాడకం 17% పొదుపు చేస్తుంది.
3 బర్నర్లతో 50% వంట సమయాన్ని
పొదుపు చేస్తుంది.
తుప్పుపట్టని అల్యూమినియం భాగాలు,
స్టెయిన్‌లెస్‌స్టీల్, క్రోమ్ మరియు
పెయింటెడ్ రకాలలో లభిస్తుంది.
మీరింతవరకు ఎరుగని సాటిలేని గ్రిల్.
రివర్స్‌బుల్ బర్నరు కలిగి, వంట,
వేపుడు, టోస్ట్, బాయిల్ అన్నీ ఒకే
సమయంలో చేయటానికి మేలైన గ్రిల్ఎడ్.
మీరు రుచికరమైన తండూరీ చికెన్
జ్యూసీస్టిక్స్. మాక్‌పిజాస్. టాప్డ్ టొమాటో,
క్రిస్ట్‌మసాలా బ్రింజాల్స్, గ్రిల్డ్ ఫిష్
మరియు స్టఫ్డ్ టొమాటో తయారు
చేయవచ్చు.






**డిమ్సన్ గ్యాస్ స్టౌ**
రక్షణ మరియు పొదుపు కొరకు
వర్టికల్ మిక్సింగ్‌ట్యూబ్ గల ఏకైక గ్యాస్ స్టౌ

LP గ్యాస్ డీలర్లను లేదా డిస్ట్రిబ్యూటర్‌ను సంప్రదించండి

**టిబ్రేవాలా**
**మార్కెటింగ్ కార్పొరేషన్**
54 పుష్పాంజలి కాంప్లెక్స్, కోఠి, హైదరాబాదు.పాన్ 46008
ఏ.ఐ.ఐ. ఎగ్జిబిషన్ లోగల మా స్టాలును దర్శించండి.
(ఎగ్జిబిషన్ క్లబ్ ఆఫీసు ఎదురుగా)

**మా పాఠకులు, రచయిత(త్రు)లు, ఏజంట్లు, ప్రకటనకర్త అందరికీ రిపబ్లిక్ దినోత్సవ శుభాకాంక్షలు!**




## సర్ ఆర్థర్ కాటన్

డిసెంబరు 23వ తేదీ సంచిక చేతిలోకి రాగానే మామూలు అలవాటు ప్రకారం ముందు తొందర తొందరగా తిరగేస్తున్నాను 8వ పేజీలో నా అభిమానపాత్రుడు కాటన్ ఫోటో చూడగానే నా తొందరకు ఆనకట్ట పడింది మనస్సు ధవళేశ్వరం ఆనకట్ట ప్రారంభంలోని కాటన్ శిలావిగ్రహం వద్దకుపోయింది తక్షణం చదవడం ప్రారంభించినాను చదువుతున్నంత సేపూ గోదావరి కాలువలలాగ గలగలా కన్నీటి కాలువలు ప్రవహిస్తూనే ఉన్నాయి.

చైమలుగారు ప్రాతఃస్నానం నిత్యమూ ఆ గన్నవరం కాలువలోనే తృప్తితీర చేస్తూండే వారట — ఆత్రేయపురం సమీపంలో అనుకొంటాను. ఆయన స్నాన సంకల్పంలో "కాటన్ మహాశయ నిర్మిత గోదావరీ కుల్యా స్నాన మహం కరిష్యే" అని చెప్పుకొని మునిగే వారట!

మెచ్చుకోవలసినవి రెండు అంశాలున్నాయి. (1) కాటన్‌దొర మేధశ్శక్తి, నిరాడంబరత, ఔదార్యం, ఆంధ్రుల కృతజ్ఞతా స్వభావం. (2) ఇరవైనాలుగు సంవత్సరాలనాటి ఉత్తమ వ్యాసం ఈనాటి యువతకు అందించిన ప్రయోజనాత్మకమైన మీ నిశితదృష్టి. నేను కోరేది ఒకటి పూర్వ సంచికలలోని ఇటువంటి ఉత్తమ వ్యాసాలను ఏర్చి, మన వారపత్రిక ద్వారా పాఠకులకు అందిస్తూ వారికి ఆనందాన్ని, విజ్ఞానాన్ని సమకూర్చుతూ ఉండమని.

అయ్యగారి సూర్యనారాయణమూర్తి,
హైదరాబాదు.

## మేడిన్ ఇండియా

ప్రాంతీయాభిమానం కంటే, భాషాభిమానం కంటే ఎంతో అతీతమైనది, ఉన్నతమైనది దేశాభిమానం. ఈ సత్యాన్ని చక్కని కథలో మలచి 'ఎ గుడ్ స్టోరీ మేడిన్ ఇండియా' అనిపించారు శ్రీ పులికంటి కృష్ణారెడ్డి. 1984 తొలి సంచికలో ఈ కథ ప్రచురణ జరగటం మంచి కథలకు మన పత్రిక స్వాగతం పలికి నట్లయింది.

వక్కలంక రామారావు, మానేపల్లి.

## వింత ధోరణి

ఈ వారం (5–9–1969) పత్రిక వీక్లీ నుండి ప్రచురించిన శ్రీకృష్ణగారి న్యూఢిల్లీ లేఖలోని 'రాష్ట్రపతి ఎన్నికలో తెలుగువారి పాత్ర' చదివి మన ప్రధాని శ్రీమతి గాంధీగారి వింతధోరణిని, కాంగ్రెస్‌వారిలోని ముఠాతత్వాన్నీ, తెలుసుకున్నాము. రాజకీయ వాతావరణములో 69 నాటికి నేటికీ పెద్ద తేడాలేదనిపిస్తూంది. పైగా మరికొంత క్షీణించినదేమో! ఎవరో అన్నట్లు "నాడు నాయకులు ప్రజలకోసం ఆస్తులను ధారపోస్తే; నేడు నాయకులు ఆస్తుల కోసం ప్రజలనే ధారపోస్తున్నారని." ప్రజా నాయకులు మరి.

స్వరాజ్యలక్ష్మి, ఆనందగజపతిరావు, తెట్టంగి.

## చక్కని ఆకర్షణ

శ్రీ తిరుమల రామచంద్రగారి 'హైదరాబాద్ నోట్‌బుక్' ప్రత్యేకించి 'ఉపశ్రుతి' ప్రతి వారం వ్యసూతనంగా ఉంటుంది. రసజ్ఞులైన పత్రికా పాఠకులకు ఇది చక్కని ఆకర్షణ.

కాకుటూరు సుబ్రహ్మణ్యం,
ఉట్నూరు.

## సైన్స్ ఫిక్షన్

30–12–83 సంచికలో 1969లో ప్రచురించిన "దూరప్రయాణం" కథని మళ్ళీ వేసారు. కారణం ఏమిటో వివరించలేదు. బహుశ "సైన్స్ ఫిక్షన్" తెలుగులో ప్రోత్సహించింది మీరేనని తెలుపుటకయితే అందులో ఏమాత్రం సందేహం లేదు.

జి. లీలాకుమారి, హైదరాబాదు.

## కథలు

1984వ సంవత్సరానికి ప్రథమ సంచికగా వెలువడిన 6–1–84 నాటి ఆంధ్ర సచిత్ర వారపత్రికలో రచయిత్రి కుమారి ఎ. వి. శేషారత్నంగారి "కాకులు" కథ మాకు చాలా బాగా నచ్చింది.

పి. ఉమామోహన్, ఆశాజ్యోతి,
విశాఖపట్టణం–8.

* * *

6–1–84 ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రచురించిన 'ఆకర్షణ' కథ చాలా బాగుంది.

పూసర్ల సీతారామయ్య,
పెద్దాపురం.

* * *

"రాధ, జయసుధ" ల ముఖచిత్రం చాల బాగుంది. "ఆదూరి సావిత్రి" "స్వయంకృతం" కథ "ప్రేమ అనే — వలలో పడే" ఈనాటి యువతులకు కనువిప్పు కావాలి. ఇంత చక్కని కథను రాసిన రచయిత్రికి మా కృతజ్ఞతలు.

టి. రత్నమాల, ఇతరులు, ఖమ్మం.

---

హైదరాబాదులో తెలుగుదేశం ప్రభుత్వం తొలి వార్షికోత్సవం సందర్భంగా ఏర్పాటు చేసిన సాంస్కృతిక కార్యక్రమాలని తిలకిస్తున్న ముఖ్యమంత్రి శ్రీ ఎన్ టి రామారావుపై గుంటూరుకి చెందిన మల్లెల బాబ్జి హత్యాప్రయత్నం చేసినప్పుడు ఆయన ఎడమచేతి బొటన వ్రేలికి గాయం అయింది ఆ సందర్భంగా ముఖ్యమంత్రిని పరామర్శిస్తున్న ప్రఖ్యాత సినీ నటుడు శ్రీ అక్కినేని నాగేశ్వరరావు, ఆంప్ర గవర్నర్ శ్రీ రామ్‌లాల్, మాజీ ముఖ్యమంత్రి డా చెన్నారెడ్డి గార్లని చిత్రంలో చూడవచ్చు



# ఉచితము!



5 మీటర్ల నైలాన్ త్రాడు*
ప్రతి రెండు బారు సబ్బులతో

* రూ 2/- విలువ

త్వరపడండి!
నిల్వలు ఉన్నంతవరకే
ఈ సౌకర్యం

ఈ సౌకర్యం లేకున్నా
నిల్వలు లభిస్తాయి

టోటల్
నీలి డిటర్జెంట్ ఉతికే బార్




సులభంగా
ఉతికేందుకు
అనువైన
ఐదు భాగాలు




MCA/TDB/53M/TEL

ఉత్పాదన: కర్నాటక సోప్స్ అండ్ డిటర్జెంట్స్ లిమిటెడ్, బెంగళూరు మార్కెట్ చేయువారు మైసూర్ సేల్స్ ఇంటర్నేషనల్ లిమిటెడ్, బెంగళూరు.

## లోకం పోకడ — ఊశిమెన్










**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు .
**దేశోద్ధారక కాశీనాథుని**
**నాగేశ్వరరావు పంతులుగారు**
స్థాపితం : 1908

***శివలెంక శంభుప్రసాద్***
**సంపాదకుడు :**
[1938–1972]
శుక్రవారం : 3–2–84'
రుధిరోద్గారి నామ సం. మాఘ శు. విదియ
**సంపుటము 76 సంచిక 21**

**సంపాదకుడు :**
***శివలెంక రాధాకృష్ణ***

విడి ప్రతి వెల రు. 1-50
ఆరు మాసాల చందా రు. 42-90
పోస్ట్‌లో ఏడాది చందా రు. 85-80
**ఆంధ్రపత్రిక కార్యాలయము,**
గాంధీనగరం. విజయవాడ-520 003.

## విషయానుక్రమణిక

**ముఖచిత్రం :**
'పుణ్యంకొద్దీ పురుషుడు'లో
శోభన్‌బాబు

***కథలు :***



***సీరియల్ నవలలు :***



***వ్యాసాలు, శీర్షికలు :***

# కుడి - ఎడమ - సిద్ధాంతాలు - ఫలితాలు




ఎవరినయినా "మీరు కాంగ్రెసువారా ? లేక మీరు ముస్లిమ్‌లీగువారా ? లేకపోతే మీరు రిపబ్లిక్ పార్టీవారా ? ఇదేదీ కాకపోతే మీది డెమొక్రాటిక్ పార్టీయేనా ? పోనీ మీరు కమ్యూనిస్టులో, సోషలిస్టులో చెబుతారా ?" అని ప్రశ్నలు వెయ్యండి.

"ఏదయితే నీకెందుకు ?" అని ఆ వ్యక్తి సమాధానం చెప్పవచ్చు. ఎందుకంటే, ఆ వ్యక్తికి చెప్పటం ఇష్టంలేకకాదు; తనకి ముందుతెలిస్తే గదా చెప్పటానికి !

మన ప్రపంచం ఎన్నో విధాలుగా అభివృద్ధి చెందుతోంది. అభివృద్ధితో బాటు ఏవేవో సమస్యలు వస్తూ ఉంటాయి. ఇటువంటి పరిస్థితులలో "కుడి, ఎడమ" అనే మాటలకి అర్థం చెప్పటం కష్టం అవుతోంది. (రాజకీయాలలో వామ, దక్షిణ విభేదాలన్నమాట.) వివిధ రాజకీయపక్షాలవారు ఎన్నికల ముందు పెద్ద ప్రణాళికలు తయారు చేసుకుంటారు. అధికారంలోకి వచ్చిన తర్వాత అన్ని పార్టీల విధానాలూ ఒక విధంగానే ఉంటాయి. వాళ్ళు సోషలిస్టులు కావచ్చు (ఫ్రాన్సులోలాగ), కన్సర్వేటివ్‌లు కావచ్చు (బ్రిటన్‌లో వలె), రిపబ్లికన్‌లు కావచ్చు (అమెరికా సంయుక్త రాష్ట్రాలలోలాగ.) రోనాల్డ్ రీగన్ అధ్యక్షుడు కాకముందు బడ్జెట్ లోటులని ఎంత ఖండించేవారు ! ఇప్పుడో ? అమెరికా చరిత్రలో కనీవిననంత పెద్ద లోటుకల బడ్జెట్‌ని సమర్పిస్తున్నాడాయన. లోటు బడ్జెట్‌లో ఉంటే తప్పులేదని నమ్మే సోషలిస్టు రాజకీయవేత్త మిట్టరాండ్ (ఫ్రాన్సు)ధరలుతగ్గటంకోసం బడ్జెట్‌లోలోటుని తగ్గింటానికి ప్రయత్నిస్తున్నారు. వోటరులు రాజకీయవాదుల విధానాలలో పరస్పర విరుద్ధంగా ఉండే అంశాలని పట్టించుకోరు. మళ్ళీ రీగన్, మిట్టరాండ్‌లే ఎన్నిక కావచ్చు శ్రీమతి థాచర్ పోయినసారి అపజయం పొందకపోగా మంచి మెజారిటీతో గెలిచారు !

ఒక్కమాటలో చెప్పాలంటే, సిద్ధాంతాల ప్రభావం సన్నగిల్లిపోయింది. ఏది కుడి, ఏది ఎడమ అని జనం ఆలోచించటంలేదు. ఏది ఆచరణీయం, అని మాత్రమే అడుగుతున్నారు. ఏ వ్యవస్థ పనిచేస్తోంది ? దేనివలన జీవనస్థాయి పెరుగుతోంది ? ఇటువంటి ప్రశ్నలు మాత్రమే వారికి ముఖ్యంగా కనిపిస్తున్నాయి. "వామ పక్షాలూ, దక్షిణ పక్షాలూ" అన్న విభేదం వారికి ముఖ్యంగా తోచటంలేదు.

ఇది ఇతరదేశాలలో. భారతదేశంలో అయితే, పాత పేరులే ఆకర్షిస్తున్నాయి. ఈమధ్యనే పార్లమెంటులో ప్రణాళికలమీద చర్చలు జరిగాయి కాని ఎవరూ ఆ ప్రణాళికలు ఎంత బాగా పని చేశాయి, అని అడగలేదు. అందరూ ప్రణాళికలని ప్రశంసించారు. ప్రణాళికా సంఘాన్ని ఎవరూ విమర్శకి గురిచెయ్యలేదు. ప్రతి పక్షాల వాళ్ళూ అంతే, ప్రభుత్వం వయిపు వాళ్ళూ అంతే. ప్రణాళికా సంఘం అంత పవిత్రమయినదన్నమాట ! "ఎందుకొచ్చిన గొడవ, ప్రణాళికా సంఘాన్ని విమర్శిస్తే దాని ఉనికికే ప్రమాదం కలుగుతుందేమో !" అని వాళ్ల భయం. "ప్రణాళికలే లేకపోతే దేశం ప్రగతి సాధించగలదా ?" అని వీళ్ల ప్రశ్న. ఇంతగా ప్రణాళిక సంఘాన్ని గౌరవించే వాళ్లే ప్రభుత్వాన్ని విమర్శిస్తూ ఉంటారు– "అభివృద్ధి జరగటం లేదు !" అని. అసలు సంగతి ఏమిటంటే, వాటిని సవాలు చెయ్యాలంటే దక్షిణ పక్షపు వారికి భయం.

భారతదేశంలో అందరూ వామపక్షవాదులు కావాలనుకుంటారు. "ఈ దేశంలోకెల్లా [ఒక్కరిని తప్పిస్తే, అని వేరే చెప్పాలా !] నేనే పెద్ద సోషలిస్టుని !" అంటారు శ్రీ అబ్దుల్ రెహమాన్ అంతూలే. "ధనవంతుల వద్ద సొమ్ము వసూలు చేసి బీదవారికి ఇచ్చాను కదా !" కొన్ని సంవత్సరాలుగా 'సోషలిజమ్' అనే మాటకి ఇదే అర్థం చెప్పబడుతూ వస్తోంది. నిజానికి, సోషలిస్టులమని చెప్పకునే వాళ్ళు మాత్రం ధనవంతుల సంపదనే పెంచుతూ ఉంటారు. భారతదేశంలో 30 సంవత్సరాల ప్రణాళికల తర్వాత డబ్బున్న వాళ్ల డబ్బు అధికం అయింది. బీదవాళ్ల పేదరికం కూడా పెరిగింది అయినా సరే, ఈ పద్ధతే కావాలంటారు అందరూ. ప్రణాళికలని రద్దు చెయ్యకూడదు, అంటారు. ప్రణాళిక సంఘం ఉండాలంటారు, వాళ్ళు. విధానాలు మంచివే కాని ఆచరణ బాగాలేదు — అని వాళ్ల వాదం. "ఆపరేషన్ విజయవంతంగా జరిగింది కాని రోగి మరణించాడు" అన్నట్లు ఉంటుంది. భారతదేశంలో రోగి చనిపోయి చాలా కాలమే అయింది కాని ఆపరేషన్ బల్లని తీసివేసే ధైర్యం ఎవరికీ లేదు.

ఒక వ్యవస్థ పని చెయ్యకపోతే దానిని తొలగించాలి కదా ? లోకజ్ఞానం కలవాళ్లకి ఎవరికయినా ఈ యదార్థం తెలుసు. రాజకీయ వాదులకి యదార్థాలు అక్కరలేదు కనుక నినాదాలని వల్లించి సంతృప్తిపడుతూ ఉంటారు. సోషలిజమ్ ఒక మంత్రం లాంటిది. ఆ మాటని చూస్తే అందరికీ భయమే. ఇంగ్లాండులో కార్మిక సంఘాలు ఆదేశాన్ని తమ చెప్పచేతలలో ఉంచుకున్నట్లు ప్రవర్తిస్తున్నాయంటే నిజంగా ఇంగ్లాడు వాటి ఆధీనంలో ఉండటంచేతనే కదా? శ్రీమతి థాచర్ ఈ పరిస్థితి మారాలంటారు. అనటమే కాకుండా చేసి చూపిస్తున్నారు కూడా ఆమె. "సానుభూతి సమ్మె" లని అదుపులో ఉంచే శాసనాన్ని ఆమె పార్లమెంటులోఆమోదింప చేశారు. [ఒక ఫాక్టరీలో సమ్మె ఉంటే ఆ ఫాక్టరీ తాలూకు యూనియన్‌కి చెందిన ఇతర











# న్యూఢిల్లీ లేఖ

కర్మాగారాలలోని కార్మికులు సానుభూతి సమ్మె చెయ్యరాదన్న మాట.] కొత్త శాసనం ప్రకారం సానుభూతి సమ్మె చేసేవాళ్ల యూనియన్ నిధులు ప్రభుత్వం స్వాధీనం కావచ్చు. ఆ యూనియన్ నాయకులు జైలుకి వెళ్లవచ్చు. కార్మిక సంఘాలని చట్టం పరిధిలోకి తీసుకు రావటం బ్రిటన్ చరిత్రలో ఇదే మొదటిసారి. కార్మిక సంఘాలు తప్పుచేసినా వాటిమీద చర్యలు తీసుకోరాదు, అన్న లోపభూయిష్టమయిన వాదాన్ని శ్రీమతి థాచర్ తిరస్కరించారన్న మాట ఆమె ఉత్తిమాటలతో ఊరుకోక చేసి చూపిస్తున్నారు ఇంగ్లీషులో ''రాడికల్'' అనే మాట ఉంది ''వేరు''కి సంబంధించిన అని అర్థం చేసుకోవచ్చు! ''సమూలంగా మార్పులు కోరేవాళ్లు రాడికల్ వాదులు'' అనుకోవచ్చు. ఈ నిర్వచనాన్ని స్వీకరిస్తే శ్రీమతి థాచర్ రాడికల్ కాక మరేమిటి ? మార్పుని వ్యతిరేకించే సోషలిస్టుకన్నా ఆమె ఎక్కువ రాడికల్ అనడంలో తప్పులేదు !

భారతదేశంలో సోషలిస్టులూ, కమ్యూనిస్టులూ ఉన్నారు. సమూలంగా మార్పులని తీసుకువద్దామనుకునేవాళ్లు లేరు. దాదాభాయి నౌరోజీ, గోఖలే, గాంధీల కాలంలో ఏది మంచిదో ఇప్పుడూ అదే మంచిదని అనుకుంటారు ఇక్కడ! కమ్యూనిస్టులే ఈ మాటలంటారు

పశ్చిమ బెంగాలునే తీసుకొండి. ఈ రాష్ట్రంలో కమ్యూనిస్టులు దాదాపు 10 సంవత్సరాలుగా అధికారంలో ఉన్నారు ఆ రాష్ట్రంలో ఆదాయాలు తగ్గుతున్నాయి. పరిశ్రమలు క్షీణిస్తున్నాయి. కారణం ఏమిటి ? నా స్నేహితుడు అశోక్‌మిత్రా, ముఖ్యమంత్రి జ్యోతిబసూ ఈ పరిస్థితులకి కొంతయినా బాధ్యులుకారూ ? [అశోక్‌మిత్రా కేంద్రంమీద దావా వేస్తానని బెదిరిస్తున్నారు. కేంద్రాన్ని బెదిరించే బదులు తమ పార్టీ నాయకులనే బెదిరించవచ్చు కదా ?]

సోవియెట్ యూనియన్‌లో ఒక విప్లవం జరిగిందన్నారు. దాని ఫలితంగా కమ్యూనిస్టులు అధికారంలోకి వచ్చారు. వాళ్లు 60 సంవత్సరాల పయిగా అధికారంలో ఉన్నారు. వాళ్లదేశం యూరోపులో కెల్లా పేద దేశం. కమ్యూనిస్టుల విధానాలు ఫలితాలు ఇవ్వలేవు. సోవియెట్ రష్యా వారు ఉపగ్రహాలని ప్రయోగించారంటారా ? అణ్వస్త్రాలు అమర్చిన క్షిపణులు తయారుచేసుకుంటున్నారంటారా ? అయితే ఏమిటట ? భారతదేశంలో 30 కోట్ల మంది 'దరిద్ర రేఖ కింద' జీవిస్తున్నారని కమ్యూనిస్టులే అంటారు ! మరి ఈ దేశమూ ఉపగ్రహాలని ప్రయోగించ లేదూ ? ★





వసుంధర

# గాంధీ

కాలవాహినిలో చరిత్ర పురాణమవుతుంది. ఇందుకు సాక్ష్యం ఒకనాటి రాముడు, కృష్ణుడు—ఈనాటి గాంధీ!

మానవత్వపు విలువలు మరుగున పడిపోతున్నపుడు అవతార పురుషుల ఆగమనం అవశ్యమవుతుంది. అహింసా సిద్ధాంతంతో ఒక మహా సామ్రాజ్యాన్ని గడగడలాడించిన మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ అవతార పురుషులలో చేరతగినవాడనడంలో సందేహం అణుమాత్రం లేదు.

చిన్నతనం నుంచీ గాంధీ కథ నన్ను ప్రభావితుణ్ణి చేసింది. ఆయనను మనిషిగా కాక భగవంతుడిలా భావించేవాడిని నేను. అందుకు కారణం గాంధీ మరణానికి నాలుగు సంవత్సరాల ముందు మాత్రమే నేను పుట్టడం!

గాంధీజీ గురించి అంతా నాకు చెప్పేవారు. పాఠ్యపుస్తకాలలో కథలు వచ్చేవి. నా తాతగారు, తండ్రిగారు గాంధీని చూసి ఉన్నారు.

ఆ తరువాత ఎక్కడ ఉపన్యాసాలు విన్నా గాంధీ పేరు వినబడేది. ఏ వూళ్ళో చూసినా గాంధీ బొమ్మలు కనబడేవి. సినిమాలలో ఏదో ఒక పాటలో గాంధీజీని చూపడం జరుగుతూండేది. ఆయన కనపడగానే థియేటర్లో చప్పట్లు—ఇవన్నీ నాకాయన పైన అపురూప భావాన్ని కలిగించాయి. హైస్కూల్లో నేను గాంధీ గొప్పతనం గురించి చాలాసార్లు మాట్లాడాను.

కాలం పరుగెడుతోంది. గాంధీ పేరుతో కాంగ్రెసు పార్టీ అధికారంలోకి వచ్చింది.

ఏళ్ళు గడిచినా స్వతంత్ర భారతంలో ఆశించిన అభివృద్ధి కానరావడంలేదు. దేశంలో సంపద పెరుగుతూంటే సంపదను మించి జనం పెరుగుతున్నారు. అతివృష్టి, అనావృష్టిలకు తోడు మతకలహాలు, యుద్ధాలు దేశాన్ని పీల్చిపిప్పిచేస్తున్నాయి. అభివృద్ధి పథకాలకు అవినీతి అవరోధమయింది.

స్వతంత్రం వచ్చినా అభివృద్ధి సాధించలేకపోతున్నామని కొందరు వాపోతున్నారు. మనకు స్వతంత్రం ఎందుకు వచ్చిందీ అని కొందరు బాధపడుతున్నారు. అసలు మనకు స్వతంత్రం వచ్చిందా అని కొందరు ఆశ్చర్యపడుతున్నారు.

భారతదేశం బిచ్చగాళ్ళ దేశంగా విదేశాలలో పేరుకెక్కుతున్నది. అనేక రంగాలలో దేశం ప్రగతిని సాధించి ముందడుగువేసి జేజే లందుకున్న మాట అసత్యంకాదు. కానీ ఏదేశంలో అయితే తిండిలేనివాడు ఒక్కడైనా ఉంటాడో—ఆ దేశపు ప్రగతికి అర్థంలేదు. ప్రతి పౌరుడికీ కనీసావసరాలు తీరేవరకూ దేశం నిర్విరామంగా కృషి చేయాలి. భారతదేశంలో అన్నార్తులు, అసహాయులు కోట్లసంఖ్యలో ఉన్నారు. యుద్ధప్రాతిపదికపై పేదరికాన్ని రూపుమాపే ప్రయత్నాలు దేశంలో జరగడం లేదు.

దేశం ముందుకు పరుగెడుతున్నది. ఆ వేగంతో సరితూగగలవారు దేశంతో సమంగా పరుగెడుతున్నారు.

ఎన్నో పర్యాయాలు దేశం పరిస్థితి చూసి నేను వేదన చెందాను. నాయకులు తమకు పేరుప్రతిష్ఠలు తెచ్చే పనులు మాత్రమే చేస్తున్నారు. ప్రజల బాగోగుల గురించి వారాలోచించడం లేదు.

చాలా పర్యాయాలు నేను గాంధీ గురించి తలంచుకొని—"ఆయన మరికొంతకాలం బ్రతికినా బాగుండేది. లేదా అలాంటి వ్యక్తి మరొకడు జన్మించినా బాగుండేది—" అనుకున్నాను.

నేను గాంధీ భక్తుణ్ణి. తను నమ్మిన సిద్ధాంతాన్ని ముందు తనే ఆచరించి చూపిన ఆ మహనీయుణ్ణి ఎవరూ ఎందుకు ఆదర్శంగా తీసుకొనడంలేదు? అని నాకు బాధగా ఉండేది.

అప్పుడే నేను గమనించాను. కాలవాహినిలో గాంధీ మరుగున పడిపోతున్నాడు. ఇప్పుడు చాలా మంది గాంధీ అంటే ఇందిరాగాంధీ అనుకుంటున్నారు.







వేల సంవత్సరాలుగా చరిత్రలో నిలబడిన మహాపురుషు లెందరో ఉండగా—గాంధీ అచిర కాలంలోనే మరుగున పడిపోతున్నందుకు నాకు బాధ కలిగింది. అప్పుడే నాకు గాంధీపై ఎవరైనా చిత్రం తీస్తే బాగుండుననిపించింది.

విజ్ఞానశాస్త్రం మనిషికందించిన మహత్తర కానుకలలో చలనచిత్రం ఒకటి వినోదానికి చలన చిత్రానికి దీటైనది లేదు. విదేశాలలో విజ్ఞానానికి కూడా విజయవంతంగా ఉపయోగపడుతున్నది.

చలనచిత్రాలు మనిషిపై చూపే ప్రభావం బలమైనది. అందుకే వ్యాపారస్థులు, రాజకీయ నాయకులు — ప్రచారానికి చలనచిత్రాలను ఉపయోగించుకుంటున్నారు.

సినిమాలు చూసి పిల్లలు చెడిపోతున్నారనీ, నేరస్థుల సంఖ్య పెరుగుతున్నదనీ చాలామంది అంటున్నారు. అలాగే భక్తిరస చిత్రాలు చూసి మార్పుచెందిన వారెందరో ఉన్నారు. వాహినీవారి భక్తపోతన— మున్మిడివరంలో బాలయోగిని సృష్టించింది సినీనటుడు శ్రీ ఎన్టీ రామారావు కేవలం సినిమా గ్లామర్ కారణంగా తెలుగుదేశాధినేత అయినాడు

అలాగే గాంధీ సినిమా ఎవరైనా తీస్తే ?

పుస్తకాలలో చదివి గాంధీ గురించి ఎవరూ ఎక్కువగా ప్రభావితులవుతున్నట్లు కనపడదు ఎందుకంటే నా పిల్లలిద్దరూ గాంధీ చరిత్ర చదివారు పదకొండేళ్ళ వయసున్న నా కూతురు చాలా తరచుగా— ''ఐ హేట్ గాంధీ—'' అంటూంటుంది.

ఒకటి రెండుసార్లు బాల్యచాపల్యంగా వదిలేసినా ఈ అభిప్రాయం బలపడుతున్నదని గ్రహించి ఒకరోజున వాదనకు దిగాను.

''ఎందుకమ్మా గాంధీని అసహ్యించుకోవడం ?''

''ఆయన కారణంగా దేశం రెండు ముక్కలయింది హిందువులు, ముస్లిములు ముందు చులకన అయ్యారు సత్యాగ్రహాలు ఎక్కువై దేశం

# గాంధీ

వెనుకడుగు వేస్తున్నది...'' అంటూ పురాణం మొదలు పెట్టింది.

ఇవి తనకుకలిగిన భావాలయుండవు. ఎవరో ఆమెలో బలవంతంగా ప్రవేశపెట్టిన అభిప్రాయాలివి

నేను నవ్వి—''గాంధీ చెప్పినట్లు చేస్తూండడం వల్లనే మనదేశం ఇలాగుందను కుంటున్నావా ?'' అన్నాను

''అవును—'' అన్నది నా కూతురు.

''చూడమ్మా—నీ వయసుపిల్లకు గాంధీ గొప్పతనం అర్థంకాదు. భగవంతుడి విగ్రహాన్ని కాలితో తాకినా పాపంరాదుకానీ గాంధీనిదూషిస్తే నీకు పాపం వస్తుంది. ఎందుకో చెబుతాను విను—'' అంటూ మొదలు పెట్టాను.

గాంధీ పాటించిన కఠోర నియమాలు ఆచరణకు ఎంత కష్టమైనవో—ఆయన ఎటువంటి సామాన్య జీవితం గడిపాడో అమ్మాయికి తెలియజెప్పాను.

తరువాత—''గాంధీ అన్ని మతాలనూ సమంగా చూడమన్నాడు, చూశారు. హిందీని జాతీయభాష చేయమన్నాడు, చేశారు. కాంగ్రెస్ పార్టీకి పట్టం కట్టమన్నాడు, కట్టారు. ఎందువల్ల ? ఇవన్నీ తమకు అనుకూలంగా ఉన్నాయి కాబట్టి. రాజకీయ నాయకుల గురించి నీకు తెలియదు. గాంధీ దేశంగురించీ, మానవత్వపు విలువల గురించీ ఆలోచిస్తే వారు కేవలం తమ స్వార్థం గురించే ఆలోచిస్తారు. లేకుంటే గాంధీ యింకా ఏం చెప్పాడు ? విదేశీవస్త్రాలు విడనాడమన్నాడు. అందర్నీ ఖద్దరు ధరించమన్నాడు. విలాసాలకు దూరంగా ఉండమన్నాడు. భారీ పరిశ్రమలకు మించి కుటీర పరిశ్రమలకు ప్రోత్సాహమివ్వమన్నాడు. వీటిలో మన నాయకులు ఏం చేశారు ? సంపన్న దేశాలకు మనదేశాన్ని గుత్తగా ఇచ్చివేశారు. దేశ పరిపాలన విషయంలో గాంధీ చెప్పిన మాట ఒక్కటీ పాటించలేదు. దానికి ఆయన్ను ఆడిపోసుకుని లాభమేమిటి ?'' అన్నాను.

నా అమ్మాయికి నేను చెప్పినది అంతగా అర్థంకాలేదు. నా భావాలతో ఏకీభవించినా లేకపోయినా నా ఎదురుగా గాంధీనితిట్టడం మానేసింది. నా అబ్బాయి మాత్రం కుతూహలంగా గాంధీ గురించి మరికొన్ని వివరాలడిగి తెలుసుకున్నాడు. ఆ తర్వాత అక్కా తమ్ముళ్ళిద్దరూ గాంధీ గురించి చర్చలు జరుపుతూండేవారు.

గాంధి గొప్పవాడని అబ్బాయి—కాదని అమ్మాయి ! ఆఖరికి అబ్బాయి నా దగ్గరకు వచ్చి అక్కమీద పితూరీ చెప్పేవాడు.

''గాంధీ గొప్పతనాన్ని నీవునిజంగా గుర్తిస్తే ఇలా అక్కమీద పితూరీ చేయవు—'' అని వాణ్ణి పంపించేశాను.

ఇటువంటి సమయంలో సర్‌రిచర్డ్ అటెన్‌బరో గాంధీవల్ల ప్రభావితుడై ఆయన జీవిత గాథను తెరకెక్కించడం జరిగింది. ఆ చిత్రానికి దేశ విదేశాల్లో అఖండ ఖ్యాతి లభించింది. ఎనిమిది ఆస్కార్ అవార్డులను నెగ్గుకొని–చరిత్రను కూడా సృష్టించింది.

గాంధీ సినిమా గురించి నేను ఎన్నో విశే

## నిద్రాపుష్పం

కాలం తెస్తున్న మార్పుకి
లొంగకుండా
భూతం ఇచ్చిన తీర్పుకి
బెదరకుండా
వర్తమానానికి చలించకుండా
భావిలోకి తొంగిచూడకుండా
నిశ్చలంగా నీరవంగా నిర్మలంగా
నిద్రపోతున్నది
సమాధిలోని నా పువ్వు ఒక్కటే.

— డా॥ ఆర్వీయస్ సుందరం

లక్షలాది ప్రజలకు సూపర్ భావం కలిగించే టీ!





"సూపర్ రుచి"





"సూపర్ డికాక్షన్"



"సూపర్ పొదుపు"

బ్రూక్ బాండ్
సూపర్ డస్ట్

భారత దేశంలో
అత్యధికంగా అమ్మబడు
చున్న ప్యాకెట్ టీ




HTC-BBI-5287



విజయవాడ కార్టూనిస్టుల సంఘం 5వ వార్షికోత్సవం సందర్భంగా ఏర్పాటు చేసిన రాష్ట్ర స్థాయి కార్టూన్‌ల పోటీ కార్టూన్‌ల ప్రదర్శనకి విజయవాడ అర్బన్ జిల్లా పోలీసు సూపరింటెండెంట్ శ్రీ కె. ఎస్. వ్యాస్ ప్రారంభోత్సవం చేశారు. శ్రీమతి అరుణావ్యాస్‌నీ, కార్టూనిస్టు సంఘం సభ్యులని చిత్రంలో చూడవచ్చు.

షాలు విన్నాను. అందులోని నటీనటులను, దర్శక నిర్మాతను టెలివిజన్‌లో ఇంటర్వ్యూ చేయడం చూశాను. బెన్‌కింగ్‌స్లీ గాంధీని అనుకరించ డానికీ, ఆయనలా అగుపించడానికీ ఎంత శ్రమ పడ్డాడో, ఎంత శ్రద్ధ తీసుకున్నాడో తెలుసు కున్నాను.

గాంధీ వ్యక్తిత్వం విదేశీయులను విపరీతంగా ఆకర్షించింది. ఎవరీ గాంధీ ? ఇటువంటి వ్యక్తి ఒకడు నిజంగా ఉన్నాడా ?— ఇలాంటి సందేహాలతో ఎందరో విదేశ యాత్రికులు భారతదేశం వచ్చి ఆయన సమాధినీ, ఆయనకు సంబంధించిన ప్రదేశాలనూ దర్శించి వెళ్ళారు.

ఐన్‌స్టీన్ అననే అన్నాడు— ముందు తరాల వాళ్ళు— ఇటువంటి వ్యక్తి ఒకడు సజీవంగా నేలపై నడిచాడంటే నమ్మలేరు— అని.

గాంధీ చిత్రం ఈ విషయాన్ని ఋజువు చేసింది.

గాంధీ చిత్రం మా ఊరు రావడం ఆలస్య మయింది. నేను ఆత్రుతగా ఎదురు చూస్తున్నానా చిత్రం కోసం!

విదేశీయులను ఎంతగానో ప్రభావితం చేసిన ఆ చిత్రం భారతీయుల్ని ప్రభావితుల్ని చేయక తప్పదు.

చివరికి ఆ చిత్రం మా ఊరు వచ్చింది. దానికి వినోదపు పన్ను మినహాయించడం వలన టికెట్ కూడా చాలా తక్కువయింది.

నేను వెంటనే వెడదామనుకున్నాను కానీ చాలా రష్‌గా ఉంటున్నదని భయపడి ఆలస్యం చేశాను. ఈలోగా అమ్మాయి అబ్బాయి కూడా నాకంటే ముందు ఆ చిత్రం చూసేశారు. వాళ్ళ స్కూలునుంచి పిల్లలందరినీ తీసుకుని వెళ్ళారుట.



## గాంధీ

సినిమా నుంచి తిరిగి వచ్చేక అమ్మాయి ఏడుస్తూ కూర్చుంది. గాంధీ గొప్పతనం సినిమా చూసేకనే ఆమెకు అర్థమయిందట. ఇంతకాలం ఆ మహాపురుషుణ్ణి తాను అర్థం చేసుకోలేదనీ— తన యావజ్జీవితాన్నీ మానవత్వపు విలువల కోసం త్యాగంచేసిన గాంధీని తను ఆ రోజునుంచీ దేవుడిగా భావించి కొలుస్తాననీ అన్నది. గాంధీ పడిన కష్టాలను తల్చుకుని ఆ రోజు చాలా సార్లు ఏడ్చిందామె.

అబ్బాయి నాదగ్గరకు వచ్చి — ఈ రోజు నుంచీ అబద్ధంచెప్పననీ, దురలవాట్లను ఊహలోకి కూడా రానివ్వననీ నాకు మాట ఇచ్చాడు.

### గిన్నిస్ బుక్‌లో భారతీయ విద్యార్థి!

1980 మే 21 నుండి 1981 డిశంబరు 20 వరకు, 19 నెలల్లో ఎక్కువ కాలాన్ని రైలు ప్రయాణంలో గడిపిన భారతీయ విద్యార్థి పేరు గిన్నిస్ బుక్‌లో నమోదు అయింది. ఇతని పేరు సునీల్. ఇతడు ఢిల్లీ వాస్తవ్యుడు. ఢిల్లీలో జర్మను భాషను అధ్యయనం చేసి చదువును కొనసాగించటానికి పశ్చిమ జర్మనీ వెళ్ళాడు. జర్మనీని గురించి ప్రత్యక్షంగా తెలుసుకోవాలనే కుతూహలం అతడిని నిలవనివ్వలేదు. ప్రతి నెలా సీజన్ టిక్కెట్లు కొని ఎక్కువ కాలాన్ని రైలులోనే ప్రయాణం చేస్తూ గడిపాడు.

ఇద్దరు పిల్లలలోనూ అంతగా మార్పు తీసుకుని వచ్చిన గాంధీ చిత్రాన్నీ, గాంధీ పాత్రధారి బెన్ కింగ్‌స్లీనీ, చిత్రనిర్మాత అటెన్‌బరోనీ మనసారా అభినందించు కున్నాను. అసలు గాంధీ చిత్రం ఘనవిజయం సాధించడమే ఆయన చరిత్రకు విజయం.

రోజులు గడిచిపోతున్నాయి. ఎన్నాళ్లయినా ఇంకా రష్‌గానే ఉన్నదంటున్నారు. కాస్త పెందరాళే వెడితే టికెట్లు దొరకగలవని కొందరన్నారు.

ఒక చిత్రం గురించి ఇలాగే చెప్పుకున్నారు. ఉన్నట్టుండి అది వెళ్ళిపోయింది. ఈ శతాబ్దానికే ఒక మహత్తర చిత్రంగా అభినందించబడుతున్న ఈ చిత్రం చూడకుండా వెళ్ళిపోతుందేమోనన్న భయంకూడా నాకు కలిగింది.

అదీకాక —చలనచిత్రం మనిషిపై ఎలాంటి ప్రభావం చూపిస్తుందో గాంధీ — నాకు తెలియ జెప్పింది. ఇంకమీదట పిల్లలను క్రైం, రొమేన్స్ వుండే చిత్రాలకు పంపకూడదనికూడా అనుకున్నాను. అందుకే ఊళ్ళో ఆడుతున్న అంధాకానూన్ చిత్రానికి పిల్లలను వెళ్ళనివ్వడం లేదు. వాళ్ళు చాలా రోజులుగా నన్నడుగుతున్నారు.

"నేనూ గాంధీ చూశాక అప్పుడు మిమ్మల్ని అంధాకానూన్‌కి పంపిస్తాను—" అన్నాను.

అందుకని వాళ్ళు నన్ను రోజూ గాంధీ సినిమాకు వెళ్ళమని చంపేస్తున్నారు.

చివరికి ఒకరోజు రిక్షాలో శ్రీమతి, నేను థియేటర్‌కి వెళ్ళాం సినిమా 11—45 కి. మేము 10—30కి వెళ్ళి కౌంటర్‌వద్ద క్యూలో నిలబడ్డాం. అప్పటికింకా ఒక్కరుకూడా లేరు. రష్ లేనందుకు నేను చాలా ఆనందపడ్డాను.

అలా అయిదు, పది, పదిహేను... ముప్పై నిముషాలు గడిచాయి. కౌంటర్ ఇంకా తెరుచుకోలేదు.

అవతలపక్కగా ఉన్న దర్వాన్ నాకు తెలుసు. అతడు నావంకే చూస్తున్నాడు. చేయెత్తి పిలిచాను.

"ఇక్కడ నిలబడ్డారేంసార్—"అన్నాడతను.

"బుకింగ్ ఇంకా తెరవరేం —?" అన్నాను.

"తెరిచారు సార్ — టికెట్లన్నీ అయి పోయాయి—"

తెల్లబోయాను. సినిమా ప్రారంభానికి గంట ముందు దాకా టికెట్లు ఇవ్వకూడదే — ఇలా ఎలా జరిగింది — అనుకున్నాను.

దర్వాన్ నావంక అభిమానంగా చూసి— "మీకు కావాలంటే రెండు టికెట్లు బ్లాకులో తెస్తాను సార్ !" అన్నాడు తగ్గుస్వరంలో.

"బ్లాకులోనా—వద్దు !" అన్నాను.

గాంధీ మహాత్ముడి జీవితగాథను చూడ డానికి అడ్డదారి తొక్కడం నా కిష్టంలేదు. యింతలో నా స్నేహితుడొకడు అక్కడ ప్రత్యక్ష మయ్యాడు.

# ధర్మపథం

బులుసు వేంకట రమణయ్య



## తిన్నని భక్తి

భక్తులు భగవంతుణ్ణి పూజించినప్పుడు, తమ శక్తి ననుసరించి, తమకు ఉచితమని తోచిన పుష్పాలను, ఉపాహారాలను సమకూర్చుకొంటారు. శ్రీమంతులు మిక్కిలి సువాసనగల పుష్పాలను, విలువైన ఆహార పదార్థాలను, ఫలాలను, సుగంధ ద్రవ్యాలను సమర్పిస్తారు. సామాన్యులు సాధారణములైన వాటినే సంపాదించగలుగుతారు. భక్తుడైన కుమ్మరి మట్టితో చేసిన పువ్వులతో శ్రీనివాసుని పూజించిన గాథ అందరికీ తెలుసు. భగవంతుని దృష్టిలో అన్నిరకాల పూజలూ సమానమే. ఎక్కువ తక్కువ భేదం దేవునికి లేదు. భక్తియే ప్రధానం. పరిశుద్ధమైన భక్తి ఉన్నప్పుడు ఎట్టి హేయమైనవీ, భగవంతునికి హేయాలుగా తోచవు.

తిన్నడు ఆటవిక నాయకుడగు నాథనాథునకు తందెయను భార్యయందు కలిగిన కుమారుడు. మిక్కిలి గారాబంగా పెరిగినాడు. తండ్రి ఆ బాలునికి ఆటవికులకు కావలసిన విలువిద్య, వేటాడు పద్ధతి మున్నగువాటిని నేర్పి, మంచి రోజున మిత్రులతో అడవికి పంపెను. పూర్వజన్మ పుణ్యం కారణంగా ఆ బాలునికి దైవభక్తి చిన్నప్పుడే అలవడినది. ఆ అడవిలో ఒక చోట తిన్ననికి కలుజువ్వి చెట్టునీడలో ఒక శివలింగము కానవచ్చినది. ముగ్ధుడైన ఆ బాలుడు అది శిలామయమని గ్రహించక శివుడే అని నిశ్చయించి, ఆ దేవుడు అక్కడ ఒంటరిగా, ఎండ వానలకు బాధపడుటను సహించక, తనతో, తమ యూరికి రమ్మని ప్రార్థించెను. లింగము కదలలేదు. అతని మిత్రులు ఇంటికి రావలెనని ఎంత బతిమాలినను తిన్నడు ''ఈ లింగము నాతో వచ్చిననే ఇంటికి వచ్చెదను. లేకపోతే నేను ఇక్కడనే ఉండిపోతాను'' అని గట్టిగా చెప్పగా, స్నేహితులు వెళ్లిపోయారు.

లింగరూపమైన శివుడు చాలా రోజుల నుంచీ పస్తు ఉన్నాడని జాలిపడి, అతని ఆకలిని తీర్చుటకు తిన్నడు వేటకుపోయి, ఒక పందిని చంపి, దాని మాంసమును రెండు ఆకు దొప్పలలో నింపెను. శివునికి అభిషేకము చేయుటకయి, ప్రక్కనున్న సువర్ణముఖీ నదికి పోయి, తన నోటినిండుగా నీరు నింపి, వచ్చి, ఆ పుక్కిటి నీటితో లింగమును స్నానము చేయించి, మాంసపు దొప్పలను ముందుంచి భక్షింపగోరెను. లింగమేమియు పలుకలేదు. మాంసమును తినలేదు. దానికి తిన్నడు బాధపడి ''దేవా! నీవు దీనిని తిననియెడల నీ యెదుటనే ప్రాణములు విడిచెద''నని ప్రతిజ్ఞ పట్టెను. తిన్నని కృత్యములు హేయములేయైనను, వాని ప్రగాఢ భక్తి మహేశ్వరునాకర్షించి, ఆ మాంసము భక్షించి వానికి తృప్తిని కలిగించెను. ఇట్లే కొన్ని దినములు జరుగగా, శివుని పూజించు భక్తుడగు బ్రాహ్మణుడు వచ్చి, ఇది చూచి ఏవగించుకొనెను. శివుడాతనకి తిన్నని భక్తినిగూర్చి తెలిపి, చాటుగా ఉండి గమనింపగోరెను.

ఆనాడు తిన్నడు పెట్టిన మాంసమును శివుడు తినలేదు. ఒక కన్నునుండి నీరు కారుచుండెను. తిన్నడెన్ని చికిత్సలు చేసినను ప్రయోజనము లేకుండెను. కంటికి కన్నే మందని అతడు తన కంటిని ఒక దానిని పెరికి శివుని కతికెను. తర్వాత రెండవ కంటి నుండి నీరు కారసాగెను. తిన్నడు తన రెండవ కంటినికూడ ఊడబెరికుటకు సిద్ధపడగా, శివుడు ప్రత్యక్షమై ఆ బ్రాహ్మణునకు మిక్కిలి ఆశ్చర్యము కలిగించెను. శివుని అనుగ్రహమున తిన్ననికి ముక్తి లభించెను. దేవునికయి, సాహసించి తన కన్ను ఇచ్చినందున తిన్ననికి అప్పటినుండియు ''కన్నప్ప'' అను పేరు ప్రసిద్ధమయ్యెను.

తనయందు సాటిలేని భక్తి ఉన్నప్పుడు భగవంతుడు ''ఇది హేయము, ఇది అహేయము'' అని పరిగణింపడని తెలుస్తున్నది. ★

---

నేను నా పరిస్థితి చెప్పుకున్నాను.

నా స్నేహితుడు నవ్వి– ''ఎంటర్‌టైన్‌మెంట్ టాక్సు లేదుకదా–బ్లాకులో కొన్నా–ఎప్పటిధరే అవుతుంది. డబ్బు కక్కుర్తి చూపింకు. సినిమా బ్రహ్మాండంగాఉంది. నేను రెండో సారి బ్లాకులో కొనుక్కుని చూస్తున్నాను–'' అన్నాడు.

''వద్దులే–మళ్ళీ ఇంకోరోజు వస్తాను–'' అన్నాను.

''ఎప్పుడొచ్చినా యింతే – సినిమా మంచి డిమాండులో ఉంది. ఇంకో వారం మాత్రమే ఈ ఊళ్ళో ఉంటుంది. థియేటర్‌యజమాని శాస్త్రానికో పాతిక టికెట్లు అమ్మి మిగతావన్నీ బ్లాక్ చేసేస్తున్నాడు. ఈ శతాబ్దానికే విశేషమైన ఈ చిత్రం చూడడం విషయంలో నువ్వు కక్కుర్తి పడకూడదు''–అన్నాడు స్నేహితుడు.

''అవునండీ– బ్లాకులో తీసుకుందాం''— అన్నది శ్రీమతి.

బ్లాకు మార్కెట్ బాహాటంగా చెలరేగుతోంది.

''వద్దు–వెళ్ళిపోదాం–'' అన్నాను.

శ్రీమతి కనులలో నిరుత్సాహం కొట్టవచ్చినట్లు కనబడింది. నాకు జాలివేసింది.

అప్పుడు నా స్నేహితుడు–''అంతగా నీకు బ్లాకులో కొనాలని లేకపోతే గాంధీక్లాసుకు వెళ్ళు. అదంతా ఖాళీయే–'' అన్నాడు.

''ఏమిటీ ?'' అన్నాను.

గాంధీక్లాసంటే సెకండ్‌క్లాస్. థియేటర్లో తెరకు ముందుగా ఉండే క్లాస్ అది. ఆ క్లాసును గాంధీక్లాసని–గాంధీ సినిమా చూసిన నా స్నేహితుడంటున్నాడు. అతడు గాంధీ సినిమా రెండవ సారి చూడడానికి వచ్చాడు.

నేను, శ్రీమతి మొదటిసారిగా గాంధీ క్లాసుకు వెళ్ళాం. సినిమా చూశాం.

శ్రీమతికి సినిమా బాగా నచ్చింది. నాకు నచ్చలేదు.

''దీనికి గాంధీ పేరుబదులు — గాంధీ జీవితం నుంచి కొన్ని దృశ్యాలు -- అని పేరు పెట్టవలసింది. ఇందులో గాంధీ చరిత్ర లేదు. భారతదేశ స్వాతంత్ర్య గాథలేదు'' అన్నాను.

''సినిమా చూడక ముందే మీకో అభిప్రాయం ఏర్పడిపోయింది'' అంది శ్రీమతి.

''నిజంగా ఈ సినిమా బాగుంటే గాంధీ చరిత్ర ప్రేక్షకుల్ని ప్రభావితుల్ని చేయాలి. బ్లాక్‌మార్కెట్ తప్పు అని థియేటర్ యజమాని గుర్తించడంలేదు. బ్లాక్‌లో టికెట్స్ కొనడం తప్పు అని ప్రేక్షకులు గుర్తించడంలేదు. వాళ్ళు సినిమా చూపిస్తున్నారు. వీళ్ళు చూస్తున్నారు. బ్లాకులో టికెట్స్ కొనం అని ప్రేక్షకులంతా కనీసం గాంధీ చిత్రం విషయంలోనైనా నిర్ణయం తీసుకోలేకపోయారంటే–గాంధీ కథను సినిమాగా తీసి మాత్రం ఏం లాభం ?'' అన్నాను.

దక్షిణాఫ్రికాలో పాస్‌పోర్టులను, భారతదేశంలో విదేశీ వస్త్రాలను దహనం చేసిన గాంధీ సత్యాగ్రహోద్యమం ఇప్పుడు విద్యార్థులకు, కార్మికులకు, ఉద్యోగులకు తప్ప — మరెవ్వరికీ ప్రయోజనకారి కాకుండా ఉన్నదా ?

హృదయంలో ఆవేదన అలముకున్నది.

ఇంటికి వెళ్ళాక — అంధాకానూన్ — చూడడానికి పిల్లలకు అనుమతినిచ్చాను. వాళ్ళు ఆ చిత్రాన్ని బ్లాకులో చూశారు. ★

# సీరియల్ యక్షగానం

## స్వర్గీయ శ్రీమతి మాదిరెడ్డి సులోచన

(గత సంచిక తరువాయి)

హైద్రాబాద్ వచ్చినా నా మనసు అంతా చక్రధర్ చుట్టే తిరిగింది అతను నిజంగా... యెలా చెప్పను. చెప్పకోలేను. అంతగా ప్రభావితురాలిని చేసాడు.

డాక్టరు రమ్మన్నదని నెలకొకసారి వెళ్ళేదాన్ని.

డాక్టరు నేను గర్భవతిని అని చెప్పింది. ఇంట్లో వారి ఆనందానికి అంతులేదు

నందనరావుగారు పొంగి పోయారు.

''డాక్టర్లంతా ఏదో మొనగాళ్లని భ్రమ పడ్డావు చూచావుగా...'' అన్నారు.

అసలు విషయం ఆయనకు తెలిస్తే... నన్ను చంపి, తనూ ఆత్మహత్య చేసుకుంటారు. ఒక్కసారి చక్రధర్‌ను కలవాలి. ధన్యవాదాలు చెప్పాలనుకున్నాను

నందనరావుతో డాక్టరును కలుస్తానని చెప్పాను. తనూ వచ్చి ఆవిడకు కృతజ్ఞతలు చెబుతానన్నాడు.

''మీరు వ్యాపారం వదిలి రావద్దు''అన్నాను ఆతడితో ఎన్నో అబద్ధాలు ఆడి, బొంబాయి ప్రయాణం అయ్యాను. రూబీని కలుసుకున్నాను.

''చక్రధర్ లేడా ? '' అన్నాను ఆదుర్దాగా

''లేడు. అయినా అతనితో ఏం పని ? ''

అన్నది. తెల్లబోయాను. నా అవస్థ గమనించిన రూబీ సన్నగా నవ్వింది.

''మీరు అతనికి ధన్యవాదాలు చెప్పాలనుకుంటున్నారు అవునా! అతను మిమ్మల్ని ప్రేమించి ఆరాధించి తిరుగలేదు. అవసరం, పరస్పర సహకారం అంతే. ఇంకా అనుబంధాలు పెంచుకోవటం అర్థరహితం'' అన్నది.

''కావచ్చు...కాని . ''

''నాకు తెలుసు. అతను కొందరికి మానసిక స్థితి మెరుగు చెయ్యాలని, మరికొందరితో నపుంసకుడయిన భర్త ఇవ్వలేని సుఖాలు ఇవ్వాలని తిరిగాడు. అందరిని గుర్తుపెట్టుకుంటే జీవితం ఏముంది ! ఫర్‌గెట్ ఇట్ ... '' అని భుజం తట్టింది. నాకు కళ్లనీళ్ల పర్యంతం అయింది. అవును అతను ఎందరితోనో తిరిగాడు. అందరినీ గుర్తు పెట్టుకుంటే యెలా !

ప్రేమ పేరుతో పబ్బం గడుపుకుంటారు కొందరు. అవసరం తీరగానే అవతల పడతారు. ఇది అలాంటి కేసు కాదు

పెళ్లి చేసుకుని ఏదో కారణంగా విడిచి పెడతారు మరికొందరు. అలాంటి కేసు కాదు.

అతి విచిత్రమైన కేసు. భారమైన హృదయంతో వెనుతిరిగాను

''దేవీ! నాకు పెద్ద డాక్టరునయి,నాలాంటి నిరాశ్రయులను ఆదుకోవాలని అనిపిస్తుంది.''

''దేవీ ! మీ మెడ శంఖంలా ఉంది'' అని చుంబించేవాడు

అతని ఒక్కొక్క మాట తేనెల ఊట ! మరిచిపోవాలి తప్పదు.

''దేవీ ! విదేశాలకు వెళ్లి ఇంకా కొత్త విషయాలు కనుక్కోవాలని ఉంది. యెలా ?''

అనేవాడు అతని ఆర్థిక ఇబ్బంది నాకు తెలుసు.

నా దగ్గరున్న డబ్బు రూబీ చేతిలో పెట్టాను

''మిసెస్ రూబీ ! చక్రికి విదేశాలలో చదువాలని ఉంది. ఈ డబ్బు అతనికి అందజేయవా !'' అన్నాను కన్నీటితో.

''ష్యూర్ !'' అన్నది. డబ్బిచ్చి, భారంగా తిరిగి వచ్చాను ఇంట్లో అందరూ ఆనంద డోళికలలో ఊగులాడుతున్నారు. నాకు మాత్రం అతనొక్కసారి కనిపిస్తే బావుండును అనిపిస్తుంది.

అలా ఎదురు చూస్తుండగానే నువ్వు పుట్టావు వంశోద్ధారకుడు కావాలనుకుంటే మహాలక్ష్మి పుట్టింది. ఈసారి కొడుకును కనాలమ్మాయ్ అన్నారు నవ్వి ఊరుకున్నాను.

''వాళ్ల మాటలకేంలే ముకుందా! మనిద్దరి ప్రేమ చిహ్నం పాప. ఏ పాపయితేనేం ! '' నందనరావుగారు నిన్ను అపురూపంగా చూచే

**జరిగిన కథ — 14 :** ఇక తను ఆడే నాటకాన్ని విరమించాలని ప్రయత్నిస్తుంటుంది ముకుందాదేవి. ముకుందాదేవి ఇంట్లో దోపిడి జరుగుతుంది. తను ఇంతకాలం నాటకం ఆడి భక్తుల ముడుపుల ద్వారా సంపాదించిన సొమ్మును కొంచెం కూడా మిగల్చకుండా ఎత్తుకుపోతారు ముకుందాదేవి ఆదిత్యపై నేరం మోపి అరెస్ట్ చేయిస్తుంది. చైనులూ, రాయుడూ కలసి ఈ దొంగతనం చేశారని నీలిమ చెప్పినా వినదు ఆ ఆస్తి కోసమే కాచుక్కూచున్న సావిత్రి తన కొడుకుతో వెళ్లిపోతుంది. డాక్టర్ శివాజి ఇచ్చిన పేపర్ ప్రకటన చూసి అప్లికేషన్ పెట్టిన నీలిమను ఆహ్వానిస్తాడు శివాజి. వారిరువురూ మాట్లాడుకొన్న తర్వాత గుళ్లో పెళ్లి చేసుకోవాలని నిర్ణయించుకొంటారు ఆదిత్య కేసు వాయిదా పడుతుంది. నీలిమ తనకు పుట్టిన బిడ్డే అని ముకుందాదేవి ద్వారా తెల్సుకొంటాడు శివాజి. ఆదిత్యను బెయిల్‌మీద విడిపిస్తాడు. నీలిమను ఆదిత్యకిచ్చి పెళ్లి చేయాలని నిర్ణయించుకొంటాడు ఆదిత్య, నీలిమలకు తను విద్యార్థి జీవితంలో అనుభవించిన కష్టాలను చెపుతాడు డాక్టరు శివాజి. యువ తరంగిణి ప్రోగ్రాం నుంచి ఇంటికి వచ్చిన నీలిమ శివాజికి, తన తల్లికి గల అక్రమ సంబంధాన్ని తెలుసుకొని తల్లిని అసహ్యించుకొంటుంది. తన ఉనికినే అసహ్యించుకొనే తండ్రి ప్రవర్తనకు బాధపడుతుంది నీలిమ నీలిమను నందనరావు అనరాని మాటలంటుండగా ఆదిత్య వింటాడు. ఆదిత్య, నీలిమల పెళ్లి జరుగుతుంది. ఆ రోజే నందనరావు ఆత్మహత్యకు పాల్పడతాడు తండ్రి జేబులో తల్లి తనకు రాసిన జాబుని విప్పి చదవసాగింది నీలిమ.

వారు. నా హృదయం కలవరపడేది. నిజం చెప్పి భారం దింపుకుందాం అనిపించింది. కాని నిజము చెప్పిన మరుక్షణం, ఏమవుతుందో నాకు తెలుసు. ఒకనాడు ధైర్యంచేసి రూబీ అడ్రసుకు చక్రధర్ పేరున ఉత్తరం రాసాను. జవాబులేదు. నీకు

ఒక భాగం అద్దెకిచ్చినా రెండు పూటలు తినటానికి సరిపోలేదు. ఏం చేయాలో తెలియ లేదు. నా ప్రాణం, నాకు జీవితంలో చేదు కాదు మధురిమ కూడా ఉంటుందని తెలిపిన వ్యక్తి చక్రధర్. అతని తీపి గుర్తువు నీవు. నిన్ను పెంచాలి. అపురూపంగా పెంచాలి. అదే నా ధ్యేయం! ఏం చేయాలి! నా చదువుకు వచ్చే ఉద్యోగం చాలా తక్కువ. చిన్న చిన్న ఉద్యోగాలకు వెళ్తే అక్కడ కాస్త క్రింది తరగతి జనం



రెండు సంవత్సరాలు వచ్చాయి. మళ్లీ పెద్దవారి ఆరాటం ప్రారంభం అయింది. వారికి జీవితంలో మరే ధ్యేయం లేదు పిల్లలు తప్ప అన్నట్టు ప్రవర్తించారు.

ఏం చేయాలో తోచలేదు. అప్పుడే సావిత్రి భర్తతో విదేశాలకు వెళ్లింది. వెళ్తూ నీకు ఖరీదయిన బహూమతులు ఇచ్చింది. 'మా కోడలు' అన్నది. అదో అపూర్వమైన అనుభూతి.

''మా ఇంటికి మీ అబ్బాయే రావాలి'' అన్నాడు నందనరావుగారు. ఆనందంగా వారిని సాగనంపాను.

ఆ రోజు నిన్నెత్తుకుని నందనరావుగారి కోసం చూస్తున్నాను. ఆయన వ్యాపార నిమిత్తం వేరే ఊరు వెళ్లారు. రాగానే యెదురుగా నీవు కనిపించాలని ఆయన తపన. అందుకే నిన్ను తీసుకుని నిల్చున్నాను. డ్రైవర్ ఒంటినిండా గాయాలతో వచ్చాడు.

''అమ్మా ..అయ్యగార్కి యాక్సిడెంటు...'' అన్నాడు. కుప్పలా కూలిపోయాను. తెలిసిన వారి సహాయంతో ఆయనను ఆస్పత్రిలో చేర్చాను. ఒక వైపు పూర్తిగా పడిపోయింది. ఇంట్లోని నగదు, ఖరీదయిన వస్తువులు, అన్నీ ఆయన వైద్యం కోసం కరిగించాను. తిరుగరాని చోట్ల తిరిగాను. మంత్రాలు, తంత్రాలు, మొక్కుబడులు అన్నీ అయ్యాయి. ఆయన స్థితి మారలేదు. ఆస్తి అంతా కరిగిపోయింది.

నందనరావు తల్లి పోయింది. అసహాయంగా నువ్వు, నందనరావు,నేను మిగిలాము.

ఉంటారు. వారి మనసుల్లో ఏం లేకపోయినా, వెకిలిగా మాట్లాడతారు.

ఒక బీడీ ఫ్యాక్టరీలో చేసాను. ఆ వాతా వరణంలో అయిదు నిమిషాలు ఉండలేకపోయాను. బయటికి వచ్చాను. ఫారిన్‌లో పిల్లలను చూదు కున్నా బోలెడు సంపాదించ వచ్చట. సావిత్రికి రాసాను

'నందన్నయ్యను వదిలి వస్తే నీకు స్పాన్సర్ చేస్తాను.'' అన్నది. ఈ విషయం నందనరావుతో ప్రస్తావించాను.

''ముకుందా ! నువ్వు నీలును తీసుకుని వెళ్దామనుకుంటే, దాని చేతులతో ఇంత విషం

ఇష్టించు. అది లేకుండా బ్రతుకలేను.'' అన్నారు. ఏం చేయాలో తోచలేదు.

ఒకొక్కసారి ఆయన మొండికేసి, మందు త్రాగనంటే నిన్ను పంపేదాన్ని. నీ ముఖం చూచి త్రాగేవారు.

''ఎందుకు బ్రతకాలమ్మా ... నాకెవరున్నారు ?'' లంటూ ఏడ్చేవారు.

''నేనున్నాను.'' అనే దానివి. అది ఆయనకు టానిక్కులా పనిచేసేది. అతని నుండి నిన్ను దూరం చెయటం భావ్యం కాదు. నాకేం తోచలేదు. ఒకతను మనింట్లో అద్దెకు దిగాడు. అతను తను ప్రారంభించే కంపెనీలో పని ఇస్తానన్నాడు. తన అవసరాలు నన్ను తీర్చమన్నాడు. చేసేది లేక అంగీకరించాను.

ఒక రోజు ఇద్దరం దొరికిపోయే స్థితి ఏర్పడగానే, అతను నన్ను దేవుడిగా మార్చి, నా కాళ్ల దగ్గర మోకరిల్లాడు.

''ఏమేమో మాట్లాడుతుంది. నా గతం అంతా చూచింది చూచినట్టు చెప్పింది. అందుకే ఇక్కడ ఉన్నాను ...'' అన్నాడు. చుట్టుప్రక్కల వారు ఆశ్చర్యపోయారు.

''కృష్ణపరమాత్మ ఆవహించాడు.''

ఈ దేశంలో నీతిని, నిజాయితీని, ఉనికి నమ్మరుగాని, దేవుడిని మాత్రం ఏ రూపంలో ఉన్నా నమ్ముతారు. దైవభీతి, ప్రీతి కాదు, వారిలో దాగిన పాపభీతి.

అప్పుడే నా దృష్టి ఇద్దరు స్త్రీలపై పడింది. వారు కొత్తగా ఆ పేటకు కాపురం వచ్చారుట. వారిద్దరూ పడుపువృత్తి చేస్తారని విన్నాను, నాకొకటే ఆలోచన వచ్చింది.

''నా పదహారువేల గోపికల నుండి వెళ్లిపోయి, వెలయాంద్రుడుగా మారారా !'' అన్నాను. అంతే కనికరించండిస్వామీ అంటూ నా కాళ్లపై పడి ముడుపు సమర్పించుకున్నారు.

నేను నెలంతా కష్టపడితే రాని డబ్బులు ఒక్క రోజులో వచ్చాయి. మనింట్లో అద్దెకున్న చైనులు వ్యాపారం అంతంత మాత్రమేనని అర్థం అయింది. అతను నాకు సలహా ఇచ్చాడు.

''మనమో ప్రయత్నం చేద్దాం. విజయం సాధిస్తే నిశ్చింతగా బ్రతుకుతాము. లేకపోతే మళ్లీ ఏమైనా చూద్దాం'' అన్నాడు.

ఆ పరిస్థితిలో అంగీకరించక తప్పలేదు అతని చరిత్ర అంత మంచిది కాదు. అందుకే అతనితో ఖచ్చితంగా చెప్పాను.

''వచ్చిన డబ్బులో వాటా ఇస్తానుగాని, నా జోలికి రావద్దు'' అన్నాను. అలాగే అన్నాడు.

మర్నాడు ప్రక్కింట్లో పేరంటం అంటే వెళ్లాను. వాళ్లపాప ఎక్కిళ్లో ఊపిరిబిగపట్టింది. కంగారులో వారు నీళ్లు ఇవ్వాలని మరచిపోయారు. నేనిచ్చాను. పాప ఏడ్చింది.

''నిజంగా మహత్తుంది స్వామీ...''అంటూ

# య క్ష గా న ం

నన్ను కూర్చోబెట్టి దండం పెట్టి, పది రూపాయలు, పళ్లు చేతిలో పెట్టారు.

నాకు మతి పోయింది. మనుషుల్లో ఇంత మూఢనమ్మకం ఉందా ! ఈ మూఢనమ్మకాలను క్యాష్ చేసుకోవటం తేలికే ననిపించింది. అందుకే పటిష్ఠంగా ప్లాను వేసాము.

చైనులు వేరే ఇల్లు తీసుకుని, మన ఇంట్లో గుడికి ఏర్పాటు చేసాడు. కొందరు మాలాగే పొట్టగడవక, ఉద్యోగాలిచ్చేవారులేక మా చుట్టూ చేరారు. అందరం కలిసి దేవుడు అవతారం ఎత్తి జయప్రదంగా ముగించాము ప్రజలను దేవుడి పేరిట మోసం చెయ్యటం ఎంత తేలికో అర్థం అయింది. నా దగ్గరకు

## చిన్న పిల్లలకు న్యాయ సలహాలు!

చిన్న పిల్లలకు న్యాయ సలహాల నిచ్చేందుకు పశ్చిమజర్మనీలో ఒక సలహాకేంద్రాన్ని గత సెప్టెంబరు నెలలో ఏర్పాటు చేశారు. చిన్నపిల్లల పట్ల హింసాకాండను నిరోధించే ''సొసైటీ ఫర్ ది ప్రివెన్షన్ ఆఫ్ క్రూయల్టీ టు చిల్డ్రన్'' ఈ కేంద్రాన్ని నిర్వహిస్తున్నది తలిదండ్రుల విడాకుల కేసులు, బాల నేరాల కేసుల్లో బాల బాలికలకు తగినంత సహాయం అందటంలేదని భావించి ఈ కేంద్రాన్ని ఏర్పాటు చేయటం జరిగిందని సంస్థ అధ్యకులు హాన్స్ క్రిస్టన్ పీటర్సన్ తెలియచేశారు. ఈ సలహాలన్నీ నిష్పక్షపాతంగా,పిల్లలను ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దే విధంగా ఉండగలవని ఆయన అన్నారు.

వచ్చేవారి సమస్యలు కనుక్కునేవారు కొందరు, నా శక్తిని, మహిమను ప్రచారం చేసేవారు మరి కొందరు తయారయ్యారు. అందరికి జీతాలు మాట్లాడి ఉంచాను.

నిజంగా నీకు తెలుసు నాదగ్గర ఏ మహత్తు లేదని. అయినా భక్తులు ఏర్పడ్డారు.

నాకు తెలుసు భవిష్యత్తు చెప్పలేనని. కాని, కనకవర్షం కురిపించేవారు. నాకు తెలుసు, వారి సమస్యలను నేను తొలగించలేనని, వారు నమ్మారు. నమ్మకంతో నన్నాశ్రయించేవారు. మనిషికి తన ఆచరణపట్ల నమ్మకం పోయింది. వాళ్లు గుడ్డిగా దేవుడు, అవతారం అంటూ నమ్ముతున్నారు. అందుకే ఆ నమ్మకాన్ని కొన్నాళ్లు ఆసరాగా చేసుకోవాలనుకుని, కొన్ని మాత్రలు పొడిగా చేసి, విభూతితో కలిపి పెట్టుకున్నాను. ఆయా రోగాలు గ్రహించి ఇచ్చేదాన్ని. నువ్వు పెరిగి చేతికి అందివచ్చేవరకు నాకు అదొక సర్కస్‌ఫీట్లలా ఉండేది. సత్యవతి, రుక్మిణి, వీళ్లంతా మెల్ల, మెల్లగా నా చుట్టూ చేరారు చైనులు వివరాలు సేకరించేవాడు. ఒకొక్కసారి వివరాలు మరిచిపోయి, నా పరువు కాపాడుకోవటానికి ఎన్నో శ్రమలు పడవల్సివచ్చేది

నీలూ ! ఇన్ని శ్రమలకోర్చినా, ఆ డబ్బు నా కందేదికాదు. ఏదో కొంచెం అందేది. కష్టపడేది నేను. అనుభవించేది యెవరోనా ! బాగా ఆలోచించి, కృష్ణపరమాత్మకు ప్రీతిపాత్రమైన వెదురుబొంగులు ప్రవేశపెట్టాను. అదొచ్చాక కొన్ని రోజులు రాబడి లెక్కలు బాగానే ఉన్నాయి, కాని బయటినుండి వెదురుబొంగులు తెప్పించి పెట్టటము మొదలుపెట్టారు

అప్పుడే నువ్వు ఎదిగివచ్చావు. తరువాత సంగతులు నీకు తెలుసు, నీలూ ! ఎప్పటికప్పుడు నువ్వు హెచ్చరిస్తూనే ఉన్నావు అవతారం చాలించమని కాని నీలూ ! నా అవతారంవల్ల ఎందరో బ్రతుకుతున్నారు. వారిని నిరుద్యోగులను, నిరాశ్రయులను చేయవద్దని శ్రమించాను. ఒక్కనాడు కాదు రాత్రింబవళ్లు ఆలోచించాను. వాళ్లే నన్ను వెన్నుపోటు పొడిచారు. నన్ను నిరాశ్రయురాలిని చేసారు. నా బాల్యం బీదరికంలో ఎంత హేయంగా నడిచిందో నువ్వు ఊహించలేవు.

ఈ ప్రపంచం డబ్బు చుట్టూ తిరుగుతుంది.

డబ్బుంటే తిమ్మిని బ్రహ్మ చేయవచ్చు; బ్రహ్మను తిమ్మి చేయవచ్చు. అందుకే ఆ డబ్బు నీకు సమకూర్చిపెట్టి, ప్రపంచం నీ చుట్టూ తిరిగేలా చేయాలనుకున్నాను కాని విధి ఇక్కడ మళ్లీ కోలుకోలేనంత బలంగా దెబ్బతీసింది.

అందుకే .. అందుకే నీలూ ! విధితో సవాలు చేసాను నా కూతురు ధనంలో తేలి ఆడుతుందని చెప్పటానికి, ఆదిత్యకు దూరం చేయాలని చూచాను. అంతే. . స్త్రీ ఒకొక్కసారి అమృతమూర్తి అయినట్టే అతి హీనమైన ఆలోచనలు చేస్తుంది. అతను దొంగ కాదని తెలిసినా, అతన్ని జైలుపాలు చేసాను. కేవలం... కేవలం నా స్వార్థం కోసం ! అక్కడా విధే గెలిచింది.

అమ్మా నీలూ ! సావిత్రి నన్ను బ్లాక్‌మెల్ చెయ్యకూడదనేనమ్మా, నిన్ను ఇస్తానన్నది. సావిత్రి అభిమానిస్తే ప్రాణం ఇస్తుంది. కోపం వస్తే కొరగానివ్వదు. నల్లులను రాచినట్టు రాస్తుంది. బ్లాక్‌మెల్ చేస్తూ నిన్నూ, నన్నూ ఎక్కడ బాధపెడుతుందోనని ఆందోళన పడ్డాను. అదీకాక చిన్నబాబు అంత అసమర్థుడని నాకు తెలియదు. పోనివ్వు జీవితంలో ఒక్క సత్యం ఆలస్యంగా గ్రహించాను నీలూ !

మనం కష్టపడనిదేది మనకు దక్కదు. అందరి విషయములో ఏమోగాని కొందరి విషయములో అది నిజం అవుతుంది.

నా కష్టార్జితం అంతా పూడ్చిపెట్టుకుపోయింది.

# ప్రేమ్ సబ్బుతో స్నానం రోజంతా ఉల్లాసం

మీ శరీరమునకు మృదుత్వమునిచ్చి సహజ సౌందర్యమును పెంపొందించు సబ్బు ప్రేమ్. దీని స్వచ్ఛమైన నురగ, పరిమళము మీ మనసును పులకింపజేయును.




గులాబి మరియు ఆకుపచ్చ రంగులలో లభించును






జయలక్ష్మి
గుంటూరు వారి తయారీ

Imageads M-1783

ఆ షాక్‌కు నేను చచ్చిపోవాల్సిందే, కాని కేవలం నీకోసం బ్రతికాను నీలూ !

చక్రి శివాజి రూపంలో కనిపించి, నీ బాధ్యత స్వీకరిస్తానని అనగానే నేనెంతో సంతోషించాను. ఎంతో రిలీఫ్ పొందాను. నీ భవిష్యత్తు అతనికే వదిలేసాను. అది ఒక అధ్యాయం. అది అంతటితో ముగిసింది.

ఇక నా విషయం చెబుతున్నాను... నీలూ ! నీవు తప్ప నాకంటూ మిగిలిన వారీ ప్రపంచములో యెవరూ లేరు.

సాటి స్త్రీగా సానుభూతితో నన్ను అర్థం చేసుకో నీలూ ! ఇక్కడ అబద్ధం చెప్పటంలేదు. నా హృదయం నీ ముందుంచుతున్నాను. కూతురుగా కాదు. తల్లి స్థానంలోకి వెళ్ళి నా సమస్యను సానుభూతితో అర్థం చేసుకో. పెళ్ళి కాగానే తల్లిని పోగొట్టుకున్న నేను, తల్లిని, తండ్రిని, ఆత్మీయులను నీలోనే దర్శించాను.

నాకు వివాహం అయ్యేనాటికి, నాకు పదిహేడు, మీ...సారీ నందనరావుగార్కి ముప్పై సంవత్సరాలు. అతనికి చిన్నప్పుడే పెళ్ళయి భార్య పోయిందట. ఆయనకు సంసార జీవితం పట్ల ఉన్న అభిప్రాయాలు వేరు.

కాపురం అంటే కటిక చీకటిలో, తప్పు చేస్తున్నట్టు, మూడు నిమిషాల్లో ముగించే బూతు కార్యం అని అర్థం. నాకు చిన్నప్పటి నుండి చదివిన గ్రంథాల ప్రభావం కాని, మరే దయినా కాని, ఒక ఉన్నతమైన భావం, ఊహాలలో తేలిపోయే అనుభూతులుండేవి.

ఆప్యాయంగా పిలువటంగాని, అందమైన భాషణంతో ఆకర్షించటంకానీ ఏదిలేదు. యాంత్రికంగా గడిచిపోయేది. ప్రతీ పనిలో అందం ఉంటుంది నీలూ ! కొందరు భోజనం చేస్తుంటే, మనకు ఆకలి చుర, చుర మంటుంది మరికొందరు భోజనం చేస్తుంటే ఆకలి చచ్చిపోతుంది.

కొన్ని ఇళ్లల్లో ఏ ఆడంబరం లేకపోయినా,



నేలపై కూర్చుందాం అనిపిస్తుంది. కొన్నిచోట్ల ఖరీదయిన సోఫాలున్నా కూర్చోలేం. ఆ వాతావరణ ప్రభావమా !

మనిషికి మనసు, ఈస్తటెకోసెన్స్ ఓ శాపం అనుకుంటాను.

ప్రతీరోజూ, ఆయనతో యెలా మాట్లాడాలో, రిహార్సల్స్ చేసుకుని వెళ్ళేదాన్ని. ఆయన నా ఊహాలు కూకటి వేళ్లతో కూల్చేసేవారు.

"ఏమిటా వెర్రి నవ్వు. కుదురుగా ఉండలేవా ?"

"మనిద్దరం ఉండగా కుదురుగా ఉండలేవా అంటారేం ?"

"ఇద్దరమే ఉంటే తైతక్కలాడాలా !"

ఆయన విసుగు చూస్తే నాకు ఏడ్పు వచ్చేది.

ముఖం మరో వైపు తిప్పుకుని పడుకునే వారు.

"ఏమండీ ... " సిగ్గు విడిచి, భుజంపట్టి కుదిపేదాన్ని

"నా ఆరోగ్యం బాగాలేదు" విదిలించుకునే వారు. భార్యాభర్తల అనుబంధం శారీరక సుఖాలకే కాదు. కష్టం, సుఖం మాట్లాడుకుంటారని అనుకున్నాను.

ఎక్కడలేని విసుగు వచ్చేది.

"నాకు ఎవరన్నా ప్రక్కనుంటే నిదుర రాదు" అనేవారు. ఏం చేయలేక ప్రక్కకు, దూరంగా ఉన్న మంచంపై పడుకునేదాన్ని. ఎప్పుడో, ఏ అర్థరాత్రో నాకు తెలియని, సుషుప్తావస్థలో ఆయన ఆక్రమించుకుంటే ఒంటిమీద చీమలు, తేళ్లు ప్రాకినట్టుండేది. నేను నా అయిష్టతను వ్యక్తం చేయక మునుపే, ఆయన కోరిక తీర్చుకుని లేచేవారు. ఎంత జుగుప్స కలిగేదో చెప్పలేను.

అసహాయురాలిని. మనదేశంలో భర్త




**క్లూ !**

లీటర్ కిరోసిన్‌కి
అర లీటర్ ఆయిల్‌కి
గంటల తరబడి క్యూ...
కొరతంటే ఎలాగ వుంటుందో
తెలుసుకోనడానికి
ఇదొక క్లూ !

—ఎస్.వి.ఆర్. సత్యనారాయణమూర్తి

ఎలాంటివాడయినా భరించాలన్నది ఆచారం. నిస్సహాయంగా ఎన్ని రాత్రులు ఏడ్చానో !

దాంపత్యం అంటే ఇదేనేమో! సినిమాలలో, నవలలల్లో వర్ణించినట్టు ఉంటుందా అనుకుని జీవితంతో రాజీ పడిపోయాను. మరబొమ్మలా మారిపోయాను. అనుభూతులు, ఆడంబరాలు లేక, యాంత్రిక జీవితానికి అలవాటుపడ్డాను

చక్రధర్ ... అదే శివాజితో పంచుకున్న జీవితం చాలా తక్కువ అయినా అది మరిచిపోలేని అనుభూతి, మధురానుభూతి.

వయసులో చిన్నవాడయినా, మనసు ఎరిగిన మగవాడు. నాకే గనక డబ్బుంటే ఈ నందనరావును వదిలేసి, అతని వెంట వెళ్ళి అతడిని చదివించేదాన్ని అనిపించింది.

అతను మాట్లాడితే మళ్లీ, మళ్లీ వినాలనిపిస్తుంది.

అతని టీ ఇచ్చినా కాఫీ ఇచ్చినా ధన్యవాదాలు చెప్పే పద్ధతికి ఎవరయినా ముగ్ధులవుతారు. వగలు అనుకుంటావేమో కాని అతన్ని మరిచిపోవటం సాధ్యం కాలేదు.

అసలే నీరసుడు నందనరావు. పక్షవాతం వచ్చింది. నేను పెద్దగా పోగొట్టుకున్నదేంలేదు అనిపించింది.

శివాజితో పంచుకున్న ప్రతి నిమిషం నాకు విలువయింది. బ్రతుకటానికి బలం, స్ఫూర్తి నిచ్చింది. ఇన్నేళ్లు అతని జ్ఞాపకాలతో బ్రతికాను. అతను ప్రత్యక్షంగా కనిపిస్తే ఏమవుతానో ఊహించు. నీలూ ! నాకు మతి పోయింది. అతని లాలనలో ఒక్కక్షణం నన్ను నేను మరచి పోవాలనుకోవటం అత్యాశా ! దురాశా !

"దేవీ ! నా వృత్తిలో, నేను బ్రతకటానికి, ఎందరితోనో అనుబంధాలు పెంచుకున్నాను. కాని నీతో గడిపిన ప్రతిక్షణం అమరమైనది" అన్నాడు శివాజి.

శారీరక వాంఛలకు కరిగి, కాలి, బూడిదయింది నా శరీరం. సాంప్రదాయాలలో చిక్కుకుపోయిన నేను, నా సుఖాలు వెతుక్కోలేక

# కొత్త పెళ్ళికూతురు తన అనుభవాన్ని చెబుతోంది. యవ్వనంలో ముఖంపై వచ్చే మొటిమ లెలా పోతాయో చెబుతోంది

"యవ్వనంలో మొటిమలు రావడం సహజం
వాటిని శుభ్రంచేసి అదుపులో పెట్టడానికే ఎప్పుడూ క్లియరసిల్ వాడటం."



**"నాకు 13 ఏళ్లొచ్చేసరికి మొటిమలు రావడం మొదలెట్టాయి...**
అయితే నేనంతగా పట్టించుకోలేదు. ఇంకొంచెం ఎదిగిన తర్వాత ఒక రోజున ఒక అబ్బాయి చూడటానికి వచ్చారు నన్ను.

**మరి అతను చూసీ చూడటంతోనే నచ్చలేదన్నాడు**
నేనైతే కలలో గూడా అనుకోలేదు మొటిమలు యింత పనిచేస్తాయని, యిలా దారిలో అడ్డుకుంటాయని నా స్నేహితురాలు జయతో చెప్పానిది

**ఇక అప్పుడు జయ నాకు క్లియరసిల్‌తో ఒకదారి చూపించింది**
నేను క్లియరసిల్ రోజుకు రెండుసార్లు రాసుకోవడం మొదలెట్టా క్రమం తప్పకుండా వాడుతూ వచ్చాను మరి తర్వాత ఒక రోజున ఏమైందంటే, నా స్నేహితురాలి యింట్లో అదే అబ్బాయి కలిసాడు, యిక అలాగే కన్ను ఆర్పకుండా చూస్తూ వుండిపోయాడు!"

**క్లియరసిల్ వేనిషింగ్ మెడికేషన్ మరియు క్లియరసిల్ స్కిన్ కలర్డ్ మెడికేషన్—యీ రెండూ తమ విశిష్టమైన త్రివిధ చర్యతో పనిచేస్తాయి**



1. మొటిమలను తెరుస్తాయి



2 మొటిమలను శుభ్రం చేస్తాయి



3. మొటిమలను ఆరబెడతాయి

**క్లియరసిల్‌కి ఇప్పుడొక జోడు!**
ఒకటైతే మీ రెరిగిన క్లియరసిల్ స్కిన్ కలర్డ్ మెడికేషన్ మొటిమల్ని కనిపించకుండా చేస్తూ, తన ప్రభావాన్ని చూపిస్తుంది మరొకటైతే, కొత్త క్లియరసిల్ వేనిషింగ్ మెడికేషన్ చర్మంలో కలిసిపోతుంది, రాసుకున్నట్టే కనిపించకుండాను, మరి తన ప్రభావాన్ని చూపిస్తుంది అలంకరణతో సౌందర్యం, మందుకి మందూను.

**క్లియరసిల్ ప్రతి రోజూ రెండుసార్లు రాసుకోండి**
మొదట మీ ముఖాన్ని కడుక్కోండి ముఖం అంతటిపైనా క్లియరసిల్ రాసుకోండి, మొటిమలున్నచోట మరి కొంచెం ఎక్కువగా, మొటిమలు పోయిన తర్వాత గూడా క్లియరసిల్ రాసుకుంటూనే ఉండండి ఎందుకంటే క్లియరసిల్, చర్మంలో ఎక్కువగా గల నూనెని లాగేస్తుంది, తద్వారా మొటిమల్ని రాకుండా అదుపులో పెడుతుంది




**కొత్త వేనిషింగ్ మెడికేషన్**

**స్కిన్ కలర్డ్ మెడికేషన్**

## క్లియరసిల్ – ప్రపంచంలోని నం. 1 మొటిమల క్రీమ్

OBM-8625-R TEL

# ఇవేమన పద్యాలు




తల్లలాడువాని గ్రామకర్త యెఱుగు
సత్యమాడువాని స్వామి యెఱుగు
పెక్కు తిండిపోతు పెండ్లామెఱుంగురా
విశ్వదాభిరామ వినుర వేమ.

పోయాను. ఒక్కసారి శివాజీ కనిపించగానే నన్ను నేను మరిచిపోయాను వాంఛలతో కాదు. ఆత్మీయత కోసం అర్రులు చాచాను. నా కష్ట, సుఖాలు పంచుకునే ఆత్మీయుడు అనిపించింది. అందుకే. .అందుకే అతనితో చనువుగా మసిలాను. కామంతో, మోసంతో కాదు. నీలూ ! ప్రేమకు నిర్వచనం చెప్పలేము

## యక్షగానం

అది బహుముఖంగా ప్రవహిస్తుంది. ప్రేమతో కేవలం ఆత్మీయులుగా మేం దగ్గరగా ఉండగా నువ్వు చూచావు. నన్ను ఎంతో నీచంగా ఊహించావు !

నీలూ ! నీవు ఈ తరం యువతిగా ఒక పని చెయ్యమ్మా. నేనెక్కడున్నా సంతోషిస్తాను స్త్రీ, పురుషులకు వేరు వేరుగా ఏర్పరిచిన ఈ సాంఘిక నియమాలను ఛేదించు.

ఆర్తి, ఆకలి, అనుభూతి, ఆవేదన, కోరికలు, స్పందన అందరికీ ఒకటేనని నిరూపించు.

తల్లీ ! నేను నిన్నొక స్నేహితురాలిగా భావించి, నా కథ ఏదీ దాచకుండా చెప్పాను ...''

కళ్లకడ్డు పడుతున్న నీరు ఒత్తుకుని మళ్లీ చదవబోయింది.

''సారీ నీలూ ... లే ...'' శివాజీ వచ్చి ఆమె భుజాలు పట్టి లేపాడు.

ఏమిటన్నట్టు చూచి, మంచం వైపు చూచిందామె.

నందనరావుకు నిలువునా గుడ్లు కప్పారు.

''నాన్నా ! ... '' నిలువునా పడిపోయింది

''నీలూ !. .'' ఆర్తిగా పిలిచాడు శివాజీ.

''నాన్నా !... నానా ! నా కోసం ... ఎన్నో సార్లు మందు త్రాగావు... ఈసారి... నాన్నా... నన్ను... ఒంటరిదాన్ని చేసావా !'' నీలిమ ఏడుస్తుండగా, శివాజీ, ఆదిత్య చెరోవైపు పట్టుకుని లేపారు.

## 23

నీలిమ కోరిక మేరకు, నందనరావు అంత్యక్రియలు ఆదిత్య చేతుల మీదుగా జరిగాయి. ముకుందాదేవి దగ్గరకు కారు పంపించాడు శివాజీ. ఆమె దక్షిణదేశ యాత్రలకు బయలు దేరిందట. వారి జాడ సరిగ్గా ఎవరికి తెలియదు అన్నారు.

నీలిమ నిట్టూర్చింది.

తనకు ఎవరూ లేరు అనుకుంటే, తనకోసం సర్వస్వం ధారపోసే తండ్రి, ప్రాణం ఇచ్చే భర్త ఉన్నారు. అందరూ ఉన్నారనుకున్న నందనరావు దిక్కులేని వాడు అయ్యాడు.

తనను అతను ఎంతగా ప్రేమించాడో తాను ఎరగనిది కాదు. అంత ప్రేమించి, ఆమె కోసమే, అవిటి బ్రతుకును అతి భారంగా ఈడుస్తున్న సమయాన, ఆమె తన కూతురు కాదని తెలిస్తే మనిషి ఎంతగా దిగజారిపోతాడో ఊహించగలదు.

ఆదిత్య అంటే అతనికి చాలా అభిమానం. అందుకే అతనిచేత అంత్యక్రియలు చేయించింది.

''నాన్నా ! ఈ క్షణం వరకు నువ్వు నాకు తండ్రివి కాదని తెలియదు. నేను నిన్నే ప్రేమించాను, గౌరవించాను.'' అనుకున్నది పదే, పదే. ఆదిత్య అతని హస్తికలు నిమజ్జనం చేయటానికి తీసుకువెళ్లాడు.

నీలిమ కృష్ణకుంజ్ లో తండ్రికి చేయవలసినవన్నీ చేసింది. ఆమె లతా కుంజ్ లో కూర్చుంది. అక్కడ కూర్చోబెట్టి, చిన్నప్పుడు తనకు కథలు చెప్పేవాడు నందనరావు. ఆమెకు ఒక్కొక్క ఘట్టం గుర్తుకు వచ్చింది. అలాగే కూర్చుండి పోయింది.

(ఇంకా వుంది)

# రాయలసీమకు ప్రత్యేక రక్షణలు

## శ్రీ నీలం సంజీవరెడ్డిగారి అధ్యక్షోపన్యాసం

[నంద్యాలలో ఈ నెల 25, 26 తేదీలందు రాయలసీమ మహాసభ 5వ సమావేశము రాజ్యాంగ పరిషత్తు సభ్యుడు శ్రీ నీలం సంజీవరెడ్డిగారి అధ్యక్షతను జరిగింది. శ్రీ సంజీవరెడ్డిగారు రాయలసీమ స్థితిగతులను సాకల్యంగా విచారించి ప్రస్తుత సమయంలో రాయలసీమ ప్రజల కర్తవ్యమును సర్కారాంధ్రుల బాధ్యతలను తమ అధ్యక్ష ప్రసంగమున వివరించిరి. అధ్యక్షోపన్యాస పూర్తి పాఠము ఇచట ప్రచురించడమైనది. – సం]



ప్రత్యేకాంధ్ర రాష్ట్ర నిర్మాణము కనుచూపు మేరలో ఉన్న ఈ తరుణంలో ఈ సభ జరగడంవల్ల దీనికొక ప్రత్యేకత ఏర్పడింది. ఇప్పట్లో మనం ప్రతి విషయాన్నీ శాంతంగానూ, మొగమాటాలు లేకుండాను నిర్మల హృదయాలతో ఆలోచించి ఒడుదుడుకులు లేని చక్కని మార్గాన్ని నిర్ణయించుకోవలసి వుంది. సంకుచిత భావాలకు సభా కార్యక్రమంలో తావుండరాదు ఐతేనూ "తన్నుమాలిన ధర్మమూ – మొదలు చెడ్డ బేరమూ" పనికిరావుకదా!

రాష్ట్ర విషయంలో మన సీమలోని వారి యభిప్రాయాలు నాకు తెలిసినంతలో మూడు రకాలుగా నున్నవి.

మొదటి అభిప్రాయము : మన మిప్పుడుండే విధంగా ఉమ్మడి రాష్ట్రంలోనే ఉందామనడం, రెండవ అభిప్రాయము : మన రాయలసీమ జిల్లాలే ప్రత్యేక రాష్ట్రముగా ఉండవలెననే వాదం. మూడవ పంథా : ఏర్పడబోయే ఆంధ్ర రాష్ట్రంలో ప్రత్యేక రక్షణలను చట్టరీత్యా పొంది అందులో ఉండడము.

ఈ మూడు విధాలైన అభిప్రాయాల్లోనూ ఉండే సాధకబాధకాలను కొంతవరకూ మనం తరచి చూడవలసిఉంది.

ఉమ్మడి రాష్ట్రములోనే వుండిపోదామనే వాదం నిరుపయోగం. ఎందుచేతనంటే ఇప్పటి మన మదరాసు రాష్ట్రంలో ఆంధ్ర కర్నాటక కేరళ తమిళ ప్రాంతాలు చేరియున్నవి. ఆంధ్రులు తమిళ ప్రాబల్యం చేత పైకి రాలేమని వేరు పడ్డానికెంతో తిప్పలు పడుతున్నారు. ఆంధ్రులతో మనకు పేచీలెందుకు? వేరైపోదామని తమిళులు స్వరాష్ట్రాన్ని కోరుతున్నారు. అందరి కంటె అధ్వాన్నంగా వుంది కర్నాటకుల సంగతి. వారిలో కొందరు బొంబాయి రాష్ట్రంలోనూ, కొందరు మైసూరులోనూ, కొందరు హైదరాబాదులోనూ, మరికొందరు కూర్గులోనూ చేరి పోయి వారి సంస్కృతి, ప్రత్యేకత విచ్ఛిన్నమైపోవడంచేత కర్నాటక ఏకీకరణకై కర్నాటకులంతా తహతహలాడుతూ అహర్నిశలూ కృషి చేస్తున్నారు. తర్వాత కేరళుల సంగతి. వీరు తిరువాన్కూరు, కొచ్చిన్‌లతో కలసి ఐక్యకేరళాన్ని స్థాపించవలెనని బాధపడుతున్నారు. ఇందులో బేసబబేదీలేదు. భాషాప్రయుక్త రాష్ట్ర విభజన సిద్ధాంతాన్ని రాజకీయ పార్టీలలో ప్రధానమైన కాంగ్రెసు ఒప్పుకుంది కాబట్టి దాని ఆవశ్యకతా చర్చ చర్వితచర్వణ మౌతుంది. ఈ సిద్ధాంతాను సారంగానే వీళ్ళందరూ, తమ తమ అభివృద్ధి కొఱకు వేరుపడిపోదామని అంటూవుంటే ఆ పని వల్లకాదు, మాకోసం మీరందరూ ఈ రాష్ట్రంలోనే ఉండండి అనడం అనుచితం, అసంబద్ధం, అసాధ్యం. కాబట్టే ఈ వాదం నిరుపయోగం.

రెండవ వాదం రాయలసీమ ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పడవలెననుట. ఇప్పటి రాయలసీమ రాయలనాటి సీమ కాదనేది అందరికీ తెలుసు. ఆ నాటి తీరు సౌభాగ్యం మన కుండియుంటే మనం ప్రత్యేకంగా ఉండడానికే ఆక్షేపణా ఉండేదికాదు. కాని ఇప్పుడో మనం బ్రతికి చెడిన వాళ్ళం. పూర్వోన్నతి ఉద్ఘాటిస్తూ మనం ప్రత్యేకంగా ఉండదలిస్తే మన ప్రస్తుత దైన్యస్థితి విస్మరించిన వారవుతాము. అందులో మన స్థితి బాగుపడదు. ఆంధ్రరాష్ట్రం రావడమే విశ్వ ప్రయత్నమైనప్పుడు మనకు ప్రత్యేకరాష్ట్రం రావలెనంటే ఎంతకాలం పట్టుతుందో ఆలోచించండి. ఒకవేళ వచ్చెననే అనుకుందాం. అప్పుడైనా –ఇప్పటి మన అసహాయస్థితిలో–మనం స్వయం పోషకంగా మనగలమా? అనేది మరొక ప్రశ్న. ఎల్లప్పుడూ కేంద్ర ప్రభుత్వపు ఈవిమీదనే ఆధారపడి ఒరిస్సా సరిహద్దు రాష్ట్రాల కన్నా కూడా దరిద్రదశలో ఉందామనుకుంటేతప్ప, ప్రత్యేకంగా మన మనుగడ అంత లాభదాయకం కాబోదు.

చట్టరీత్యా పొందిన హక్కులతో ఆంధ్ర రాష్ట్రంలో ఉందామనడం మూడవ వాదము. ఇప్పటికి ఇదే సబబైనమార్గమేమో అని నా కనిపిస్తుంది.

ఇన్నివిధాలుగా మన మనుగడను గురించి మన మాలోచించుకోవలసిన అవసర మేర్పడడానికి అనేక కారణాలున్నాయి. మన మిన్నాళ్ళుగా మన తోడివారి కలిమిని నమ్మి ఉమ్మడి రాష్ట్రంలో ఉండిన్నీ ఏ విధమైన లాభాలూ పొందలేకపోయినాము. ధనపతి చెలికాడైనను శివు డనుదినమును బిచ్చమెత్తవలసినదే కదా? విద్యా విషయంలోనేమి, ఆర్థికంగానేమి, పారిశ్రామికంగానేమి ఇతర విధాలుగానేమి మన మందరికన్నా వెనుకబడియున్నాము. మనలను నిరంతరము బాధపెట్టుతూ వుండే క్షామాన్ని పారదోలడాని కిన్నాళ్ళనుంచీ జరిగిన ప్రయత్నాలేవియూ కనబడవు వచ్చిన ప్రతి గవర్నమెంటూ రాయలసీమాభివృద్ధి చాలా ముఖ్యమనీ, వాళ్ళకు సహాయం చేయడం చాలా అవసరమనీ ఎంతో సానుభూతితో అధికారాల్లో ఉండగా పలకడమే గాని క్రియకు వచ్చేటప్పటికి మాత్రం ఆ మాటలన్నీ మటుమాయ మగుతున్నవి. నేను మొదట శాసనసభలో మాట్లాడినప్పుడు ఇట్టి సానుభూతి వచనాలతో మా కజీర్ణం కలిగిందనీ ఏదైనా మాకు చేయదలిస్తే క్రియారూపంలో చేసిచూపితేగాని వట్టి మాటలు పనికిరావనీ చెప్పినాను. ఇప్పటివరకూ మన సీమ అభివృద్ధికని ఎన్నో కమిటీలను ఏర్పాటు చేసినారు. వారు తయారుచేసిన రిపోర్టులను ప్రచురించినారు. కాని, తీరా ఫలశ్రుతికి వచ్చేటప్పటికి "హళ్ళికి హళ్ళి, సున్నాకు సున్న" అంతా కొండను త్రవ్వి ఎలుకను పట్టే రకమేగాని వీసమంతైనా ఉపయోగం కనబడలేదు. వట్టి చేతులతో మూర వేసినట్లు డబ్బూ దసకం అధికారాలూ లేని కమిటీలు చేసే వట్టి శిఫారసులవల్ల యేమి మేలు కలుగుతుంది! కొంత డబ్బిచ్చి చేసేందుకు సర్వాధికారము యిస్తే తప్పకుండా ఏదో కొంత మేలు జరిగేవే. కాని, ఆ విధంగా లేదే! ఇప్పటి ఈ ప్రభుత్వంలో కూడా రాయలసీమ ఎకనామిక్ డెవలప్‌మెంటు బోర్డు అనే సంస్థ మన అభివృద్ధి

## రాయలసీమకు...

మార్గాన్వేషణకై ఏర్పడి ఉంది. దీనివల్ల వట్టి డబ్బు దండగేగాని ఫలితం మాత్రం మృగ్యమని చెప్పవలసి వచ్చినందుకు చింతిస్తున్నాను.

ఐతే నిజంగా మనం బాగుపడేందుకు మార్గాలు లేవా? ఉన్నవి. చేసే మహానుభావు లేరీ? మచ్చుకు కొన్ని చెప్పుతాను. ప్రత్తి మన సీమలో ముఖ్యమైన పంట. రాష్ట్రంలో పండే ప్రత్తిలో ఎక్కువవంతు మన జిల్లాలలోనే పండుతూ వుంది. ఐతే ఏమి లాభం? అంతా పై దేశాలకు ఎగుమతి కావలసిందే. దానితో ఏర్పడవలసిన ఒక్క పరిశ్రమకూడా ఏర్పడలేదు. ఏర్పరచడాని కే ప్రయత్నమూ చేయబడలేదు. రెండవ ముఖ్యమైన పంట వేరుసెనగ. దీనితో ఏర్పడగల పరిశ్రమలు ఎన్నో ఉన్నవి. డాల్డా, సబ్బు ఫ్యాక్టరీలు ఇత్యాదులు. వ్యక్తులు యీ పరిశ్రమల్లో దిగడానికి తగిన ఆర్థికబలం లేకుండా ఉన్నారు. ప్రభుత్వ మేదైనా ఊత యిస్తుందా అదీ లేదు. "గోరుచుట్టుపై రోకటిపోట"న్నట్లు ఉండే కొంత పరిశ్రమ అడుగంటిపోయేందుకు, లోకల్ పెట్టుబడిదారి నాశనము అయ్యేందుకు యే బిర్లాలకో మన జిల్లాల్లో ఫ్యాక్టరీలు కట్టుకోవడానికి లైసెన్సు లివ్వడమా? అంత మాత్రం ఉత్తరాదిజిల్లాల్లో బిర్లాలకు లైసెన్సు ఇచ్చినప్పుడేమైందో సభికులకు తెలిసేవుంది మనం నెత్తిన నోరు పెట్టుకొని అఱచినా వినిపించుకొన్నవాడేడీ?

రాయలసీమ వట్టి రాళ్లసీమ కాదు. రాళ్ళలోనే వజ్రాలున్నట్టు యీ మరు భూముల్లోనే ఎంతో ఖనిజసంపద ఉన్నదని పరిశోధకులు చెప్పుచున్నారు. కాని దారిద్ర్యంతో క్రుంగిన మన సీమలోని యే వ్యక్తి యీ ఖనిజసంపదను వినియోగానికి తెచ్చుకోగలడు? ప్రభుత్వమే కొంత డబ్బు వెచ్చించి వీనిని వెతకి ఉపయోగానికి తెస్తే మనం బాగుపడలేమా? ఐతే అట్టి ప్రభుత్వమేది?

ఇవన్నిటికంటే ముఖ్యమైంది ఎలెక్ట్రిసిటీ సప్లై మన సీమకు మైసూరు రాజ్యం చాలా దగ్గిర వుంది. వాళ్ళకు ఎలెక్ట్రిసిటీ ఎంతైనా సప్లై చేయగల తాహతుంది. మన జిల్లాల్లో జీవనదులు లేకపోయినా అంతర్వాహినిగా ఉండే గంగకు ఏ కొదువా లేదు మంచి ఊటగల బావులు ఎన్నైనా ఉన్నాయి. పాతాళములో ఉండే ఆ నీళ్లను పైకితెచ్చే విషయంలో ప్రతి రైతూ భగీరథ ప్రయత్నం చేయవలసివస్తూ ఉంది. కపిల, మొదలైనవానికి పెట్టుబడి చాలా ఎక్కువ అందుచేతనే పంటలు పెట్టేది తక్కువై, కఱవుకాటకాలతో మన మలమటిస్తున్నాము. ఈ ఎలక్ట్రిసిటీనో మనకు సప్లైజేసి ఎంజిన్‌లద్వారా యీ పాతాళగంగను పైకిదెచ్చే సులభోపాయము కలిగించేట్లయితే కొన్ని ఏండ్లలోనే మన సీమ అంతా సస్యశ్యామల మౌతుందనడం సత్యదూరం కానీ, అతిశయోక్తి గానీ కానేరదు. ఈ పని నిజంగా అసాధ్యం కాదు. కావలసింది నిజమైన ఆసక్తి — ఇచ్ఛ — శ్రద్ధా మాత్రమే.

ప్రత్యేకించి మా జిల్లా (అనంతపురం) విషయం చెప్పుతాను మా జిల్లాలో ఉండే 9 తాలూకాలలోని 7 తాలూకాలలో పినాకినీ నది పారుతూ ఉంది. కాని ఒక్క నీటిచుక్క కూడా ఎక్కడా ఉపయోగింపబడదు అవకాశాలుండినా ఒక్క ప్రాజెక్టూ కట్టబడలేదు ఎన్నిసార్లు యీ విషయమై ఒత్తిడి తెచ్చినా మా అరుపులన్నీ అరణ్య రోదనాలైనాయి

గతాన్ని గురించి ఈ విషయాలు చెప్పినాను. ఇప్పటి విషయం చూచినా యేమంత ఆశాభావములేదు. అందువేతనే మనకు "రాముడు రాజ్యమేలినా, రావణుడు రాజ్యమేలినా ఒక్కటే' అనే మనస్తత్వం ఏర్పడడాని కాస్కారమైంది. అందుచేతనే మనకు ఆంధ్రరాష్ట్ర ప్రసక్తి ఉత్సాహాన్ని రేకెత్తించలేకుండా పోతూ ఉంది. వేరే రాష్ట్రము వచ్చినా మనకు మోక్షం కలుగుతుందనే ఆశ, ఇప్పటి మన ఉత్తరాది సోదరుల ఉపేక్షా భావాన్ని చూస్తే సన్నగిల్లుతూ ఉంది ఉదాహరణకు చూడండి. మన కోస్తాలో ఇన్ని జిల్లాలున్నాయికదా? ఒక్క జిల్లాలో నయినా మన రాయలసీమ వాడు కలెక్టరు, జడ్జి, డి. ఎస్ పి ఇత్యాది ఉన్నతాధికారాల్లో ఉన్నాడా! ఒక ఆంధ్ర మంత్రే ఎన్నో టెక్స్టైయిల్ కమీషనర్ల ఉద్యోగాలను సృష్టించినాడు గదా. ఒక్క రాయలసీమ వాసియైనా ఆ ఉద్యోగార్హత కలవాడాయనకు కనబడలేదా? పోనీ, ఇతర పెద్ద ఉద్యోగాల విషయాల్లోనైనా మనవాళ్లకు ఉత్తరాది వాళ్లకు నిష్పత్తి తీసుకుంటే తెలుస్తుంది మన అధ్వాన్నస్థితి. తుదకు ఒక ఇన్సూరెన్సు కంపెనీ యేజెంటు కావలసివచ్చినా మనవాళ్ళకంటే వాళ్ళ వాళ్ళే వాళ్ళకు అర్హులుగా కనబడుతున్నారంటే మన దురదృష్ట మెంతటిదో మీరే ఆలోచించండి.

ఇవన్నీ పోనీ. ఏదో కొట్లాడి కొట్లాడి ఒక ఇంజనీరింగు కళాశాలను అనంతపురానికి సాధిస్తే దాన్ని మదరాసులోనే ఉంచి ఎప్పుడో ఇక్కడికి తెస్తామని చెప్పుకున్నారు. అదీగాక ఆ కాలేజీలోనైనా విద్యార్థుల్లో మనవాళ్ళెందరున్నారో చూస్తే ఆ కాలేజీవల్ల మనమెంత లాభపడుతున్నామో విశదమౌతుంది

ఇంక ప్రాజెక్టుల విషయాన్ని పరిశీలిస్తాము నిన్న లేక మొన్న ప్రారంభమైన రామపాదసాగర ప్రాజెక్టు విషయమై తీసుకోబడుతూ వుండే శ్రద్ధ మన ప్రాజెక్టుల విషయములో తీసుకోబడుతూ వుందా? లేదు. అక్కడి పనులు ఇప్పుడు వాయువేగ మనోవేగాలను కాలదన్ని జరుగుతున్నాయంటే నమ్మండి ఈ ప్రాజెక్టు కంటే సులభమూ అగ్గువ అయినందున సంగమేశ్వరం, గండికోట, పెన్నార్, కుముద్వతి, అప్పర్ పెన్నార్, మిడ్ పెన్నార్ మొదలగు ప్రాజెక్టుల విషయం తీసుకోండి, ఆలోచనలలోనే ఉంటున్నాయి. ఎన్నేండ్లయినా ఎందుకీ మంద గమనం మన విషయమంటే. మనలో నుంచి సరియైన ఆందోళన లేకపోవడమే. ఆందోళన లేకపోవడానికి కారణమేమి? సామాన్య ప్రజల్లో చైతన్యము లేకపోవడమే. క్షుద్బాధాపీడితులై ఉదయాస్తమానాలూ ఉదరపోషణార్థమే ఊపిరి తిప్పకోకుండా, ఉండే కొంచెమూపిరీ ఊడిపోయేట్లు ఊహాతీతంగా రెక్కలాడించవలసిన రాయలసీమ సామాన్య ప్రజకు ఈ రాజకీయ చైతన్యం ఏవిధంగా వస్తుంది? ఈవిధంగా ఎన్నయినా ఉదాహరణాలు చెప్పవచ్చు కాని త్రవ్వకొన్న అంతా వ్యధకు కారణమేగాని ఉపయోగమేమీలేదు ఇట్లన్యాయాలు మనకు జరక్కుండా ముందైనా మనం జాగ్రత్త పడవలసిన అవసరమెంతైనా ఉందని ఈ సందర్భములో హెచ్చరిస్తున్నాను.

ఈ అన్యాయాలన్నీ మనకెంతో కాలంనుంచీ కలుగుతూ ఉన్నవే. ఇది దీర్ఘవ్యాధి. దీనికి ప్రతిక్రియగానే ఒకప్పుడు శ్రీ బాగ్ ఒడంబడిక అనే



## చీరలు: 100% టెరీన్*,
## పాలియెస్టర్, షిఫాన్ మరియు 100% కాటన్

మంచి అభిరుచి. తగిన ధరలు.

*TERENE®

నాషనల్
టెక్స్‌టైల్
కార్పొరేషన్




(తమిళునాడు మరియు
పాండిచెరి) లి
భారత సర్కారపు ఒక ఉద్యోగ
సంస్థ

10 64 సోమసుందరం మిల్స్ రోడు కొయమత్తూరు 641009

ఇండెంటింగ్ ఏజెంట్లు : ఆంధ్ర ప్రదేశ్ బాలాజీ టెక్స్‌టైల్ ఏజెన్సీస్, 3-4-394, దొబ్బాకో బజారు, సికింద్రాబాద్-500003 (ఏ పి) సంగం టెక్స్‌టైల్స్ ఏజెన్సీస్, 230, మొదటి అంతస్థు, డి బి. రోడ్డు, కొయమత్తూరు-641 002 ఆర్. పి డిస్ట్రిబ్యూటర్స్, 3-4-394, దొబ్బాకో బజారు, సికింద్రాబాద్-500 003 (ఏ పి.).

MCA/NTC/84 TEL



నందనవనం సాహితీ సమితి ఆధ్వర్యంలో హైదరాబాదునుండి ఇటీవల శ్రీ ఎస్. వెంకట రంగారెడ్డి రచించిన 'జ్యోతిర్లయ' కావ్యావిష్కరణ సందర్భంగా శ్రీయుతులు కర్నాటి లింగయ్య, ఎస్. కృష్ణారెడ్డి, వెంకట రంగారెడ్డి (కృతికర్త), ఆచార్య తిరుమల, డా. సి. నారాయణరెడ్డి (ముఖ్య అతిథి), డా. ఇరివెంటి కృష్ణమూర్తి (అధ్యక్షులు), బి. కిషన్‌రావు (ఆవిష్కర్త), కె. వెంకటేశ్వరరావు (శాసన సభ్యుడు), డా. ఎల్లూరి శివారెడ్డి (కావ్య పరిచయకర్త) గార్లని చిత్రంలో చూడవచ్చు.

పేరుతో కొన్ని రక్షణలు మనకు యిస్తామని ఉత్తరాది సోదరులు ఒప్పుకొన్నారు. కాని పూర్తి క్రియకు వచ్చేటప్పటికి వానిని అమలు పఱచే వారెవరు? అప్పటి పెద్దమనుష్యులంతా రేపు ఆ విషయంలో బాధ్యత వహించక పోవచ్చు. వహించినా వారిమాట జరక్కపోవచ్చు. అప్పట్లో మన గతి ఏమవుతుంది.

ఈ విషయానికివస్తే కొందరు మనలను విమర్శిస్తారు. మీకెందుకీ ఇన్ ఫియారిటీ కాంప్లెక్స్ అని. కాని "నెయ్యమునకు వియ్యమునకు కయ్యమునకు సమతవలయు" నన్నట్లు వారితో మనకు ఏ విషయంలోనైనా సామ్యముందేమో చూతాము.

వాండ్ల జిల్లాలలో కృష్ణా, గోదావరి జీవనదు లుండడము చేత మహా సారవంతమైన భూములున్నాయి. ఇచట మనవి మరుభూములు. వారి జనసంఖ్య లక్షలు లక్షలు, మన జనసంఖ్య అత్యల్పము. వారు మనకంటే ఐశ్వర్యవంతులు, మనము నిత్య క్షామ పీడితులము. సామాన్య ప్రజా అక్షరాస్యతలో కూడా వారిదే పైచేయి. ఎల్లప్పుడూ లోట్లతో అల్లాడే మనజిల్లాలో విద్యావ్యాప్తి కూడా తక్కువే. ఈ విధముగా వుండడం చేత రేపు ఏర్పడబోయే శాసనసభలో వారి ప్రాతినిధ్యం, ప్రజ్ఞ తప్పకుండా ఎక్కువే. ఈ ప్రజాస్వామిక యుగంలో మెజారిటీ ఓటుకే అధికారం కదా! అప్పటిలో మన మెక్కడ నుంటాము? ఏమై పోతాము? వారి దయా ధర్మ భిక్షకు దోసిలొగ్గి శాశ్వతంగా నోరు తెరుచుకొని కూర్చోవలసిన అవస్థ ఏర్పడుతుంది. భారతములో ధర్మరాజన్నట్లు మనకందరికి "గానవాసోద్వైన్యంబులు" రాగలవప్పుడు. కాబట్టి మనకు వాగ్దానముతోకాక చట్ట

## రాయలసీమకు...

బద్ధంగా తగిన రక్షణలిస్తేగాని వారితో మనము పొత్తు కలిసి సుఖించడము అసంభవము, అసాధ్యము! మనడిమాండులేవో, హక్కు పూర్వకంగా మన ముద్దాటించి, విశదపరచడానికి ఇదే సరియైన అదను: ఈ హక్కులన్నీ స్థిరపడేందుకు ఏ విధంగా శాసన నిర్మాణము కావలెనో, ఆ విధంగా శాసన నిర్మాణము జరగడానికి, వ్రాయబడే రాష్ట్రీయ రాజ్యాంగంలో, తగిన వసతులు కల్పింపబడవలెను. కాబట్టి రాష్ట్రం వేరవుతూనే, ఏర్పడే రాష్ట్రీయ శాసనసభలో మన సీమ వారికి, ఉత్తరాది వాళ్ళకు జిల్లా సంఖ్యను బట్టి సీట్లు ఏర్పాటు కావలెను. మంత్రివర్గ స్థానాల్లోను, ఉద్యోగాల విషయంలోనూ అంతే.

ప్రాజెక్టుల విషయంలో మన జిల్లాలు చాల వెనుకబడి యున్నాయి. కాబట్టి మనపరిస్థితి బాగుపడేవరకైనా, మన సీమలోని మైనర్ మేజర్ ఇరిగేషన్ ప్రాజెక్టుల నిర్మాణానికై, రాష్ట్రాదాయములో ఎక్కువగా ప్రతిసంవత్సరము వెచ్చించే తీరవలెను.

సాంకేతిక, వృత్తి విద్యాలయాలన్నిటిని, వీలైతే, ఏ గుంటూరులోనో ఉంచకుండా, మన సీమలోను అనుకూల పరిస్థితులను గమనించి ఉంచడం, ప్రాథమిక విద్యా విషయంలో ఎప్పుడూ లోటుతో యుండే మన జిల్లాలయందు ప్రత్యేక శ్రద్ధ చూపుతూ, ప్రత్యేక గ్రాంట్లు కూడా

ఆంధ్రపత్రిక
1947 అక్టోబరు 29
సంచిక నుంచి

యివ్వడము; విశ్వవిద్యాలయ కేంద్రాన్ని ఏ విశాఖ పట్టణంలోనో ఉంచడంవల్ల, రాయలసీమ విద్యార్థులకు ఏ విధంగాను ఉపయోగపడదు కాబట్టి రాయలసీమకు ప్రత్యేక విశ్వవిద్యాలయాన్ని ఏర్పాటు చేయడం అత్యవసరము.

బెజవాడనే రాజధాని ముఖ్యపట్టణంగా ఏర్పాటుచేయకుండా, వేరే కొంత స్థలాన్ని (10 లేక 20 చ॥మైళ్ల స్థలాన్ని) అందరికి అనుకూలంగా వుండే ఏ ప్రదేశాన్నైనా ఏర్పాటు చేసి, అందులో జిల్లాల వారిగా, నివేశనాలను ప్రత్యేకించి, ఆ జిల్లాలవారికే ఆ నివేశనాల నమ్మి నగర నిర్మాణాన్ని చేయవలెను. లేకపోతే జానెడు భూమికి నూర్ల రూపాయల మేరకు బెజవాడలో స్థలంకొని, ఏ రాయలసీమ వాసి రాజధాని నగరంలో ఇల్లు కట్టుకోగలడు? రాజధాని అన్న తరువాత, ఎందరో, ఎన్ని పనుల పైననో అచట నివాసాలు ఏర్పాటు చేసుకోవలసి వస్తుంది.

పెద్ద కోర్టులు, ఆస్పత్రులు, పెద్ద పుస్తక భాండాగారములు, రేడియో స్టేషన్లు ఇట్టివాటి విషయాల్లో కూడా మన సీమను మరువకూడదు. ఈసభలో కోరబడే ఇట్టి న్యాయ సమ్మతమైన హక్కులన్నీ ఇవ్వబడితేతప్ప మనము ఆంధ్రరాష్ట్రంలో చేరడానికి వీలులేదు. ఒట్టి మాటలకు బేలపోయే కాలము తీరిపోయింది. ఇప్పుడేమైన చేతలు కావలెనేకాని మాటలు కావు. ఈ విధమైన మన హక్కులు మనకు దొరకని పక్షంలో మనమప్పుడు రాయలసీమ రాష్ట్రాన్ని ప్రత్యేకంగా కోరవలసిందే కాని అన్యథా శరణం నాస్తి! ఇట్టి అవసరాన్ని మనకు మన ఉత్తరాది సోదరులు కల్గింపకుందురుగాక యని ఈ వేదిక నుండి వారిని హెచ్చరించుచున్నాను.

ఈ మన డిమాండ్ల నడగడంలో, మన సీమలో నుండేవారందరు రాజకీయంగా, మతవిషయంగా, వ్యక్తిగతంగా ఎన్నెన్ని విభేదాలు కలిగియున్నా, ఒకక్షణం వాటినన్నింటిని విస్మరించి, ముక్తకంఠంతో ఏక నాయకత్వం క్రింద పని చేస్తుంటే ఎవ్వరూ మన అభివృద్ధికి ఆటంకంగా నిల్వలేరు, నిలువరాదు—అని నా విశ్వాసము. కాబట్టి మన సీమవాసులందఱు ఇప్పట్లో ఐక్యతతో మన రాళ్ళసీమను రత్నాలసీమగా మార్చేందుకు, రాయలనాటి మన పూర్వోన్నతిని మనము పునఃపొందకలిగే విధంగా కృషి చేయడానికి కంకణబద్ధులై కలసి రావలసిందని, మిమ్మందఱిని నేను అభ్యర్థిస్తున్నాను. "ఉద్ధరే దాత్మనాత్మానం" అనే గీతావాక్యాన్ననుసరించి మనలను మనమే ఉద్ధరించుకోవలసిన ఆగత్య మెంతయైనా ఉన్నది. కాబట్టి అందఱు ఏకముఖంగా ప్రయత్నించి రాయలసీమ సర్వతోముఖాభివృద్ధికి ప్రయత్నింతురుగాక యని ఆశిస్తూ ఈ అపూర్వ అవకాశాన్ని నాకు కల్పించిన మీ అందరికీ వందనము లర్పిస్తూ విరమిస్తున్నాను. 




ఎందుకో సొంత ఊరంటే అందరికీ ప్రాణం లేచివస్తుంది. బాల్యంలో గడిపిన అనుభవాలన్నీ పండు వెన్నెలలను కాయిస్తాయి. ఏదో మహత్తరమైన ఆనందం ఆవరిస్తుంది. అర్థం కాని బహురసవత్తరమైన స్పందనతో శరీరం గగుర్పొడుస్తుంది. అది అనిర్వాచ్యం ! అమూల్య కైవల్యం !

ఎంతో ఆశతో కొండంత సంతోషంతో పరుగులు పెడుతూ వస్తే ఏవీ ఆ గుర్తులు ! స్మృతులు తప్ప ఏ సంకేతాలూ లేకుండా—కనీసం శిథిలాలైనా లేకుండా సొంత ఊరు రూపమే మార్చుకొంది. సంతోషమే కాని ... ఏదో ముభావం ! మా ఇల్లు లేదు. ఆ స్థలంలో పెద్ద మార్కెట్ యార్డ్ వెలసింది. ప్రసన్న ఆంజనేయస్వామి గుడి లేదు. ఆ ప్రాకారంలో ఓ హోటల్ రూపు దిద్దుకొంది. మా బోర్డు స్కూలు గుర్తుపట్టడానికి వీలుకాకుండా క్రొత్త తొడుగులు తొడుక్కొంది. చెయ్యేరు కాలువా, ఇసుక తిన్నెలూ, దెయ్యాలబీడు ఏవీ లేవు. జిగేలు మనిపించే ఉస్మాన్‌నగర్ మొలిచిందక్కడ !

ఎందుకో గతం వెక్కిరిస్తోంది. ఏదో మూలుగు గుండె గదులలో వినిపిస్తోంది. అడుగులు భారంగా పడుతున్నాయి. క్రొత్త క్రొత్త మలుపులెన్నో తిరుగుతున్నాయి. ఏదీ ! బూమ్మకొట్టం? కనిపించదే మాయమ్మ గుడిసె! ఎక్కడా ఆ బాదం చెట్టు ? అవశేషాలుకూడ లేకుండా తుడిచిపెట్టుకొని పోయిందే ! కళ్లలో నీళ్లొచ్చాయి.

కాలమెంత కసాయిది !

కళ్లు మూసుకొంటే కన్నీళ్లు చెంపల మీదగా కారాయి. ప్రకృతి ఎంతగా మారి పోతుంది ! అక్కడే ఒకర్నడిగాను...

"ఫాతిమా అని ఓ కట్టెలకొట్టామె ఉండేది ఓ పద్దైదు సంవత్సరాల క్రితం. ఇప్పుడామె..." నా మాటలు పూర్తికాకుండానే..

"ఆమె రెండు సంవత్సరాల్క్రితమే చని పోయింది సాబ్! ఆమె మొగుడు కువైట్‌కు వెళ్లి వేరేదాన్ని కులకడంతో భరించలేక కృంగి పోయింది. అవమాన భారంతో ఎంతో ఆవేదనతో అలమటించిపోయింది. ఒకరోజు ఎవరికీ చెప్పకుండా ఎటో వెళ్లిపోయింది. ఆ తరువాత వారం రోజులకు ఆమె శవం పెన్నానదిలో తేలింది. ఆ తరువాత..."

వినలేకపోయాను. హృదయం వేగంగా కొట్టుకోసాగింది. మౌనం రాజ్యమేలుతోంది. నిశ్శబ్దం తాండవం చేస్తోంది. అలనాటి మధుర స్మృతి రవళిస్తోంది. ఆ తల్లిపట్ల నాకున్న అనురక్తి మురళిస్తోంది. ఫ్లాష్‌బ్యాక్ కళ్లముందు నిలిచింది. సినిమారీల్‌లా కదలసాగింది.

**అవి నేను టెంత్ చదివే రోజులు. తీరా మారా** పద్దైదు సంవత్సరాలుండవు. ఏవేవో అల్లిబిల్లి కబుర్లు, ఏవేవో అల్లరి చిల్లరి పనులు. సెక్సంటే మోజు ! డిషుండిషుం అనడం రివాజు ! ఏ పనులైతే పెద్దలు చేయకూడదంటారో ఆ పనులు చేసి తీరాలనే పట్టింపు. చేసినప్పుడేదో గొప్ప ! పాడుమాటలు, పాడుపనులని వేటనైతే ఈసడించుకొంటారో వాటిపైనే కన్ను. నిజం తెలుసుకొన్నప్పుడేదో ఫోజు !

ఓసారి బూతు బొమ్మల పుస్తకాన్ని చూస్తుంటే తిట్టిపోసింది పిన్ని.

రక్తం వేడెక్కేది !

ఆడకూతురెవరో స్నానం చేస్తుంటే తొంగి చూచినందుకు రసూల్ గాడికి దేహశుద్ధి జరిగిందని బాబాయి చెప్పాడొకరోజు.

ఎందుకు తొంగి చూడాలి ! ఆలోచనలతో రోజులు గడుస్తూ ఉండేవి. అనుమానాలు రోజు రోజుకు ఎక్కువౌతూ ఉండేవి. ఓ రోజు ఓ అయిడియా తట్టింది. తట్టడమే ఆలస్యం ఆచరణలో పెట్టాలనే నిర్ణయం కూడ జరిగింది. మా ఇంటి పెరట్లో ఓ పెద్ద బాదంచెట్టు ఉండేది. చెట్టెక్కి ఆకు గుబుర్ల మాటున కూర్చొంటే ఎవరికీ మనం కనబడము. మనకంతా కనిపిస్తూ ఉంటుంది. ఆ చెట్టునానుకొనే మా ఇంటి వెనుకల బూమ్మ కొట్టం ఉంది. బూమ్మ వాళ్లు స్నానంచేసే మట్టిగోడల గది, పైకప్పు లేంది— బాగా కనిపిస్తుంది. అంటే, ఒక్కమాటలో బూమ్మ స్నానంచేస్తే బాదంబెట్టు పైనుంచి స్పష్టంగా కనబడుతుందన్నమాట !

బూమ్మ అంటే...ముప్పై అయిదు సంవత్సరాలుంటాయి. పచ్చని శరీరఛాయ. తెల్లని పలువరుస. తియ్యని పలుకు. చక్కని రూపం. తీర్చిదిద్దిన పాలరాతిశిల్పం. ప్రాణమున్న ఎల్లోరా ప్రతిరూపం అంత అందం నగ్నంగా ఉంటే ఎలా ఉంటుందో !

నేను చెట్టుకొమ్మపై ఆకు గుబుర్ల మాటున దాగుకొన్నాను. క్షణాలు, నిమిషాలు, గంటలు లెక్కపెడుతూఉన్నాను. బూమ్మ స్నానం చేసేందుకు వచ్చింది. చుట్టూచూచి ఎవరూ లేరని నిర్ధారించుకొంది. నేను ఎంతో ఆత్రంగా

డా॥గుమ్మనూరు రమేష్‌బాబు




**డి. ఎస్. — జమదాళ**

నా వయస్సు 26 సం॥లు. 3 సం॥లుగా వికారంగా ఉండటం, వాంతి అవటం, ఆకలి లేకపోవటం, త్రేన్పులు రావటం, నిద్ర లేకపోవటం, తలనెప్పి మొ॥వి వస్తున్నాయి. డాక్టర్ల సలహామీద మందులు వాడాను.

★ మీరు మానసిక ఆందోళనతో బాధ పడుతున్నారని తెలుస్తున్నది. జీవితంలో ఏదో పొందలేకపోయామనే నిరాశ, నిస్పృహ ఇలా డిప్రెషన్‌కి దారితీసి పై లక్షణాలన్నీ ఏర్పడ తాయి. మీరు సైకియాట్రిస్టుల సలహా కూడా పొందటం మంచిది. తాత్కాలిక ఉపశమనానికి ఎవిడాక్సిన్, డయాజెపాం మొ॥నవి మందులను వైద్యుల సలహా ప్రకారం వాడవలసి ఉంటుంది

**పి. ఆర్. ఆర్. — ఏలూరు**

నా వయస్సు 33 సం॥లు. చాలా కాలంగా విరేచనాలతో బాధ పడుచున్నాను. విరేచనాలు పల్చగా రోజుకి 2, 3 సార్లు అవటం, విరేచనం అయ్యేముందు తెల్లగా కుంకుడుకాయ నురుగు లాగా పడటం జరుగుతోంది. ఈ మధ్య మల పరీక్ష చేయించుకొంటే ఇ. హెచ్, రౌండ్ వర్మ్ ఉన్నట్లు తెలిసింది.

★ మీరు వ్రాసినట్లుగా మీ కడుపులో అమీబియాసిస్ అనే రోగం ఉంది. పైగా కడుపులో "రౌండ్‌వర్మ్స్" అనే ఏలిక పాములు ఉన్నాయి.

మీరు ఫ్లజైల్ మాత్రలను రోజుకి 800 మి. గ్రా. వంతున వరుసగా 10 రోజులు వాడండి తిరిగి మల పరీక్ష చేయించుకొని ఇంకా తగ్గకపోతే ఈ మందులను మళ్లీ వాడవలసి ఉంటుంది.

ఇది తగ్గిన తర్వాత రౌండ్ వర్మ్స్‌కి హెల్మాసిడ్ విత్ సెన్నా రెండు రోజుల పాటు వేసుకోవాలి

**పి. కె. — కర్నూలు**

నా వయస్సు 22 సం॥లు. నేను మా అక్కకూతురు ప్రేమించుకొన్నాము. పెద్దల అంగీకారం కూడ అయింది. 3 నెలల నుంచి నాకు ఒక అనుమానం ఉంది. మొదటిసారిగా ఒక అమ్మాయితో (వేశ్య) కలిశాను. వీర్యకణాలు అభివృద్ధి చెందలేదని ఆ వేశ్య ద్వారా తెలిసింది. సంసార జీవితానికి పనికి రానేమోనని అనుమానంగా ఉంది.

★ మీరు మెడికల్ కాలేజీ ఆస్పత్రులలోని వెనిరియల్ డిపార్టుమెంటులోని వైద్యులచేత పరీక్షింప చేయించుకోవటం మంచిది. వైవాహిక జీవితానికి అర్హులా కాదా అనే విషయాన్ని ఇతరులకన్నా వైద్యులు తీర్మానించటం మంచిది.

**ఎల్. — కొత్తపేట**

నా వయస్సు 22 సం॥లు. నెల రోజుల క్రితం ముక్కునుంచి కొద్దిగా రక్తం వచ్చింది. ఇలా ఇప్పటికి నాలుగుసార్లు వచ్చింది. ఏ విధమైన నెప్పిగాని బాధగాని ఉండదు అలా వచ్చినప్పటి నుండి ముక్కుకి జలుబు చేసినట్లుగా ఉంటుంది.

★ మీరు ఇ. ఎన్. టి వైద్యులకి చూపించుకోవలసి ఉంది. అక్కడి రక్తనాళాలలో ఏదైనా లోపం ఉన్నదీ లేనిదీ ఈ పరీక్షలవల్ల తేలుతుంది. చాలామటుకు ప్రత్యేక కారణం లేకుండా ఇలా జరిగే అవకాశం ఉంటుంది. బ్లీడింగ్ టైము, క్లాటింగ్ టైమ్ అనే పరీక్షలు చేయించుకొని వైద్యులకి చూపించండి. విటమిన్ కె, విటమిన్ సి, స్టెప్టోవిట్ కాల్షియం మొదలయిన మందుల వాడకం కొంత లాభదాయ కంగా ఉంటుంది. తాత్కాలికంగా రక్తస్రావం ఆగటానికి స్థానికంగా అడ్రినలిన్ వాడతారు ★

చూస్తున్నాను. ఏదో తమకం నా ఒళ్ళంతా ప్రాకుతోంది. బూమ్మ గుడ్డలు మొత్తం విప్పే సింది. బండమీద కూర్చొని నీళ్ళు పోసు కొంటోంది. నా చూపులు తీక్షణమయ్యాయి. ఆవిరి వేడిసెగలు క్రక్కుతోంది. బూమ్మదేహాన్ని పచ్చి పచ్చిగా చూడడం మొదలుపెట్టాను. ఏదో ఉద్రేకం నన్నావహించి ఊపివేయసాగింది. కళ్ళు. చెక్కిళ్ళు...పాలిండ్లు...పొక్కిలి .. అలా అలా ఒక్కొక్కటే చూస్తూ రాసాగాను.

ఆ చూడడంలో ఏదో మృగతృష్ణ చోటు చేసుకొంటోంది. కొంచెం ముందుకు వంగాను. పట్టుదొరకడంలేదు. కొద్దిగా వెనక్కు వచ్చాను. బూమ్మ కనిపించడంలేదు. ముందు ముందుకు తొంగి చూడసాగాను. జాగ్రత్తగానే వ్యవహ రించసాగాను. అయితే ఏం... చేసేది తప్పు పని అని మనస్సాక్షికి తెలుసుకాబట్టి . . ఏదో వణుకు పుట్టింది. గ్రుడ్లనేమో చేస్తానన్న భయంతో కాకి రెండుసార్లు గట్టిగా పొడిచింది. కొమ్మ

## బూమ్మ కాదు...

విరిగింది. కాలు జారింది. అంతే! అమాంతం క్రిందపడ్డాను. అమ్మా! అంటూ గావుకేక పెట్టాను ఆ తరువాత నాకేదీ గుర్తురాలేదు. కళ్లు బైర్లుకమ్మినట్లు గుర్తుందంతే.

ఓ గంట గడిచింది. మెలుకువొచ్చింది నాకు. కళ్లు తెరిచి చూస్తే . బూమ్మ ఒడిలో నేను! కళ్లు తెరవగానే ... చిరునవ్వుతో లాలిస్తున్న బూమ్మ! నిమ్మరసం, పంచదార కలిపిన మంచినీళ్లిచ్చింది! చల్లని ఆ చేతులతో నా నొసట ఖద్దసాగింది.

"ఎందుకు బాబూ! చెట్టెక్కావు. ఏదో నా మీద పడబట్టి దెబ్బలు తగల్లేదు. అదే బండలమీద పడిఉంటే ఎంత ప్రమాదమయ్యేది. ఇంకెప్పుడూ చెట్టెక్కకు ఊఁ! ఒట్టువెయ్!"

చెమరిన కళ్లతో ఒట్టు వేయబోయి ఆ చేతిని చూచాను. నలిగి నుజ్జైంది.

"ఓ! ఇదా! అదే నీవు పడేటప్పుడు గోడమీది రాయొకటి దొర్లి నా చెయ్యిమీద పడ్డది! పోతుందిలే"—

"అమ్మా!" — అంటూ ఒడిలో తల దాచుకొన్నాను. ఆ తల్లి స్వాంతనలో ఉపశమిం చాను. ఆ దేవత దీవెనెలో ఉద్యమించాను. అప్పటినుంచీ. ఆమె బూమ్మకాదు అమ్మ!

ఆ క్షణం నుంచీ . .

నేను బాబు కాదు, ఆమె కొడుకు మున్నాని!

పెద్ద చదువులకు ఊరొదిలాను! ఆమెను పోగొట్టుకొన్నాను. ఆమె కోసం ప్రయాసపడి వచ్చాను! కొండంత దుఃఖాన్ని కొనితెచ్చు కొన్నాను.

"సాబ్! ఆమె పాత ఫోటో కావాలంటే ఉంది. ఇద్గో ..."

ఎంతో ఆతురతతో ఆశతో దాన్ని లాగు కొన్నాను. మనిషి గుర్తుపట్టడానికి వీలులేకుండా ఆ ఫోటో పాడయి ఉంది. అయినా అదే నా ప్రాణం! ★

వింటే పిచ్చెక్కుతోంది నాకు,'' అంటూ బ్రతిమాలుకున్నాడు.

చంటి ఉరఫ్ ఆనందరావుగా నరేష్, కొంటె కోణంగి స్వర్ణగా పూర్ణిమ నటించిన ''శ్రీవారికి ప్రేమలేఖ'' రామోజీరావు నిర్మించిన తొలి చిత్రం. జంధ్యాల రచన, దర్శకత్వంతో అట్లూరి రామారావు ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్.

**"గౌతమబుద్ధ"**

''గౌతమబుద్ధుని గాథను ముందు మన భాషలో నిర్మించి, ఆ తర్వాత ఇతర భాషలన్నిటిలోనూ పునర్నిర్మించాలని నా చిరకాల వాంఛ. కుమారి పి. జయశ్రీ రాసిన కథను ఎన్నుకున్నాం. పాత్రలకు సరితూగే కొత్త నటీనటులను ఎంపిక చేసి, మార్చి ఏప్రిల్ నెలల్లో షూటింగ్ పూర్తి చేయడానికి సన్నాహాలు చేస్తున్నాం,'' అన్నారు విశ్వజ్యోతి ఫిలిమ్స్ పతాకంలో పై చిత్రాన్ని నిర్మించే పి. ఎ. పద్మనాభరావు. పెండ్యాల సంగీతం, కె. ఎస్. ప్రసాద్ ఛాయ, వేణుగోపాల్ నృత్యాలతో కమలాకర కామేశ్వరరావు దర్శకుడు.


'జగన్'లో శోభన్, జయసుధ




''మా చిత్రాన్ని ఎక్కువ భాగం అమెరికా, లండన్, రోమ్‌లలో చిత్రీకరించటానికి నిర్ణయించాం!''

**"అమ్మాయిల సవాల్"**

''కేవలం మహిళలను దృష్టిలో ఉంచుకొని దేవర్ ఫిలిమ్స్ తీసిన ఈ చిత్రం తమిళనాడులో అఖండ విజయాన్ని సాధించి, పెద్ద సంచలనాన్ని సృష్టించింది. సవాల్ చేసే అమ్మాయిలుగా సుహాసిని, రాధ, ఊర్వశిలు పోటీపడి నటించారు,'' అన్నారు రాఘవేంద్ర ఆర్ట్ మూవీస్ అధినేత కె. వి. వి. సత్యనారాయణ. ఈయన తెలుగులో రూపొందించిన ''అమ్మాయిల సవాల్'' చిత్రంలో కె. ఆర్. విజయ, సురేష్, మురళి మున్నగువారు కూడా నటించారు. వసంతకుమార్ సంభాషణల కర్త. బప్పీలహరి స్వరకల్పనలో ఆత్రేయ, రాజశ్రీ గీతాలు రాశారు. ఆర్. త్యాగరాజన్ దర్శకుడు. ''ఇది ఆబాలగోపాలాన్ని ఆకర్షించే యాక్షన్ చిత్రం. సుప్రసిద్ధ హిందీ సంగీత దర్శకుడు బప్పీలహరి బాణీలు కూర్చిన పాటలన్నీకూడా హిట్ అయ్యాయి,'' అన్నారు ఈ చిత్రాన్ని సమర్పించే కె. సత్యనారాయణ. ఫిబ్రవరి మొదటి వారంలో విడుదలవుతుంది.

**అల్లు రామలింగయ్య చిత్రం "హీరో"**

''పతాక సన్నివేశాలను దర్శకుడు విజయ బాపినీడు సరికొత్త పంథాలో గగర్పాటు కలిగించేలా చిత్రీకరించారు,'' అన్నారు అల్లు అరవింద్. ఈయన నిర్మించే గీతా ఆర్ట్స్ ''హీరో'' చిత్రంలో చిరంజీవి, రాధిక, సంగీత, పుష్పలత, కృష్ణవేణి, స్మిత, నిర్మల, జయమాలిని, జ్యోతిలక్ష్మి, రంగనాథ్, రావుగోపాలరావు, నూతన్‌ప్రసాద్, అల్లు రామలింగయ్య, ప్రసాద్ బాబు, ఉదయకుమార్ వగైరా నటవర్గం. కాశీ విశ్వనాథ్ సంభాషణలు, ఆత్రేయ గీతాలు, కృష్ణ—చక్ర సంగీతం, కళాధర్ శిల్పం, గౌతమ్‌రాజు కూర్పు, లోక్‌సింగ్ ఛాయ, సాహుల్ స్టంట్స్‌తో బాబూరావు నిర్వహణ బాధ్యతలు వహిస్తున్నారు.

'ఇద్దరు దొంగలు'లో కృష్ణ, రాధ



## "శ్రీనాథకవిసార్వభౌముడు" శ్రీ ఎన్. టి. ఆర్ !

రాజకీయ రంగంలో ప్రవేశించినా — మళ్ళీ సినిమాలలో నటించాలనే ఆసక్తి ఉన్నట్లు ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావు కొన్ని సభలలో వ్యక్తపరిచిన విషయం సర్వవిదితమే. ఇటీవల వీరి సహధర్మచారిణి శ్రీమతి బసవ తారకం అనారోగ్య సందర్భాన మద్రాసుకు విచ్చేసినప్పుడు పనిలో పనిగా ఎన్.ఎ.టి. స్టూడియోస్ వారి "శ్రీనాథకవిసార్వభౌముడు" చిత్రానికి సి. నారాయణరెడ్డి రచించిన కొన్ని పద్యాలకు, గీతాలకు పెండ్యాల నాగేశ్వరరావుచే బాణీలు కూర్చినట్లు, వాటి రికార్డింగ్‌ను డిసెంబర్ 29న హైదరాబాద్‌లోని రామకృష్ణా సినీ స్టూడియోస్‌లో ప్రారంభించినట్లు తెలుస్తోంది. ప్రధాన పాత్రను శ్రీ ఎన్.టి.ఆర్. నిర్వహిస్తే, మరో ప్రముఖ పాత్రను వారి తనయుడు బాలకృష్ణ పోషిస్తారు. వీరి "చండశాసనుడు" చిత్రం తమిళంలో డి. యోగానంద్ దర్శకత్వంలో తయారవుతుంది. తండ్రీ కొడుకులుగా శివాజీ గణేశన్, ప్రభు నటించగా మాధవి మున్నగు వారు ఇతర భూమికలను నిర్వహిస్తారు.

'పుణ్యంకొద్దీ పురుషుడు'లో అనూరాధ

'మానసవీణ'లో పద్మ



## "ముఖ్యమంత్రి"గా కృష్ణ

"డిసెంబర్ 21 నుండి నెలాఖరు వరకు జరిగిన తొలి షెడ్యూల్‌లో మూడు పాటలతో పాటు క్లయిమాక్స్ కూడా చిత్రీకరించేశాం," అన్నారు విజయనిర్మల. ఈమె స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో కృష్ణ హీరోగా టి. శ్రీనివాసరెడ్డి నిర్మించే వినయ్ మూవీస్ "ముఖ్యమంత్రి" చిత్రం మిగతా షెడ్యూల్స్ జనవరి, ఫిబ్రవరిలో ప్రతి మాసం 21 నుంచి చివరి తేదీల వరకు జరగడంతో షూటింగ్ పూర్తవుతుందని నిర్వహణ బాధ్యతలు వహించే కె.బి. ప్రసాద్‌రెడ్డి తెలిపారు. కృష్ణ, అంబిక, రావుగోపాలరావు, ప్రభాకరరెడ్డి; శ్రీధర్, గిరిబాబు, అల్లు రామలింగయ్య, నరసింహరాజు, త్యాగరాజు, జగ్గారావు, అన్నపూర్ణ, జయమాలిని, జ్యోతిలక్ష్మి పాత్రధారులు. అప్పలాచార్య, చక్రవర్తి, పుష్పాల గోపీకృష్ణ, కోదండం, ఆదుర్తి హరనాథ్, జి. పద్మనాభన్, ఓ. ఎస్. ఆర్. ఆంజనేయులు, ఎన్. శేషు, మాధవరెడ్డి, జగదీష్‌రెడ్డి తెర వెనుక కృషి చేస్తున్నారు. శాఖమూరి సాంబశివరావు సహ నిర్మాత

## "గూండా"లో గులాబి

మౌనంగా తల వొంచుకుని కూర్చొనున్న జయ (రాధ) ముందు టీపాయ్‌మీద కొన్ని కాగితాలు ఉంచాడు రాజా (చిరంజీవి). జయ ఆ కాగితాలు చూసి ఆశ్చర్యంగా "బాకీ డబ్బు చెల్లించి, కైలాసం దగ్గర తాకట్టున్న ఇంటి కాగితాలు తెచ్చారా? అంత డబ్బు ఎవరు చెల్లించారు?" అంది.

"ఇష్టమైన మనుషులు కష్టంలో ఉన్నప్పుడు వాళ్ళకి సహాయం చెయ్యటంవల్ల మనకు నష్టం లేనప్పుడు – చేసెయ్యమన్నాడు ఓ పెద్దమనిషి. చేసేశాడు ఈ చిన్నమనిషి," అన్నాడు రాజా.

"అంటే... ఆ బాకీ మీరు తీర్చేశారా? అంత డబ్బు మీకెక్కడిది?"

"మనసుండాలేగాని, మార్గాలు సవాలక్ష అన్నాడు ఇందాకటి పెద్దమనిషి. ఆ సవాలక్షలో మనం ఓ మార్గంలో ప్రొసీడ్ అయ్యాం. బాకీ తీర్చేశాం."

"కాని, రాజా... మేం మీకెవరమని, ఏమవుతామని ఇంత సహాయం చేశారు?"

"కొన్ని ప్రశ్నలకు జవాబులు మాటలతో చెప్పలేం – మనసుతో తప్ప – అని అదే పెద్దమనిషి అన్నాడు... నా ఆశకు రూపం ఈ గులాబి. దీన్ని నువ్వు అందుకుని తలలో పెట్టుకుని కనిపిస్తే, నా ఆశ నువ్వు తీర్చినట్టే అనుకుంటాను," అంటూ రాజా తన చేతిలోని గులాబీని టీపాయ్‌మీద ఉంచి, పక్క గదిలోకి వెళ్ళాడు.

ఆ గులాబి వంకే కొన్ని క్షణాలపాటు చూస్తూండిపోయింది జయ.

ఏ. కోదండరామిరెడ్డి దర్శకత్వంలో మిద్దె రామారావు నిర్మించిన శ్రీ రాజలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ "గూండా" చిత్రం విడుదలకు సిద్ధమవుతోంది.

'జల్సారాయుడు'లో కమలహాసన్





'గూండా' లో స్మిత

## విజయశాంతి చిత్రాలు

"వీరభద్రుడు, జడగంటలు, దేవాంతకుడు" చిత్రాలు త్వరలో విడుదల కానున్నాయి. "ఎస్. ఐ. భయంకర్, సుందరి – సుబ్బారావు, మహానగరంలో మాయగాడు, రారాజు, క్రియేటివ్ కమర్షియల్స్‌వారి చిత్రం"– నిర్మాణ దశలో ఉన్నాయి. ఏప్రిల్‌లో ప్రారంభమయ్యే వైజయంతీ మూవీస్ చిత్రంలో కృష్ణ హీరో. రాజాచంద్ర దర్శకత్వంలో గుప్తా క్రియేషన్స్ నిర్మించే చిత్రంలో సుమన్ హీరో.




## వాడాంమేం దిగుమతిచేసిన 6-12 కొసల్ని - మా టూత్ బ్రష్‌లోని ఆ కొసలు తాకిన ప్రతిసారీ మీ చిగుళ్ళకూ పళ్ళకూ యిక ఆరోగ్య చికిత్స

మాయాలు కొసలైతే, మీ చిగుళ్ళను గాయపరుస్తాయి మీ పళ్ళ తాలూకు జీవిత కాలాన్ని తగ్గించేస్తాయి.

అందుకే మరి ఒజెట్ సూపర్ డీలక్స్ టూత్ బ్రష్‌ను తయారు చేసేందుకోసం కేవలం దిగుమతిచేసిన 6-12 కొసలనే వాడతాం. అంటే, ప్రపంచమంతటా సున్నితమైన. నాణ్యతగల టూత్ బ్రష్‌లను తయారుచేసే వారు వాడే వాటినే వాడతాం మరి.

ఒజెట్ టూత్ బ్రష్ కొసలు తాకిన ప్రతిసారీ, అవి మీ చిగుళ్ళను మర్దనచేసి, వాటిని ఆరోగ్యవంతంగా, దృఢంగా తీర్చిదిద్దుతాయి.

ఆరోగ్యవంతమైన చిగుళ్ళంటే, దృఢమైన గట్టిపళ్ళన్నమాట.

ఒజెట్ కేవలం టూత్ బ్రష్ మాత్రమేకాదు- అది మీ చిగుళ్ళూ, పళ్ళూ-వీటి ఆరోగ్య చికిత్స.

ఇది **వోల్టాస్** ఉత్పాదన.

# సినిమా

## "రచయిత్రి" త్వరలో విడుదల

''మా చిత్రం ప్రారంభంలో ప్రముఖ రచయిత్రులు కె. రామలక్ష్మి, వాసిరెడ్డి సీతాదేవి, లీలావతి రాఘవయ్య, పాటిబండ్ల విజయలక్ష్మిగార్లు గెస్ట్‌లుగా కనిపిస్తారు,'' అన్నారు భానుమతీ రామకృష్ణ. ఆమె కథ, స్క్రీన్‌ప్లే, సంగీతం, దర్శకత్వంతోపాటు ప్రధాన భూమికను పోషించిన భరణీ పిక్చర్స్ ''రచయిత్రి'' చిత్రం త్వరలో విడుదలవుతుంది. శరత్‌బాబు, చక్రపాణి, అల్లు రామలింగయ్య, రవీందర్, రాజీ, రమాప్రభ, ఝాన్సీ, అపర్ణ, చంద్రలేఖ, ప్రమీల, అత్తిలిలక్ష్మి, సుప్రసిద్ధ తమిళ హాస్యనటుడు సురుళిరాజన్ పాల్గొన్నారు. డి. వి. నరసరాజు సంభాషణలకర్త.



'రక్త సంబంధం'లో రాధ

## మోహన్‌బాబుతో శ్వేత చిత్ర చిత్రం

''మోహన్‌బాబు సరసన తొలుదొల్త విజయశాంతి నాయికగా నటించడం మా చిత్రం తోనే,'' అన్నారు కె. శివశంకర్. ఈయన నిర్మించే పై సంస్థ చిత్రంలో నారాయణరావు, రాజ్యలక్ష్మి, శుభలేఖ సుధాకర్, అల్లు రామలింగయ్య, వేలు, అనూరాధ, విచిత్రకుమార్ ఆదిగాగలవారు పాల్గొంటారు. టి. శ్రీనివాసరెడ్డి సమర్పణలో ఈ చిత్రానికి దర్శకత్వం వహించే జనార్దన్ ''జనవరి, ఫిబ్రవరి నెలల్లో 1–15 తేదీల మధ్య జరిగే రెండు షెడ్యూల్స్‌లో షూటింగ్ పూర్తవుతుంది,'' అన్నారు.

## ఇమంది రామారావు తొలిసారిగా దర్శకత్వం వహించే "ముద్దుల చెల్లెలు"

''ఇమంది రామారావు పాత్రికేయుడు, నటుడు, రచయిత, విమర్శకుడుగా సుపరిచితుడు. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, మాటలు సమకూర్చిన 'ముద్దుల చెల్లెలు' స్క్రిప్ట్‌ను చదివిన వెంటనే చాలామంది ఈయన్నే దర్శకత్వం వహించమని సలహా ఇచ్చారు. ఈయన దాసరి నారాయణరావు గారి వద్ద ఎన్నో చిత్రాలకు సహాయ, సహకార దర్శకుడుగా పనిచేసి, సమర్థుడనిపించుకున్నారు. సాత్వికుడు కూడా. అందుకే మా తొలి చిత్రాన్ని డైరెక్ట్ చేసే బాధ్యతను ఈయనకే అప్పగించాం. రసవత్తరమైన కథ గనుక ఈ చిత్రం గారంటీగా హిట్ అవుతుందనే గాఢ నమ్మకం మాలో ఏర్పడడం అత్యుక్తి ఏమీకాదు,'' అన్నారు యోగ్యప్రియ ఆర్ట్ క్రియేషన్స్ అధినేత వి. రమణయ్యనాయుడు. డిసెంబర్ 5 నుంచి జనవరి 10 వరకు విశాఖపట్నం పరిసరాలలో ఏకబిగిన చిత్రీకరణ ముగిసే ఈ చిత్రంలో మురళీమోహన్, రంగనాథ్, తులసి, అరుణ, సంగీత, దీప, పద్మనాభం, కృష్ణవేణి, అరుణ కుమార్, రాజశేఖర్, కల్పనారాయ్, మందుల, కుమ్మరి మాస్టారు నటిస్తున్నారు. ఆత్రేయ గీతాలకు కె. వి. మహదేవన్ స్వరకర్త. యోగానంద్ ఛాయ, కోటగిరి వెంకటేశ్వరరావు కూర్పు, గాదిరాజు కేశవరావు సహదర్శకత్వం, ఎన్. కె. నాయుడు – రాంప్రసాద్ సహకార దర్శకత్వంతో ఎం.ఎస్.ఎన్. రాజు ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్.

## చిత్రీకరణ ముగిసిన లక్ష్మీ ఫిలిమ్స్ కంబైన్ 7వ చిత్రం

''ఊటీలో నాలుగు పాటలు, కొన్ని సన్ని వేశాలు, హైదరాబాద్‌లో రెండు పాటలు, తతిమ్మా సన్నివేశాలు షూట్ చేశాం. వీటితో షూటింగ్ పూర్తయినట్లే. ఇకపోతే డబ్బింగ్, రీ రికార్డింగ్ జనవరిలో పూర్తవుతాయి,'' అన్నారు నంగునూరు శ్రీనివాసరావు. ఈయన సమర్పించే లక్ష్మీ ఫిలిమ్స్ కంబైన్స్ 7వ చిత్రంలో ఎ. ఎన్. ఆర్., సుజాత, రాధిక, జగ్గయ్య, ప్రభాకరరెడ్డి, అల్లు రామలింగయ్య, నాగేష్, మురళి, తులసి, మమత, నిర్మల, రామదాస్, ప్రతాప్ నటించారు. సత్యానంద్, చక్రవర్తి, నవకాంత్, భాస్కరరాజు, కె. వెంకటేశ్వరరావు, సదాశివరావు, వి. అనంత్, రామారావు, రాధాకృష్ణ ప్రభృత సాంకేతిక వర్గంతో ఎ. కోదండరామిరెడ్డి స్క్రీన్ ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించారు. ''ఫిబ్రవరిలో రిలీజ్ చేస్తున్నాం,'' అన్నారు నిర్మాత ఎన్.ఆర్. అనూరాధాదేవి.

**2 రూ. లకు కిలో బియ్యం :**

* 108 లక్షల పేద కుటుంబాల వారికి ప్రయోజనం
* రూ 108 కోట్ల మేరకు సబ్సిడీ
* 80 శాతం జనాభాకు 15.89 లక్షల టన్నుల బియ్యం పంపిణీ.... రాష్ట్రంలో పౌర సరఫరాల చరిత్రలోనే కొత్త రికార్డు.

**రైతులకు తోడ్పాటు :**

* ధాన్యం, వేరుశెనగ చెరకులకు గిట్టుబాటు ధరలు.

**గ్రామీణాభివృద్ధి :**

* బయోగ్యాస్ ప్లాంటులకై - 6,500 కుటుంబాలకు రూ. 1.31 కోట్లు సబ్సిడీగా రూ. 2.62 కోట్లు రుణాలుగా పంపిణీ
* పారిశుద్ధ్యపు పనివారికి ఆ వృత్తినుంచి విముక్తి కలిగించడానికి, సామాజిక మరుగుదొడ్ల నిర్మాణానికై రూ. 2.26 కోట్లు ఖర్చయ్యే 'విముక్తి' కార్యక్రమం ప్రారంభం.

**బలహీనవర్గాల సంక్షేమం :**

* షెడ్యూలు కులాలకు - 2.5 లక్షల కుటుంబాలకు ప్రయోజనం చేకూర్చే రూ. 173 కోట్ల పథకం.
* షెడ్యూలు జాతులకు – 50,000 కుటుంబాలకు ప్రయోజనం చేకూర్చే రూ. 52 కోట్ల ప్రణాళికలు.
* వెనుకబడిన తరగతులకు–2.88 లక్షల కుటుంబాలకు ప్రయోజనం చేకూర్చే రూ. 14.81 కోట్ల మేరకు మార్జిన్ మనీ.

**పేదలకు యిళ్లు :**

* పూరిపాకల బదులు పక్కా యిళ్ల నిర్మాణం.
* వివిధ పథకాల క్రింద 66,489 పక్కా యిళ్ల నిర్మాణం పూర్తి.
* పేద కుటుంబాలవారికి లక్ష యిళ్ల స్థలాల పంపిణీ.

28 జూనియర్ కళాశాలలు.)

**విద్యుచ్ఛక్తి :**

* విద్యుచ్ఛక్తి రంగంలో రాష్ట్రంలో స్వయం సమృద్ధి. స్థాపిత విద్యుదుత్పాదనాశక్తి 2,901 మె. వాట్లకు హెచ్చింపు.
* 1,500 గ్రామాలకు, కుగ్రామాలకు విద్యుచ్ఛక్తి సౌకర్యం.

**నీటి పారుదల :**

* రూ 637 కోట్ల తెలుగు గంగ ప్రాజెక్టు.... తెలుగు తమిళుల మధ్య స్నేహ వారధి .... రాయలసీమలో అనావృష్టి ప్రాంతాలకు సేద్యపు నీటి కల్పనకు ఉద్దేశించినది
* నల్గొండ జిల్లాలో 1.2 లక్షల ఎకరాలకు ప్రయోజనం చేకూర్చే రూ 314 కోట్ల శ్రీశైలం ఎడమగట్టు కాలువ.
* తెలంగాణాలో 9.5 లక్షల ఎకరాలకు సేద్యపు నీటిని అందించే రూ. 203 కోట్ల శ్రీరాం సాగర్ రెండవ దశ.

**పరిశ్రమలకు ప్రోత్సాహం :**

* 'గ్రామోదయ'–యూనిటుకు రూ.25,000చొప్పున రుణసౌకర్యంతో స్వయం ఉపాధి పథకాలను చేపట్టడానికి గ్రామీణ విద్యావంతులైన నిరుద్యోగ యువకులకోసం (కేంద్ర పథకం) కార్యక్రమం.
* 'దీప'–యువకులు జీవితంలో స్థిరపడేవరకు శిక్షణ, మార్గదర్శకత్వం కల్పించే కార్యక్రమం.
* 'యువశక్తి' - జాతీయ నిర్మాణ కార్యకలాపాలవైపు యువకుల శక్తి సామర్థ్యాలను మళ్లించే కార్యక్రమం.

**అధికార భాష :**

* అన్ని స్థాయిల్లో తెలుగు అధికార భాషగా ప్రోత్సాహం.

**అవినీతి నిర్మూలన :**

* అవినీతి నిరోధానికి లోకాయుక్త.
* రాష్ట్రస్థాయిలో, జిల్లాస్థాయిలో ఫిర్యాదుల పరిష్కారానికి విభాగాలు

ప్రజలకు సన్నిహితమైన ప్రజా ప్రభుత్వం.

డి. ఐ. పి. ఆర్. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

Letter: DIPR/30740/Advt/C 4/83/29-12-83

## "రైలు దోపిడి"

"పిక్చర్ ప్రారంభంలో వచ్చే ఫైట్స్‌ను మద్రాసు హార్బర్‌లో కె. ఎస్. రెడ్డిగారు కొత్త పద్ధతిలో పిక్చరైజ్ చేశారు. ఈ సన్నివేశంలో ప్రభ, ఎం. వి. లక్ష్మి, సి. వి. శర్మ, జీవా, పలువురు ఫైటర్లు పాల్గొన్నారు," అన్నారు గోటేటి ఫిలిమ్స్ పతాకంలో పై చిత్రాన్ని నిర్మించిన గోటేటి శ్రీరామారావు. విజయలలిత, భానుచందర్, నూతన్‌ప్రసాద్, నరసింహరాజు, సాక్షి రంగారావు, భీమేశ్వరరావు, పి. ఆర్. వరలక్ష్మి, జయమాలిని, అనూరాధ వగైరా తారాగణం. వియత్నాం వీడు సుందరం కథకు పేరాల సంభాషణలకర్త. ఎస్. పి. రంగారావు సహదర్శకుడు. జి. వి. రావు నిర్వహణలో జి. సత్యవతి, జి. నారాయణరావు నిర్మాతలు.



'చదరంగం'లో సత్యనారాయణ

## కె. ఎస్. ఆర్. దాస్ దర్శకత్వంలో మక్కళ్ తిలకం మూవీస్ ద్వితీయ చిత్రం

కృష్ణతో కె. ఎస్. ఆర్. దాస్ దర్శకత్వంలో నిర్మాత పి. పద్మనాభం లోగడ ప్రారంభించిన చిత్రం రెగులర్ షూటింగ్ డిసెంబర్ 1 నుంచి చురుకుగా జరుగుతోంది. జయప్రద, సుమలత, రావు గోపాలరావు, సత్యనారాయణ, గిరిబాబు, అల్లురామలింగయ్య, అన్నపూర్ణ, జయమాలిని, మాస్టర్ వెంకటేశ్వర్లు మున్నగు వారు పాత్రధారులు. త్రిపురనేని మహారధి సంభాషణలకర్త సత్యం స్వరకల్పనలో వేటూరి, ఆత్రేయ గీతాలు రాశారు. ఎస్. ఎస్. లాల్ ఛాయ, ఎం. కృష్ణ శిల్పం, బండ్రెడ్డి నరసింహారావు సహదర్శకత్వం నిర్వహిస్తున్నారు. ఫిబ్రవరి 10కి షూటింగ్ పూర్తవుతుంది. మార్చి విడుదల.

# సినిమా

## గిరిబాబు సమర్పణలో కాయిత్రిష్ణ కేశవరావు సినిమాస్కోప్‌లో నిర్మించే "మెరుపుదాడి"

''జనవరి, ఫిబ్రవరి, మార్చి నెలల్లో థ్రిల్స్, ఫైట్స్, యాక్షన్ సన్నివేశాలు గల ఈ భారీ చిత్ర నిర్మాణం తలకోన అడవుల్లో జరుగుతుంది,'' అన్నారు గిరిబాబు ఈయన కథ సమకూర్చి సమర్పించే శ్రీ భ్రమరాంబికా ఫిలిమ్స్ ''మెరుపుదాడి'' సినిమాస్కోప్ చిత్రం షూటింగ్ డిసెంబర్ 20న ప్రారంభమైంది సుమన్, భానుచందర్, రంగనాథ్, గిరిబాబు, గొల్లపూడి, ప్రభాకరరెడ్డి, త్యాగరాజు, సారథి, మాడా, జగ్గారావు, ఆనందమోహన్, సుమలత, జయమాలిని, స్మిత, సత్రా, వీరభద్రరావు మున్నగువారు నటిస్తున్నారు అప్పలాచార్య సంభాషణలు, వేటూరి గీతాలు, ఇళయరాజా సంగీతం, విజయ్‌దేవరాజ్ ఛాయ, రంగారావు శిల్పం, శీను నృత్యాలు, రాజు సాహసాలు, రాయప్రోలు గోపి సహకార దర్శకత్వంతో కె కేశవరావు నిర్మించే ఈ చిత్రానికి స్క్రీన్‌ప్లే, దర్శకత్వం రామచంద్రరావు



'వీరభద్రుడు'లో మాదాల రంగారావు

## మురళీమోహన్ చిత్రాలు

''సంతానం, బావామరదళ్ళు, మగాళ్ళకో నమస్కారం, కురుక్షేత్రంలో సీత, సీత పుట్టిన దేశంలో, ఆడదాని సవాల్, కళారంజని, కిలాడీ దొంగలు, ముద్దుల చెల్లెలు, కాయ్ రాజా కాయ్, నిర్దోషి'' అనంతరం దాసరి, రాజాచంద్ర, ఎం ఎస్ కోటారెడ్డి దర్శకత్వం నెఱపే చిత్రాలలో నటించనున్నారు



ఎ వి యం ప్రొడక్షన్స్ నూతన చిత్రంలో భాగ్యరాజ్, ఊర్వశి

## 1984 లో శ్రీ సారధీ స్టూడియోస్ చిత్రాలు

శ్రీ సారధీ స్టూడియోస్ వారు 1983 లో పెళ్లిచూపులు, మూడుముళ్లు రెండు చిత్రాలు నిర్మించారు రెండు చిత్రాలు శతదినోత్సవం జరుపుకున్నాయి ఈ రెండు చిత్రాలకు రచయిత శ్రీ కె భాగ్యరాజ్

1984 లో మీ నిర్మాణ కార్యక్రమం ఏమిటని అడిగినప్పుడు శ్రీ శశిభూషణ్, "1984 లో మా సంస్థ ముగ్గురు ప్రముఖ దర్శకులతో మూడు చిత్రాలు అందించాలని నిర్ణయించుకుంది మూడు చిత్రాలు కూడా ఒకదాని వెంట ఒకటి పూర్తి చెయ్యాలని అనుకుంటున్నాం

శ్రీ కె భాగ్యరాజ్ 'డార్లింగ్ డార్లింగ్' చిత్రంతో నటుడిగా, దర్శకుడిగా ప్రేక్షకులలో మంచి పేరు వచ్చింది అందువలన ఆయనే దర్శకుడిగా, హీరోగా, రచయితగా తెలుగులో ఓ చిత్రం తియ్యాలని నిర్ణయించుకున్నాం ఈ చిత్రానికి సంబంధించిన వివరాలు త్వరలో తెలియజేస్తాం'' అని చెప్పారు

శ్రీ జంధ్యాల దర్శకత్వంలో మరో చిత్రం నిర్మించాలని ఆలోచన వున్నట్టు, ఆయన అభిరుచికి తగిన కథ, ఆయనకి తీరిక దొరగ్గానే నిర్మాణం ప్రారంభిస్తామని ఆయన చెప్పారు

మూడు ముళ్లు చిత్రానికి మూలమైన ''ముంధానై ముడిచ'' తమిళ చిత్రాన్ని తెలుగులో ఎందుకు డబ్ చేస్తున్నారు ? అని అడిగినప్పుడు శశిభూషణ్ ఇలా అన్నారు —

దర్శకులు శ్రీ జంధ్యాల భాగ్యరాజ్ కథని తీసుకుని తన బాణీలో చిత్రీకరించారు ఒకే కథను ఇద్దరు దర్శకులు ఎలా చిత్రీకరిస్తారో ఈ చిత్రం చూస్తే మీ కర్థమవుతుంది

మూడు ముళ్ళు చిత్రం బాక్సాఫీస్ హిట్టా ? కాదా ? అనే సందేహం వెలిబుచ్చినపుడు నిర్మాత శశిభూషణ్ ఇలా అన్నారు — ''మూడు కేంద్రాల్లో శతదినోత్సవం చేసుకున్న చిత్రం గురించి మీ కెందుకొస్తుంది ఇలాంటి అనుమానం ? లోగడ భాగ్యరాజ్ కథతో తీసిన రెండు చిత్రాలకంటే ఈ చిత్రం ఎక్కువ వసూలు చేసింది జంధ్యాలగారి చిత్రం ''ఎ'' క్లాసులో బాగా వస్తుంది బి,సిల్లో తగ్గుతుందేమో అనుకున్నాం ! కాని మూడు ముళ్ళు బి క్లాసు కేంద్రాలలో కూడా విజయవంతంగా నడుస్తోంది ! ఈ చిత్రం ఇంతటి విజయం సాధించింది ! తమిళ చిత్రం డబ్బింగ్‌ను శ్రీ జంధ్యాల, శ్రీ భాగ్యరాజ్ ఇద్దరూ ప్రోత్సహించారు ఒకే కథని తెలుగులో తీసిన తరువాత అదే చిత్రాన్ని తిరిగి డబ్ చెయ్యడం ఇదే మొదటిసారి అందువల్లనే ఈ చిన్న ప్రయోగం చేస్తున్న శ్రీ శరవణన్ అభినందనీయులు ''

ఈ అనువాద చిత్రానికి ఇంకా పేరు పెట్టలేదు ఈ చిత్రం జనవరి ఆఖరి వారంలో విడుదల కావచ్చు కె భాగ్యరాజ్ హీరో, రచయిత, దర్శకత్వం నిర్వహించిన ఈ చిత్రంలో ఊర్వశి, దీప ముఖ్య పాత్రధారులు ఛాయ అశోక్‌కుమార్, సంగీతం ఇళయరాజా, తెలుగులో మాటలు, పాటలు రాజశ్రీ ఈ చిత్రం నవయుగ ద్వారా విడుదలవుతుంది

— రా ధ

# తెరపొరలు

## సత్యజిత్‌రే గురించి కొన్ని కొత్త విషయాలు :

ఆక్స్‌ఫర్డ్ యూనివర్శిటీలో గౌరవ డాక్టరేట్ పట్టా పొందిన చిత్ర ప్రముఖులిద్దరిలో ఒకరు చార్లీ చాప్లిన్; మరొకరు సత్యజిత్‌రే. ఈయన వయసు అరవై దాటింది. ఒక చిత్రానికి లక్ష నుంచి లక్షన్నర వరకు పారితోషికం పుచ్చుకుంటారేగాని, బ్లాక్‌మనీ ప్రసక్తే ఉండదు. ఇప్పటికీ ఈయన అద్దె ఇంట్లోనే ఉంటున్నారు. ఆ ఇంట్లో నాలుగువేల పైచిలుకు గ్రంథాలున్నాయి. పిల్లలకు కథలు రాయడమంటే ఎంతో సరదా. ఇది వరకు రాసిన బాలల పుస్తకాల మూలంగా ఈయనకు ఏటా లక్ష రూపాయల వరకు రాయల్టీ అందుతూంటుంది. చక్కని చిత్రకారుడన్న విషయం అందరికీ తెలిసిందే. చాల బాగా పియానో వాయిస్తారు కూడా. 6 అ. 4 అంల పొడగరి. ఈయనకన్నా ఈయన భార్య రెండేళ్ళు పెద్ద. ఎన్నో అవార్డులు పొందిన "పథేర్ పాంచాలి" చిత్రాని పూర్తిచేయడానికి ఈయన భార్య నగలను తాకట్టు పెట్టవలసి వచ్చింది. చిత్రం పూర్తయ్యాక పంపిణీదారులెవరూ ముందుకు రానందున విడుదల చేయడం మరో సమస్య అయిపోయింది అప్పుడు బెంగాలీ ప్రభుత్వమే విడుదల చేసి, పెట్టుబడి పెట్టిన మొత్తానికన్నా ఇరవై రెట్ల లాభాన్ని పొందింది.

## ఛాయాగ్రాహకుడు విన్సెంట్ గురించి :

తెలుగు, తమిళ, కన్నడ, హిందీ, మలయాళ భాషల్లో 175 చిత్రాలకు పైగా ప్రతిభావంతంగా ఛాయాగ్రహణం నెఱపిన విన్సెంట్ తన ఎనిమిదవ ఏటనే బాక్స్ కెమెరాను చేతబట్టారు. ఈయన తండ్రికి కేరళలో ఒక ఫొటో స్టూడియో ఉండేది. అక్కడ విన్సెంట్ మొదట డార్క్‌రూమ్‌లో ఫిలిమ్‌లు కడగడం నేర్చుకున్నారు. రోడ్డుమీద ఓ పాపాయి ఏడుస్తూ కనిపిస్తే, ఏ కోణం నుంచి ఫొటో తీస్తే బావుంటుందోనని అప్పట్నుంచే ఆలోచించేవారు. క్రిస్టియన్ కాలేజీలో ఇంటర్‌మీడియెట్ పాసయ్యాక 1947లో జెమినీ స్టూడియోలో 62 రూపాయల జీతానికి చేరారు. 1951 వరకు అక్కడే ఉన్నారు. ఈయన తొలి తెలుగు చిత్రం పి. ఎ. పి. వారి "ఇల్లరికం". ఎక్కువ చిత్రాలకు పనిచేస్తే ఏకాగ్రత లోపిస్తుందని ఈయన మతం. ఈయన డైరెక్టు చేసిన కొన్ని మలయాళ చిత్రాలకు అవార్డులు వచ్చాయి. 1951లో ఈయన తొలిసారిగా 'స్లోమోషన్' కెమెరాను ఆపరేట్ చేశారు "పరదేశీ" చిత్రం కోసం నిర్మాత ఆదినారాయణరావు బొంబాయిలోని రాజ్‌కమల్ (శాంతారాం) స్టూడియో నుంచి ఆ కెమెరాను తెప్పించారు. అప్పుడు కమల్‌ఘోష్ ఛాయాగ్రహణ దర్శకుడు, విన్సెంట్ ఆపరేటివ్ కెమెరామన్. 1958లో ఓం ప్రథమంగా ఓ మలయాళ చిత్రానికి 'స్లోమోషన్' చిత్రీకరణ జరిపే ఘనత కూడా విన్సెంట్‌కే దక్కింది. "ఈ రోజుల్లో తాబేలు, నత్త నడకలను కూడా స్లోమోషన్‌లో తీసేస్తున్నారు," అంటారు విన్సెంట్ నవ్వుతూ. ★




రూపాయిని రెండు రూపాయలు అనతి కాలంలోనే చేస్తామని చాలామంది ప్రకటిస్తారు మీ పెట్టుబడి ఎంతవరకు పదిలము? మీరు శ్రమపడి కూడబెట్టిన డబ్బుపైన అధిక ఆదాయం ఎంతైనా అవసరమే ఎందుకంటే ధరల పెరుగుదలతో డబ్బుకు నేడున్న విలువ రేపుండదు ఆ విలువ పడిపోకుండా మీ నిద్ర చెడిపోకుండా వుండాలంటే మీ డబ్బును అధిక ఆదాయంతో బాటు అమిత భద్రత కల్పించే చోట పెట్టాలి ఆ రెండు హామీలనిచ్చే సంస్థే 'రాజ్ యువరాజ్'

**బహు భద్రత:–**

'రాజ్ యువరాజ్' వెనుక ఏండ్ల తరబడి పేరు ప్రతిష్ఠలు సంపాదించిన 14 ప్రముఖ కంపెనీలు వున్నాయి దేశంలో భారీ ఎత్తున ఖనిజాలను ఎగుమతి చేసే 'శ్రీ విజయలక్ష్మి మినరల్స్ ట్రేడింగ్ కంపెనీ', ఎ పి ఐ డి సి తో కలిసి కోట్లరూపాయిల పెట్టుబడితో స్థాపించిన 'ది ఆంధ్రప్రదేశ్ కార్బైడ్స్ లిమిటెడ్'లు ఈ గ్రూపులోనివే మిగతా కంపెనీలు వాటి వివరాలు ఉచితంగా పంపబడే ఒక పుస్తకం పొంది తెలుసుకోవచ్చు

'రాజ్ యువరాజ్'లో దాచుకొన్న డబ్బుకి ఈ కంపెనీల అభయం వుండటం ద్వారా మీ పెట్టుబడికి అపారమైన భద్రత వుంటుంది ఈ హామీతో బాటు కొన్ని పథకాలలో పెట్టే పెట్టుబడికి జాతీయ బ్యాంకు కేష్ సర్టిఫికేట్లు కూడా ఇవ్వబడతాయి

**అత్యధిక ఆదాయం:–**

'రాజ్ యువరాజ్'లో దాచుకున్న డబ్బుపై సాలీనా 20 శాతం వరకు ఆదాయ లభిస్తుంది అంతేగాక, అనుకోని అవసరం వచ్చినప్పుడు డిపాజిట్ గడువు కాలం పూర్తి కాకుండానే మీ డబ్బు మీరు తిరిగి తీసుకొనే అవకాశం కూడా వుంటుంది

**విస్తృతమైన పథకాలెన్నెన్నో:–**

అందరి అవసరాలు దృష్టిలో వుంచుకొని 'రాజ్ యువరాజ్' 11 రకాల పథకాలు ప్రవేశపెట్టింది కేవలం 6 సంవత్సరాలలో మీ పెట్టుబడిని మూడింతలు చేసే పథకముంది మీ బిడ్డన కాలేజి చదువుకి, సుఖమయ జీవితారంభానికి అనువైన 'విద్యా ప్రణాళిక' వుంది మీరు రిటైరయ్యాక మీ జీవితం ప్రశాంతంగా, ఆర్థిక పరమైన ఇబ్బందులు లేకుండా వుండటానికి అవసరమయ్యే ముందు చూపే 'రిటైర్‌మెంట్ ప్రణాళిక' మిమ్మల్ని ఒకటో రెండో లక్షలకు అధిపతిని చేయటానికి 'లక్షాధికారి పదకము' వుంది నెలనెలా వడ్డీ లభించాలంటే 'ఫిక్సెడ్ టైమ్ డిపాజిట్' పథకముంది

**అన్ని పథకాల పూర్తి వివరాలు తెలిపే ఉచిత పుస్తకం కోసం వ్రాయండి.**

Raj Yuvraj
INVESTMENTS & FINANCE

**నేడు ఆదా చేయండి.**
**అదే రేపు మిమ్మల్ని ఆదుకుంటుంది.**

రిజిస్టర్డ్ ఆఫీస్ రాజ్ యువరాజ్ థియేటర్స్
పోస్టు బాక్స్ నెం 507 గాంధీనగర్,
విజయవాడ - 520 003
గ్రామ్స్ RAJYUVRAJ ఫోన్ 76146

బ్రాంచ్ ఆఫీస్ -
123 హుస్సేనా మంజిల్,
అంగప్ప నాయికన్ స్ట్రీట్,
మద్రాస్ - 600 001 ఫోన్ 28265

జొన్నలగడ్డ లలితాదేవి

సీరియల్



# మారేడు దళం

## 3

**( గత సంచిక తరువాయి )**

బద్ధకంగా లేచాడు అమలేశ్వర్ !

''బావా !'' అంటూ మృదువుగా పిలిచింది సమత.

మెల్లగా కళ్ళు తెరిచి చూశాడు. ఎదురుగా చిరునవ్వు ముఖంతో నిలబడి వుంది తన మరదలు.

''టైము ఎంత అయిందో చూశావా ?'' అంది గడియారం చూపిస్తూ.

''ఎంత ! ఏడున్నరేగదా !'' అంటూ బద్ధకంగా ఆవులించాడు.

''ఏడున్నర ! ఇంకా చాలదా నీకు— కాఫీ టిఫిన్లు అన్నీ కానిచ్చుకుని మా నాన్నగారు వెళ్ళిపోయారు కూడా'' అంది సుమత.

ఆ మాటతో దిగ్గున లేచాడు !

అతను లేచి బయటకు రావడం చూసి పేస్టు—బ్రష్, చెంబుతో నీళ్ళు పెట్టి వచ్చింది జామచెట్టు దగ్గర.

ఆ జామచెట్టు క్రింద చిన్న రాతి చప్టా వుంది, దానిమీద కూర్చుని దంతధావనాది కార్యక్రమాలు కానిచ్చుకోవడం అతనికి అలవాటు.

ఆ అలవాటు సంగతి బాగా తెలిసిన సమత అన్నీ అక్కడే పెట్టి వస్తుంది. గబగబా ముఖం కడిగి లోపలకు వచ్చేసరికి కాఫీ కప్పుతో రెడీగా వుంది సమత.

''థాంక్స్ మరదలుపిల్లా'' అంటూ అందుకున్నాడా కాఫీ కప్పుని.

అతను కాఫీ త్రాగుతున్నా మనసు మరదలు చుట్టూ కాక స్వప్న చుట్టూ తిరుగుతూ వుంటుంది.

అది సమతకీ తెలుసు.

''పోనీలే ! బావ సుఖంగా వుంటే చాలు. పాపం తల్లీదండ్రి లేనివాడు'' అని అమాయకంగా అనుకోవడం తప్ప ఏనాడూ అతను స్వప్నను ప్రేమిస్తున్నందుకు ఈర్ష్యపడలేదు.

''స్నానం చేస్తావా ?''

''మళ్ళీ వచ్చి చేస్తాను'' అంటూ బట్టలు వేసుకుని బయలుదేరుతుంటే నిశ్శబ్దంగా చూస్తూండిపోయింది.

''ఎక్కడికి బావా !'' అని అడుగుదామని నోటిదాకా వచ్చినా అడగలేకపోయింది.

అతను వెళ్ళిపోయాడు.

అమలేశ్వర్ బయటపడిన కారణం వేరు. స్వప్న మార్నింగ్ షోకు వెడతానని చెప్పింది.

ఆ హాలు దగ్గర కనిపెట్టుకునివుంటే ఆమె దర్శనభాగ్యం కలుగుతుంది.

అసలే శలవలు ! కాలేజీకి రాదు. ఏదో ఇలా లక్కీగా చూడటం తప్ప ఆ యింటికి తను వెళ్ళలేడు.

సందుమలుపు తిరిగేసరికి హరి ఎదురు పడ్డాడు.

అతన్ని చూడగానే గతుక్కుమంది అమలేశ్వర్ గుండె.

హరితో మాటలంటే బోరు. ఏ వేళ్టికి అవవు. చెప్పిందే చెప్పి విసుగు పుట్టిస్తాడు.

అంచేత అతన్ని వదులుకోవాలని అతని తాపత్రయం. కాని హరి అమలేశ్వర్‌ని చూడనే చూశాడు.

''అమల్ !'' అంటూ పిలిచాడు.

''ఇంకేముంది ! తగిలింది జిడ్డు'' అనుకున్నాడు అమలేశ్వర్ విసుగ్గా.

''ఏమిట్రా అర్జంటు పనిమీద వెడుతున్నాను. మళ్ళీ కలుస్తాలే !'' అన్నాడు నడక ఆపకుండానే అమలేశ్వర్.

కాని హరి అతన్ని పోనివ్వనన్నట్లు చేయి అడ్డం పెట్టాడు.

''నువ్వు ఏ పనిమీద వెడుతున్నావోగాని ఒక్క సహాయం చేయి'' అన్నాడు దీనంగా.

> **జరిగిన కథ — 1 :** నవలా రచయిత నవీన్‌ను అభిమానిస్తుంటుంది సింహళాదేవి స్వప్నతో హోటల్ కెళ్లిన అమలేశ్వర్ వినోద్‌బాబు రాకతో బిల్లు బాధనుంచి బయటపడతాడు. సింహళ మనస్సు నవీన్ చుట్టూ, నవీన్ ఆలోచనలు సింహళ చుట్టూ పరిభ్రమిస్తూ ఉంటాయి. నవీన్ సింహళని మద్రాసుకు ఆహ్వానిస్తాడు.

''సరిపోయింది ! తనకే తిండికి రికానా లేదు. అలాంటిది మిత్రునికేం సహాయం చేయగలదు.''

మాట సహాయం అయితే అదీ ఉచిత సలహాల్లాంటివయితే బాణాల్లా గుప్పించగలడు.

''ఏం సహాయమోయ్!'' అన్నాడు రాని నవ్వు నవ్వబోయి.

''ఏం సహాయమా ! ధన సహాయం.''

''సరిపోయింది ! రోలు వచ్చి మద్దెలతో మొరపెట్టుకుందట. నాకే దమ్మిడీ సంపాదన లేక ఆ పంచన— ఈ పంచన పడి వున్నవాడిని, నేను నీకేం సహాయం చేయగలను ?'' అని అడిగాడు అమలేశ్వర్.

''చూడు అమల్ ! మా అమ్మ ఉదయం చనిపోయింది. ఆవిడ శవాన్ని బయట పెట్టి తిరుగుతున్నాను. దయచేసి నా పరిస్థితి అర్థం చేసుకుంటావనుకుంటాను.'' అన్నాడు కన్నీళ్ళు తుడుచుకుంటూ హరి.

ఆ మాట విని షాక్ తిన్నట్టు ఫీలయ్యాడు అమలేశ్వర్ అంతవరకూ హరి అంటే వున్న చులకన భావం మటుమాయమై ఆ స్థానే జాలి చోటు చేసుకుంది. ''నా దగ్గర ఈ క్షణంలో జేబులో ఏం లేవురా ! మా మామయ్యగారింటికి వెళదాం. ముందు అక్కడినుంచే ప్రారంభిద్దాం విరాళం'' అంటూ వెనక్కి తిరిగాడు మిత్రునితో.

వెళ్ళిన బావ వెంటనే తిరిగి రావడం దొడ్లో నీళ్ళు పడుతున్న సమత చూడనే చూసింది.

అతని వెనక హరి రావడం కూడా గమనించింది.

హరి ఆమెకీ తెలుసు. చెల్లీ చెల్లీ అంటూ కూడా తిరిగేవాడు.

''ఏమిటన్నయ్యా అలా వున్నావు ?'' అంటూ లోపల్నించి పలకరిస్తూ వచ్చింది సమత.

''చెల్లాయి అమ్మ వెళ్లిపోయింది, నన్ను ఒంటరివాడినిచేసి'' అన్నాడు గాద్గదికంగా.

ఆ మాట వినేసరికి సున్నిత మనస్కురాలైన సమత కళ్లంబడి గిర్రున నీళ్లు తిరిగాయి.

''సమతా! పాపం వాళ్ల అమ్మ శవాన్నలా వుంచి డబ్బుకోసం తిరుగుతున్నాడు పీనుగని లేపాలిగదా'' అంటూంటే సంగతంతా అర్థమయింది సమతకి.

పేదవారి జీవితంలో అన్నీ సమస్యలే. పుట్టినా సమస్యే— బతికినన్నాళ్ళూ సమస్యలే, చివరకు చచ్చినా సమస్యే !

గబగబా వెళ్లి తల్లితో చెప్పింది.

ప్రసన్నలక్ష్మి దగ్గరమటుకూ ఆ సమయంలో ఏముంటాయి ?

''మీ నాన్న వుండగా వచ్చాడు కాదు. ఏదో కాస్త పెద్ద మొత్తం ఇచ్చేవారు. నా దగ్గర ఓ పదిరూపాయలున్నాయి. నీ దగ్గర ఏమన్నా వున్నాయా ?'' అని అడిగింది ప్రసన్నలక్ష్మి.

తన దగ్గర వున్న డబ్బంతా లెక్క చూపింది. పదిరూపాయలున్నాయి.

ఆ పదీ – ఈ పదీ కలిపి అతనికిచ్చింది.

"ఈ ఇరవైతో ఏమవుతుంది సమతా ! నీ ఫ్రెండ్సు ఎవరిచేతనైనా ఇప్పించగలవా ?" అని అడిగాడు అమల్.

"పదండి కాస్త ఇవ్వగలిగేది సింహళ మటుకే ! ఆ పిల్లని అడుగుదాం" అంది సమత.

ఆమెకేసి కృతజ్ఞతగా చూశాడు హరి.

కష్టజీవులకే కష్టాలు అర్థం అవుతాయి. బాధపడేవారికే బాధలంటే తెలుస్తాయి. మిగిలిన వారికి హాస్యాస్పదంగానే వుంటాయి,

గబగబా చీర మార్చుకుని బయలుదేరింది.

అతను మా బావ. అతను మా బావ ఫ్రెండు హరి. నీకు తెలిసేవుండవచ్చు. హరి వాళ్ళ అమ్మ పాపం ఉదయం చనిపోయిందట.

వీధిలో శవాన్నుంచి డబ్బు కోసం ముష్టెత్తుకోవలసిన అవసరం ఏర్పడింది.

నేను ఒక ఇరవై రూపాయలుంటే ఇచ్చాను. నీకేమన్నా అవకాశం వుంటే కాస్త సహాయం చేస్తావని తీసుకువచ్చాను."

సింహళ మనసు కరిగిపోయింది.

"వుండండి" అంటూ గబగబా తల్లి దగ్గరకు వచ్చింది. "అమ్మా ! నీ దగ్గర ఓ యాభై వుంటే ఇవ్వమ్మా !" అని అడిగింది,

సింహళ నవ్వి "నేను ఈ రోజు రాత్రికి సర్కార్ ఎక్స్‌ప్రెస్‌లో మద్రాసు వెడుతున్నాను. మళ్ళీ అవసరం వచ్చినా కనిపించను" అంటూ తల్లికి తెలియకుండా మరో ఇరవై రూపాయలు ఇచ్చింది తన బ్యాగ్‌లోంచి తీసి.

అవి అందుకుని బయటకు వచ్చేశారు.

"నీ బోణీ మంచిది చెల్లాయి. మొత్తం తొంభై రూపాయలు అందాయి" అన్నాడు హరి.

"వుండు" అంది ఆగి. "స్వప్న ఇంటికి కూడా తీసుకు వెడతావా ?" అని అడిగాడు అమలేశ్వర్!

బావకి స్వప్న పిచ్చి చాలానే వుందని తెలిసిన సమత 'పద' అంది.



సమత, అమలేశ్వర్, హరి అంతా ఒకసారే గేటు తీసుకువస్తుంటే తెల్లబోయింది సింహళ.

"ఏమిటే సమతా ! పొద్దున్నే బయలుదేరావు ?" అని అడిగింది.

ఆ మాటకి నవ్వింది సమత.

"పొద్దున వచ్చినా అదే మాట. మధ్యాహ్నం వచ్చినా అదే మాట. సాయంత్రం వచ్చినా అదే మాట – మొత్తానికి నీలో ఏదో మార్పు వచ్చింది" అంది సమత.

ఆ మాటకి ఉలిక్కిపడి సర్దుకుంది సింహళ.

అది గమనించినా గమనించనట్లే "చూడు, సింహళా నిన్ను ఎటూకాని సమయాల్లో వచ్చి డిస్టర్బ్ చేయడం నాకు యిష్టంలేదు. కాని తప్పనిసరి పరిస్థితిలో నీ యింటికి రావలసి వచ్చింది ఏం అనుకోకు.

"యాభై దేనికి ?" అని అడిగింది ఆశ్చర్యంగా.

వెంటనే హరిని చూపించి విషయం చెప్పింది.

సరళ బీరువాలోంచి యాభై తీసి అందించింది.

గబగబా హరి చేతిలో వుంచింది.

సరళ మూడు కప్పుల్లో కాఫీ పోసి నౌకరు చేత పంపింది.

"తీసుకోండి" అంది సింహళ అందరికీ అందించి.

పాపం తల్లిపోయిన క్షణం నుంచీ పచ్చి మంచినీళ్ళు కూడా తాగని హరి గబగబా ఆ కాఫీ తాగేశాడు. "వస్తాను సింహళా ! నీ మేలు మరువలేము" అంది సుమత.

ముగ్గురూ స్వప్న ఇంటికి చేరుకునేసరికి కారు రెడీగా వుంది.

కారులో వినోద్‌బాబున్నాడు.

స్వప్న అందంగా ముస్తాబయి బయటకి రాబోతూ సమతని చూసి కాస్త వెనకడుగు వేసింది.

"స్వప్నా ! ఎక్కడికైనా వెడుతున్నావా?"

అని అడిగింది.

"మరే ! మార్నింగ్ షోకి వెడదామని."

సినిమాకి ప్రయాణం అయిన ఆమెకి ఈ చావు కబురు చెప్పడమా ? మానడమాని సందేహించింది సమత.

"ఏమిటి ఏదో పనిమీద వచ్చినట్టున్నావు?" అంటూ కారు దిగి అడిగాడు వినోద్.

సమత అందుకుని "ఇతను మా బావ ఫ్రెండు. అతని మదర్ చనిపోయింది. పాపం అతను పేదవాడు — ఏదన్నా ధన సహాయం చేస్తుందేమో స్వప్న అని అడగడానికి వచ్చాను" అంది.

స్వప్న ముఖం చిట్లించుకుంది.

"శుభమాంటు కొత్త సినిమాకి పోతుంటే చావు కబురు వేసుకొచ్చింది సమత." అనుకుని విసుగ్గా చూసింది. ఆ చూపుల్లోని భావాన్ని స్పష్టంగా పసిగట్టాడు అమలేశ్వర్.

వినోద్ జేబులో చెయ్యిపెట్టి ఇరవై రూపాయల కాగితం తీసి ఆమె కందివ్వబోయాడు.

"తీసుకో అన్నయ్యా" అంది సమత.

హరి అందుకొన్నాడు.

స్వప్న కారులో కూర్చోవడం కారు ముందుకు దూసుకుపోవడం ఒక్కసారే జరిగిపోయాయి.

"నాకు ముఖ్యులైన వారిని చూపించాను. ఇకపై నీ తిప్పలు నువ్వు పడాల్సిందే" అంది సమత.

"నిజంగా నువ్వు ఆదుకోకపోతే ఈ డబ్బయినా కళ్ళబడేదికాదు" అన్నాడు కృతజ్ఞతగా.

# మారేడు దళం

సమత ఆ మాట విననట్లే "వస్తాను — మిత్రులిద్దరూ ఏదో తంటాలు పడండి — నేను ఇంటికి వెడుతున్నాను. అయినా క్షున్నంగా పోనీయి అన్నయ్యా!" అంది సలహాగా.

అలాగేనన్నట్టు తల పంకించాడు.

సమత తన ఇంటికి — అమలేశ్వర్ — హరి అటు దహనక్రియల కోసం ఆ పన్నమీద వెళ్ళిపోయారు.

## 4

సర్కార్ ఎక్స్‌ప్రెస్‌లో రాబోయే సింహళ సుందరి కోసం కళ్ళు కాయలు కాసేలా ఎదురు చూస్తున్నాడు నవీన్.

అంతకంటే తపనగా వుంది సింహళకి. రైలుకంటే స్పీడుగా పరుగెత్తుతోంది ఆమె హృదయం.

ఎప్పుడెప్పుడు వెళ్ళి అతని ఎదుట వాలిపోదామాని చూస్తోంది. ఇదే ఏ విమానమో అయితే ఈపాటికి మేఘాల్లో తేలిపోతూ వెళ్ళిపోయి వుండేది.

అసలు తను మద్రాసు ఒంటరిగా బయలుదేరడానికి చాలా అవస్థపడవలసి వచ్చింది.

స్వప్న వెడుతోందని, అక్కడ ఆమె అక్కయ్య పెళ్ళి అని, ఆమెని పిలిపించి చెప్పించింది. చివరకు, తల్లిని, తండ్రిని ఒప్పించింది. డబ్బు తీసుకుని బయలుదేరింది.

తను వస్తున్నట్టు వైరు ఇచ్చింది అతనికి. అతను స్టేషనుకు రావచ్చు. తన ఫొటో అతని దగ్గర వుందిగా.

అతని ఫొటో తను చాలా పత్రికల్లో చూసింది ఆ చూసింది చూసినట్టే మనసులో ప్రింటు అయిపోయింది. అంచేత అతన్ని గుర్తించడం చాలా సులభం అనే అనుకుంది సింహళ.

రైలు మద్రాసు చేరేవరకూ ఆమె కళ్ళ ముందు సినిమా రీళ్ళు తిరుగుతున్నాయి. అక్కడికి చేరగానే అతనితో గడపబోయే మధుర క్షణాలను తలచుకుంటూంటేనే ఆమెకి గొప్ప థ్రిల్‌గా వుంది

ఎక్స్‌ప్రెస్‌లో వచ్చే తన ప్రియ పతిత కోసం వళ్ళంతా కళ్ళు చేసుకుని నిరీక్షిస్తున్నాడు నవీన్.

(ఇంకా వుంది)

# విడవకుండా వచ్చే దగ్గుకు ఉపశాంతి ఇస్తుంది



## విక్స్ ఫార్ములా 44 కాఫ్ డిస్క్

### ప్రత్యేక పదార్థం సైలెంటియం కలిగిన ఏకైక కాఫ్ లాజెంజ్

సైలెంటియం విడవకుండా వచ్చే దగ్గుకు శీఘ్ర ఉపశమనం ఇస్తుంది. దీనితోపాటు ఫార్ములా 44 కాఫ్ డిస్క్—

- దగ్గు క్రిములను నాశనం చేస్తుంది.
- గొంతు నొప్పినుండి ఉపశమనం ఇస్తుంది.
- శ్వాస తీసుకోవడాన్ని సులభం చేస్తుంది.






## మందులాంటి రుచి మందులాంటి పని

CASRH-19-244 TEL

# ఆరాచకం!

తూర్పు గోదావరి జిల్లా ముమ్మిడివరం తాలూకా తానేలంక గ్రామంలోని హరిజనుల కిచ్చిన భూములమీద అగ్రవర్ణాలవారు విరుచుకు పడితే వారంతా హైకోర్టు నుంచి స్టే తెచ్చుకున్నారట. దాంతో ఆ అగ్రవర్ణాలవారికి మరింత కోపం వచ్చి రెవెన్యూ డిపార్ట్మెంటుతో కుమ్మక్కయి, ఆ భూములు హరిజనులకిచ్చే ముందే వేరేవారికివ్వబడినట్టు రాయించేశారట. రెవెన్యూ అధికారులు, పోలీసులూ కలసి అక్టోబరు 23న ఆ వూరెళ్ళి భీకరంగా దౌర్జన్యాలు జరిపారట. అందులో పోలీసులు పాతకాలపు రాజరికపు సినిమాలలో దుష్టసేనాని, అతని సేనలులా చేతికందిన ఆడవారిని అవమాన పరచి, స్త్రీ పురుష, వయోభేదం లేకుండా అందర్నీ హింసించారట. వయస్సులో వున్న ఆడవారి స్తనములమీద, తొడలమీదా గాయ పరచారట కాకినాడ కాలేజిలో రెండో ఏడు ఇంటరు చదువుతున్న సుందరలక్ష్మి అనే ఆమె నామె ఇంట్లోంచి బయటకులాగి అసభ్య భాషణలాడరట. ఈ దెబ్బలు ఎక్కువవడం వల్ల మానేపల్లి మహాలక్ష్మి అనే ఆమె రాజమండ్రి ఆసుపత్రిలో చికిత్స పొందు తూన్నదట. ఈ ప్రదేశానికి నేరుగా వెళ్ళిన షెడ్యూల్డు కులాల సంక్షేమ సంఘ ప్రధాన కార్యదర్శి శ్రీ నాగయ్య వివరంగా యీ సంఘటనను ప్రభుత్వానికి వివరించారట!

## బ్యాంకి ఉద్యోగిపై దాడి!

ఢిల్లీ కన్నాట్ ప్లేస్‌కు చెందిన వో బ్యాంకు మెస్సెంజరు చెక్కులను, డ్రాఫ్టులను వో పెట్టెలో పెట్టుకుని, క్లియరెన్స్ హవుసుకు వెళ్తూంటే వో ముగ్గురు వ్యక్తులు అతడు డబ్బు తీసుకెళ్తున్నాడని అపోహపడి, అతన్ని వెంటాడి, కాల్పులు జరిపి, ఆ పెట్టె లాక్కు పోయారట. ఆ బ్యాంకు వుద్యోగి వకీల్‌సింగ్ ప్రమాద స్థితిలో ఆసుపత్రిలో వున్నాడట. ఈ కాల్పులు చూసి రంగంలోకి దూకిన రామ్‌జీలాల్ అనే పోలీసుక్కూడా కాల్పులు దక్కి అతనూ ఆసుపత్రిపాలయ్యాడట ఆ ముగ్గురిలో ఒకతను చిక్కాడట.




# పొలిటికల్ పేరి

## దిగంబర క్షుద్రదేవత!?

ఒరిస్సాకు చెందిన మయూర్‌భంజ్ జిల్లాకు చెందిన గోబంజోదే అనే వూరిలో "శాలూర్ మాజి" అనే వో వ్యవసాయి చనిపోయాక, అతని భార్య "మంక" పిచ్చిపట్టినదానిలా అడవులలో తిరిగేదట. శాలూర్ మాజి తమ్ముడు కునార్ మాజికి వున్నట్టుండి అనారోగ్యం వచ్చి, ఆనక తగ్గి, అతని భార్యకు వచ్చి ఆమె చనిపోయిందట. ఆ తరువాత అతని కూతురుకు, మనుమరాలికి కూడా అనారోగ్యం ఆరంభించిందట. ఒక రోజు రాత్రి అన్నగారి భార్య మాజి అతని యింటి వెనక దిగంబరంగా తిరుగుతూ కనుపించిందట. తన యింటి పరిస్థితికి యీమె కారణమేమోనని ఆ కునార్ మాజి అనుమానించి, ఓ క్షుద్రదేవతో పాసకునితో సంప్రదించి, ఆ మంక పీక తెగనరికి పారేసి, అంతతో వూర్కోక ఆ తలను పట్టుకుని, పోలీస్టేషనుకు వెళ్ళి అక్కడి ఇనస్పెక్టరుకు అది బహూకరించి, తాను లొంగిపోయాడట. క్షుద్రదేవతను చంపేశాను, నేను జైల్లోవున్నా, నా పిల్లలు, మనుమరాళ్ళూ హాయిగా వుంటారు నాకదే తృప్తి అన్నాడటా ముసలి కునార్ మాజి.

## సేలం స్టేషన్‌లో ముఖ్యమంత్రి!

తమిళనాడు ముఖ్యమంత్రి యం.జి.ఆర్.కు డాక్టర్ గౌరవడిగ్రీ వచ్చిన సుసందర్భంగా ఆయనను అభినందించ సేలం వచ్చిన ఆంధ్ర ముఖ్యమంత్రి యన్. టి. ఆర్. ఆ పని చేసి, సేలం నుంచి మద్రాసు వెళ్ళడానికి సేలం స్టేషనుకు 12వ తేదీ రాత్రి 12 గంటలకు వచ్చి, రైలు కోసం తెల్లారి నాలుగ్గంటలు దాకా వేచి కూర్చున్నారట. ఆయనను పంపడంలో తమిళనాడు ఏ ఏర్పాటూ చేయనందువల్ల, పోలీసు వ్యక్తులతో ఆయన సేలం స్టేషనులో వంటరిగా నిరీక్షణ చేశారుట —

## నిరపరాధి విజయం!

1937వ సంవత్సరంలో ఇనడోర్ జిమ్మర్‌మన్ అనే వో యువకుణ్ణి వో న్యాయ స్థానం విచారించి అతను హత్య చేసినట్టు సాక్ష్యాధారాలతో నిరూపిస్తూ అతనికి మరణ శిక్ష విధించి, శిక్ష ఇంకా రెండు గంటలలో అమలు పరుస్తారనగా ఆ శిక్షను యావజ్జీవ శిక్షగా మార్చిందట. అతను 24 సంవత్సరాలు శిక్ష అనుభవించాక, నువ్వు నిరపరాధివి అందుకని నిన్ను విడుదల చేస్తున్నామని కోర్టు అతన్ని విడుదల చేసిందట. బయటికి వచ్చి ఝుయ్యిమని ఆ జిమ్మర్‌సన్ నష్ట పరిహారపు దావావేసి, ప్రభుత్వంమీద గెలిచి ఒక పది లక్షల డాలర్లు నష్ట పరిహారంగా పొందాడట!

## తాకట్టుకు పసిపిల్లలు!

భారతదేశం నేషనల్ లేబర్ ఇనిస్టిట్యూట్ మరియు నేషనల్ యూనియన్ ఆఫ్ వర్కింగ్ వుమన్ [స్వదేశీ చాకిరీ అండ్ పనిచేయు స్త్రీ పడుపాట్లు తెలుసుకునే శాఖ అనొచ్చు.] విభాగం వారు చేసిన పరిశోధనలలో ఆడవారు, పిల్లలూ రోజుకు పది నుంచి పన్నెండు గంటలు పని చేస్తున్నట్టు తేలిందట. తమిళనాడుకు చెందిన వెల్లూరు బీడీ ఫ్యాక్టరీలోని స్త్రీలూ, పిల్లలూ నడుం విరిగేలా రోజుకు పన్నెండు గంటలకు మించికూడా పని చేస్తున్నారట. వో బీడీ ఫ్యాక్టరీ అధిపతి తానొక స్త్రీకిచ్చిన 200 రూపాయల అప్పుకు ఆమె ఏడేళ్ళ కూతురును, ఎనిమిదేళ్ళ కొడుకును మూడేళ్ళు తాకట్టు పెట్టుకున్నాడట.






యూరప్ దేశాలు పర్యటించి వచ్చిన ప్రముఖ గైనకాలజిస్ట్ శ్రీమతి ఉషాచతుర్వేది తన డైరీలోని ఒక పేజీలో ఇలా రాసుకుంది.

ది. 21–10–1964. న్యూఢిల్లీ.

విదేశాల్లో స్త్రీ గర్భవతిగా వుండగానే పుట్టబోయే బిడ్డ ఆడో, మగో తెల్సుకోగల ఒక నూతన ప్రక్రియను చూసి ఆశ్చర్యపోయాను. ఇది నిజంగా సైన్సు సాధించిన ఘన విజయాల్లో ఒకటి విజ్ఞాన వీధిలో ఇది ఒక గొప్ప మలుపు. ఇలా తెలుసుకోవడం వల్ల చాలా ఉపయోగాలు వున్నాయి. పుట్టబోయే బిడ్డకు ఏమైనా ఘోరమైన రోగం వుంటే ఆ పుట్టుకను అరికట్టవచ్చు. పైగా ఎప్పుడో తెలియబోయిన విషయం ముందే తెలుసుకోవడం గొప్ప థ్రిల్. ఆ విధానం గురించి నేను మిసెస్ బ్రౌన్ ద్వారా వివరాలు సేకరించాను

ఈ పద్ధతిని ''యామినో సెంటిసిస్'' అంటారు. మాతృగర్భంలో పిండాన్ని ఆవరించి పరిరక్షించే పొర తాలూకా ద్రవం సేకరించి దాన్ని పరీక్ష చేసి ఫలితం చెప్తారు. ఈ పొర అవసరమైనంత మేరకు గర్భస్థ శిశువుకు రక్షణ కల్గిస్తూ వుంటుంది పిండం తాలూకా మూత్రం వగైరాలు ఈ దశలో ఈ ద్రవంలోనే కలుస్తూ వుంటాయి. ఈ కణాలను పరీక్ష చేస్తే చాలు. పిండం ఆడో, మగో చెప్పగలుగుతాం. ఒక సన్నని పదునైన సిరంజి సూదిని తల్లి కడుపులోకి గుచ్చుతారు. ఈ ద్రవాన్ని సేకరిస్తారు. ఈ విషయంలో ఒక జాగ్రత్త మాత్రం తీసుకుని తీరాలి ఈ సూది పిండాన్ని రక్షించే పొరను ఛేదించకుండా చూడాలి. లేకపోతే గర్భస్రావం జరిగి మొదటికే మోసం రావచ్చు. ఇలా సేకరించిన కణాలలోని జీన్సును గుర్తించి లెక్కపెట్టాలి. ఇది కూడా కొంచెం కష్టంతో కూడుకున్నది. ఎంతో అనుభవం వుంటే తప్ప సాధ్యం కాదు మనిషికి వుండే 46 క్రోమోజోములలో లింగ నిర్ణయం చేసేవి కేవలం రెండు. ఒక క్రోమోజోమ్‌లో 'వై' వుండి, ఒక క్రోమోజోములో 'ఎక్స్' వుంటే ఆ బిడ్డ మగబిడ్డ అని అర్థం. అలాకాక రెండు క్రోమోజోములలోనూ 'ఎక్స్', 'ఎక్స్' వుంటే ఆ బిడ్డ ఆడబిడ్డ అని అర్థం. ఈ ''యామినో సెంటిసిస్'' ప్రక్రియలో చెయ్యవల్సింది ఇదే. నిపుణత వుంటే ఇందులో పొరపాటు పడవల్సింది ఏమీ లేదు.

ఈ పరీక్ష ఎప్పుడు పడితే అప్పుడు చెయ్యడం కాదు. గర్భధారణ జరిగిన 14 వ వారంలోనే ఈ పరీక్ష చెయ్యాలి.

విజ్ఞానశాస్త్రం ప్రసాదించిన ఈ వరాన్ని భారతదేశంలో కూడా ప్రవేశపెడితే ఎలా వుంటుంది? ఈ పని నేనే ఎందుకు చెయ్యకూడదు?

చేస్తాను .. ఈ ప్రక్రియను భారతదేశంలో నేను ప్రవేశపెడతాను

* * *

డాక్టర్ శ్రీమతి ప్రీతి కులకర్ణి డైరీలో ఒక పేజీ ఇది –

ది. 3–5–1976, బొంబాయి.

శ్రీమతి ఉషా చతుర్వేది ఇండియాలో ప్రవేశపెట్టిన ''యామినోసెంటిసిస్'' ప్రక్రియ నేనుకూడా చేపట్టి నాల్గు సంవత్సరాలు పూర్తి అయ్యాయి. ఇంతవరకూ నేను పరీక్షించిన కేసులు నూటికి నూరు శాతం నిజం అయ్యాయి. కానీ. . నా సోదరి విషయంలో మాత్రం నేను కావాలని అబద్ధం చెప్పాను దానికి ఇప్పటికే నలుగురు కూతుళ్లు. ఇప్పుడు కడుపుతో వుండగా నా దగ్గరకు పరీక్ష చేయించుకుందుకు వచ్చింది.

''చెల్లీ!... నువ్వు పుట్టబోయే బిడ్డ ఆడో, మగో పరీక్షచేసి చెప్తున్నావట కదా! నాక్కూడా చెప్పు, పరీక్షచేసి '' అంది.

''ఎందుకు ?'' అడిగాను నవ్వుతూనే.

''ఏముంది ? ఆ బిడ్డ ఆడపిల్ల అని నుక తెలిస్తే, అబార్షన్ చేయించుకుంటాను..'' శ్చర్యపోయాను. దాని మనసులో ఈ ఆలోచన ఫుందని నేను ఎన్నడూ అనుకోలేదు.

''వద్దు...'' అన్నాను.

''నా బాధ నీకు తెలియదు చెల్లీ... ఈసారయినా కొడుకు పుట్టాలని ఎంతగానో శిస్తున్నాను. అది నిరాశయితే నా గుండెలు ఎద్దలవుతాయి. కూతురే అయితే దాన్ని ఈ భూమిమీదకు రానిచ్చి నేను బాధపడుతూ కూర్చోవడంకంటె కడుపులోనే దాన్ని అంతం చేస్తాను. అందుకే పరీక్షచేసి చెప్పు...'' అంది.

పరీక్ష చెయ్యనని అనలేను. ఎందుకంటే అది నా రక్తం పంచుకు పుట్టిన అక్క. పరీక్ష చేశాకా ఆడపిల్ల అని తెలిస్తే అబార్షన్ చెయ్యమంటుంది. అదికూడా నావల్లకాదు.

ఎలా ?...

భగవంతునిమీద భారం వేసి పరీక్ష చేశాను. ఫలితం కోసం లెక్క పెడుతుండగా నాలో సన్నని వణుకు. ఆ బిడ్డ మగబిడ్డ కావాలని ప్రార్థించాను. కానీ... కానీ... ఫలితం తెలిశాకా నిరాశ చెందాను. ఆమెకు పుట్టబోయేది ఆడపిల్ల. నా లెక్క తప్పుకావడానికి ఎంత మాత్రం అవకాశం లేదు. అయినా ఎందుకో అది తప్పు అయితే బాగుండునని అన్పించింది.

ఈ విషయం అక్కకు ఎలా చెప్పను ? చెప్పిన తర్వాత అబార్షన్ చెయ్యమంటే ఆమెకు ఎలా నచ్చచెప్పను ? పిల్లలు వద్దనుకుంటే ముందు నుంచీ జాగ్రత్తపడాలి కానీ ఇలా గర్భస్రావం వల్ల కాదు. అందుకే అక్కతో అబద్ధం చెప్పాను. పుట్టబోయేది మగపిల్లవాడని అన్నాను. ఆమె సంతోషం చెప్పనలవి కాదు. నా బుగ్గలపై ముద్దు పెట్టుకుంది. చిన్నపిల్లలా కేరింతలు కొట్టింది. ఆడపిల్ల అంటే ఆడదానికే ఇష్టం లేదన్నమాట... ఎందుకని ?... ఆడపిల్లకీ, మగ

# కూతురు పుట్టాల

పిల్లవాడికీ సమానమైన విలువ ఇచ్చే రోజు వస్తుందా ?... ఎప్పుడు ?

పురుడు వచ్చాకా నేను చెప్పింది అబద్ధం అని తెలిసిపోతుంది. అప్పుడు అక్కయ్య ముఖం ఎలా వుంటుంది ? ఆమె ఉత్సాహం ఏమవుతుంది? అబద్ధం చెప్పినందుకు నన్ను అసహ్యించుకుంటుందా ?

ఆలోచనలతో నా బుర్రంతా వేడెక్కిపోతోంది. అక్కయ్య నన్ను అసహ్యించుకున్నా ఫరవాలేదు గానీ ఏర్పడిన పిండం పూర్తిగా రూపురేఖలు దిద్దుకుని భూమిమీద జన్మిస్తే-- ఆ తర్వాత ఆ అమ్మాయి నాకు కృతజ్ఞతలు చెప్పుకుంటుంది.

విజ్ఞానశాస్త్రం ప్రసాదించిన ఈ ''యామ్నియోసెంటిసిస్'' వరం ఒక శాపంగా మారకూడదు.

ప్రభూ !... రక్షించు... నన్ను... నా దేశాన్నీ... నా ప్రజలనీ...

*   *   *

హైదరాబాదులో ఇంచుమించు అన్నిచోట్లా గోడల మీద కొన్ని పోస్టర్లు అంటించారు. అందులో ఇలా రాసి వుంది.

''అవకాశము పోగొట్టుకొనవద్దు.

ది. 10.11.82 నుంచి ది. 5 12.82 వరకు డాక్టర్ శ్రీ అగర్వాల్ మరియు డాక్టర్ శ్రీమతి అగర్వాల్‌ల ఆంధ్రా పర్యటన.

మీకు పుట్టబోయే బిడ్డ ఆడో, మగో తేల్చుకోండి.

ఫీజు కేవలం రు. 500 నుంచి 1000లు మాత్రమే.

ఈ క్రింద ఇచ్చిన తేదీలలో, ఆయా చోట్ల వచ్చి కలియండి.

వీరి కేసులు నూటికి నూరు శాతం సఫలం అయ్యాయి.''

ఆంధ్రప్రదేశ్ మిమిక్రీ ఆర్ట్స్ డెవలప్‌మెంట్ కమిటీ ఆధ్వర్యంలో ఇటీవల గుంటూరులో జరిగిన మిమిక్రీ పోటీల సందర్భంగా ముఖ్య అతిథి శ్రీ రతన్‌బాబుగారిని కమిటీ కార్యదర్శి శ్రీ ఎం. ఆర్. ప్రసాద్ సన్మానిస్తున్న దృశ్యం.



ఆ తర్వాత తేదీలు, ఊర్లు, బస చేసే హోటల్ వివరాలు ఒక పట్టీలో వున్నాయి. హైదరాబాద్, వరంగల్, ఖమ్మం, విజయవాడ, గుంటూరు, ఒంగోలు, నెల్లూరు, తిరుపతి, ఏలూరు, రాజమండ్రి, కాకినాడ, తుని, విశాఖపట్నం, విజయనగరం, కడప, కర్నూలు మొదలైన అన్ని ఊర్లూ దర్శిస్తున్నారట ఆయన—చివర్లో మళ్ళీ ఇలా రాసివుంది.

''సమయము ఆదా చేయుటకు వీరు సొంత కారులో ప్రయాణము చేయుదురు.''

ఆ పోస్టర్‌లో రెండు ఫొటోలు కూడా వున్నాయి. ఒకటి శ్రీ అగర్వాల్‌గారిది. మరొకటి శ్రీమతి అగర్వాల్‌గారిది.

*   *   *

శ్రీమతి మరియు శ్రీ అగర్వాల్ బస చేసిన హోటల్ తాలూకు ప్రొప్రయిటర్ తన స్నేహితుడికి ఒక ఉత్తరం రాశాడు. అందులో ఇలా వుంది.

''డియర్ సూర్యం —

పుట్టకుండానే ఆడో, మగో తేల్చుకునె విషయం మీద చాలా మంది ఆసక్తి చూపిస్తున్నారన్న విషయం విన్నాను. అది ఈ మధ్య కళ్లతో చూశాను. మా హోటల్లోనే బస చేశారు అగర్వాల్‌గారు. ఆయన్ని చూడ్డానికి జనం తీర్థప్రజల్లా వచ్చారనుకో. ఆయన రెండు చేతుల్తో టీ ఆర్జించేస్తున్నాడు. పుట్టబోయేది ఆడపిల్ల అని తెలిస్తే అబార్షన్ చేయించుకుంటారట వాళ్లంతా. ఆ విషయం తెలిసి నేను ఆశ్చర్యంతో నోరు వెళ్లబెట్టాను. ఇది ఒక రకంగా హత్య అంటాను. నీ ఉద్దేశ్యం ఏమిటి ?

ఒకరోజు రాత్రి అగర్వాల్‌గారిని కలిశాను. ''మీరు ఇలా రిజల్టు ముందుగా చెప్పడం వల్ల దేశంలో అబార్షన్లు ఎక్కువవుతున్నాయి ...'' అన్నాను.

అందుకాయన గట్టిగా నవ్వాడు.

''నేను ఆడో, మగో తేల్చి చెప్తున్నానే కానీ ఆడపిల్ల అయితే అబార్షన్ చేయించుకొమ్మని అనడంలేదే ? ఎవరైనా అలా చేస్తే అది వాళ్ల తప్పు. ఇందులో నా బాధ్యత ఏమీలేదు. నేర్చుకున్న విద్య ఉపయోగించుకుంటున్నాను. నాలుగు డబ్బులు చేసుకుంటున్నాను. దట్సాల్'' అన్నాడు.

నాకెందుకో. ఈ ప్రక్రియ మన భారత దేశంలో తప్పుదారిలో. ఉపయోగ పడుతోందని అన్పిస్తోంది. రోజులు ఎలా మారిపోతున్నాయో చూశావా ?

అబార్షన్లు చేసే డాక్టర్లు కూడా చంకలు గుద్దుకుని, సంపాదించుకుందుకి కొత్త ప్రక్రియ బాగా తోడ్పడుతోందని అనుకుంటూ వుండి వుంటారు.

నువ్వేమంటావ్ ?

నాకైతే ఎందుకో చికాగ్గా వుంది ఈ తతంగం అంతా.

జవాబు రాయి.

విశ్వనాథం.
ది. 2–12–82.

* * *

కూతురు దగ్గర్నుంచి వచ్చిన ఆ ఉత్తరాన్ని సంతోషంతో చదివింది ఆ తల్లి.

ఏలూరు,
ది. 17–9–1984.

"మ.ల.స. అమ్మకు —

నీరజ నమస్కరించి రాయునది. నీవు అమ్మమ్మవుకాబోతున్నావని నేను రాసిన ఉత్తరం అందాకా నువ్వు ఎంతో సంతోషంతో జవాబు రాశావు. కానీ నేను నీకు ఆ సంతోషాన్ని మిగల్చలేకపోతున్న దౌర్భాగ్యురాలను. పుట్టబోయే బిడ్డ ఆడో, మగో తేల్చుకునే పద్ధతి ఒకటి ఈమధ్య కొత్తగా వచ్చిందట. ఆ పరీక్ష చేయించడం కోసం ఆయన నన్ను పదిరోజుల క్రితం డాక్టర్ దగ్గరకు తీసుకువెళ్లారు.

"ఇది తొలిసారికదా! ఎవరైనా ఫర్వాలేదు. ఎందుకీ పరీక్షలు ?" అని అడిగాను.

కానీ, ఆయన మొండితనం నీకు తెలియనిది కాదు. ఆ పరీక్షలో నాకు పుట్టబోయేది ఆడపిల్ల అని తేలింది. దాంతో ఇంట్లో తుఫాను రేగింది. ఆయనకు ఆడపిల్ల అంటే ఇష్టంలేదట. అందుకని నన్ను అబార్షన్ చేయించుకోమన్నారు. ఆయనకు అందరూ కొడుకులే కావాలట.

వద్దని ఆయన్ని బ్రతిమాలాను. ఒప్పుకోలేదు. ఆయన నన్ను భయపెట్టారు. నేను భయపడలేదు. తర్వాత మొండిగా ప్రవర్తించారు. నాలుగు తన్నారు. ఆయన మాట వినకపోతే గొంతునులిమి చంపుతానని అన్నారు.

"అందుకు నేను సిద్ధం ... అబార్షన్ మాత్రం చేయించుకోను" అన్నాను.

ఆ తర్వాత నాలుగురోజులు మేం ఇద్దరమూ ఇంట్లో పులి, మేకలాగ తిరిగాం. రెండురోజుల క్రితం వేరేవంకమీద హాస్పటల్‌కు తీసుకువెళ్లి ఆయన పంతం నెగ్గించుకున్నారు. ఆ బాధతో కుమిలి కుమిలి ఏడుస్తున్నాను. కొంత ఊరట కల్గుతుందని ఈ ఉత్తరం రాస్తున్నాను.

"ఈ అబార్షన్ ఈ ఒక్కసారికే అనుకోకు. ప్రతీసారీ పరీక్ష చేయిస్తాను. ఆడపిల్ల అని తెలిస్తే అబార్షన్ ..." అన్నారు. కూతురు పుట్టాకా దానిమీద చేసే ఖర్చుకంటె ఈ పరీక్షకూ, అబార్షన్‌కూ అయ్యే ఖర్చు చాలా తక్కువ అన్నారు.

అమ్మా ! ... ఆడదాని విలువ అంతగా ఎందుకు దిగజారిపోయిందమ్మా ? ఈ కట్నాల బెడదవల్లనా ? అందరూ ఆయనలాగే వుంటే ముందు తరాల్లో ఆడది నల్లపూస అయిపోదా ? అప్పుడు ఏం చేస్తారు ? పెళ్లి చేసుకుందుకు ఆడది దొరక్క మగవాళ్ళంతా బ్రహ్మచారుల్లా వుండిపోతారా ?

ఇదేమాట ఆయన్ను అడిగాను. "నోరు ముయ్యి ..." అన్నారు.

కూతురైనా, కొడుకైనా నాకు తేడా లేదమ్మా ! తల్లిని అవుతున్నానని ఆనందించాను. ఆ ఆనందం ఎక్కువ రోజులు నిలవలేదు. ఈ నిరాశ ఈ ఒక్కసారికే కూడా కాదమ్మా...ఇంకా ఎన్నిసార్లు ఇలా నిరాశ పడాలో తెలియదు మరి.

నిన్నొకసారి చూడాలని వుందమ్మా ! నీ ఒడిలో తలపెట్టుకుని నాకు జరిగిన ఈ అన్యాయానికి కరువుతీరా ఏడ్వాలని వుంది. ఒక్కసారి నీ దగ్గరకు పంపమని ఆయన్ని బ్రతిమాలుతాను. ఆ తలతిక్క మనిషిని మూడ్ చూసి అడగాలి. ఒకవేళ 'నో' అని బుర్ర అడ్డంగా తిప్పితే ఆ విషయం నీకు రాస్తాను. ఒక్కసారి బయలుదేరి రా అమ్మా !

అక్కడ నుంచి నీకు కదలడం ఇబ్బంది అని తెలుసు. కానీ ఏం చెయ్యను ?

నాన్నగారికి నమస్కారాలు. తమ్ముడు, చెల్లెలు బాగా చదువుతున్నారని తలుస్తాను.

వెంటనే జవాబు రాస్తావు కదూ,

ఇట్లు,
నీరజ.

ది. 5–10–1985 నాటి ఒక ప్రముఖ దినపత్రికలో ప్రచురింపబడ్డ వార్త ఇది :—

హైదరాబాద్—ఆంధ్రప్రదేశ్‌లోని మహిళ సంస్థలన్నీ "యామినో సెంటెసిస్" ప్రక్రియకు వ్యతిరేకంగా నినాదాలు చేస్తూ ప్రదర్శనలు జరిపారు. ఆడపిల్ల పుడుతుందని తెలిసి అబార్షన్ చేయించుకుంటున్నవాళ్ల సంఖ్య రోజురోజుకీ విపరీతంగా పెరిగిపోవడంతో ముందు ముందు ఏం కాబోతుందన్న భయాందోళనలు వ్యక్తం చేశారు. ఆడదాన్ని అలుసుగా భావించడం ఇందుకు కారణమనీ, కనుక స్త్రీలకు సమానమైన విలువలు ఇచ్చి ఈ ప్రక్రియ పూర్తిగా నిషేధింపబడాలని వారు కోరుతున్నారు. డాక్టర్లు ధన సంపాదనే దృష్టిలో పెట్టుకుని ఇందుకు తోడ్పడుతున్నారనీ, ఇది తగదనీ తీవ్రంగా విమర్శించారు. గర్భస్రావం చట్టబద్ధం చెయ్యడం ఇలాంటి వాటికోసం కాదనీ, ప్రభుత్వం కల్పించిన ఈ అవకాశాన్ని ఈ రకంగా దుర్వినియోగం చెయ్యడం భావ్యం కాదనీ నొక్కి వక్కాణించారు. మన దేశంలో ఇప్పటికే స్త్రీ జనాభా పురుషులతో పోల్చిచూస్తే తక్కువ వుంది. ప్రతి 1000 మంది పురుషులకూ 970 మంది స్త్రీలు వున్నారు. ఈ పరిస్థితి ఇలాగే కొనసాగితే ప్రతి 1000 మంది పురుషులకూ 100 మంది స్త్రీలు వుంటారు. అప్పుడు ప్రతీ ఆడదానికీ పదిమంది భర్తలు వుంటారని ఛలోక్తిగా అన్నారు. ఈ విషయంలో ముఖ్యమంత్రికి వీరు ఒక మెమోరాండం కూడా సమర్పించారు.

* * *

ది. 21–10–1985న రాష్ట్ర ప్రజల నుద్దేశించి ముఖ్యమంత్రి రేడియోలో భావగర్భితంగా చేసిన ఉపన్యాసం ఇలా వుంది—

"నా అనుంగు మిత్రులారా !... ఈరోజు నేను మీతో "యామినోసెంటెసిస్" గురించి మాట్లాడాలని మీముందు వున్నాను. సైన్సు ప్రసాదించిన ఈ వరాన్ని స్వార్థానికి వాడుకోవడం మనల్ని మనం అవమానించుకోవడమే. తెలుగు

# కూతురు పుట్టాల

తల్లి గర్వంతో తల ఎత్తుకుని తిరిగేలా చెయ్య వల్సిన మనం ఆ తల్లిని అవమానపరుస్తున్న విధంగా ప్రవర్తిస్తున్నాం. ఆడపిల్ల అని తెలియ గానే అబార్షన్‌కు సిద్ధపడే దంపతులమీదా, అబార్షన్లు చేసే డాక్టర్లమీదా కఠినంగా చర్యలు తీసుకుంటాం. అలాంటివారిని పసిగట్టడానికి ప్రత్యేకంగా నిఘావిభాగాన్ని నియమిస్తాం. అలాంటివారి గురించి ఫిర్యాదు చెయ్యడానికి సచివాలయంలో ఒక ప్రత్యేక కౌంటర్ తెరుస్తాం.

ఆడదంటే ఎవరు ? జన్మ ఇచ్చిన తల్లి. జీవితాంతం తోడుగా వుండే భార్య... అనురాగం చిలికే చెల్లెలు. ఆమె సాక్షాత్తూ మహాలక్ష్మి. ఆడపడుచులను గౌరవించడం మన ధర్మం. అది మన నైతిక బాధ్యత... అలాంటిది ఆడపిల్లను ఆదిలోనే అంతం చెయ్యాలనుకోవడం రాక్షసత్వం.

ఆడపిల్లను శాపంగా కాక ఒక వరంగా గుర్తించండి. ఆడపిల్ల అనగానే నిరాశకు లోను కాకండి. కట్నరహిత వివాహాలు రోజురోజుకీ పెరుగుతున్నాయి. అధైర్యపడకుండా ఆడపిల్లకు విద్యాబుద్ధులు చెప్పించండి.

ప్రేమతో పెంచవల్సిన మొక్కను కూకటి వ్రేళ్లతో నాశనం చెయ్యకండి. ఇది మన సంస్కృతి కాదు. ఇది మన నీతికాదు. ఈ పద్ధతికి స్వస్తి చెప్పమని మరొక్కమారు అందరినీ ప్రార్థిస్తున్నాను. తల్లిదండ్రులంటే అనురాగానికీ, ఆప్యాయతకూ, ఆదరణకూ మారు పేరుగా వుండాలికానీ కసాయితనానికీ, రాక్షసత్వానికీ, స్వార్థానికీ కాదు.

ఆడపిల్లను హత్యచేసే ఈ పాడు అలవాటుని మానుకోండి. నమస్కారం... ''

ఆ తర్వాత రేడియోలో ''స్త్రీ'' అనే అంశంమీద ఒక ప్రత్యేక చర్చాకార్యక్రమం ప్రసారం చేశారు.

ఆ తర్వాత స్త్రీ గొప్పతనాన్ని చాటిచెప్పే పాటలు ప్రసారం చేశారు.

* * *

ది. 19—7—1992 నాటి దినపత్రికలో ''ఘరానా హత్య'' అనే మకుటంతో ఒక వ్యాసం ప్రచురింపబడింది. ఆ వ్యాసం తనే రాసినా అచ్చులో మళ్లీ చదువుకున్నాడు ఫల్గుణరావు —

''గత దశాబ్దంతో పోల్చి చూస్తే ఈ దశాబ్దంలో స్త్రీల జనాభా చాలా తక్కువగా వుంది. ఇందుకు కారణం ''యామినో సెంటిసిస్'' ప్రక్రియ అని విడిగా చెప్ప నక్కర్లేదు. బాలికల కోసం, స్త్రీల కోసం నడిపే స్కూళ్లు, కాలేజీలు ఈ విషయం నిజమని చక్కగా ఋజువుచేశాయి. గతంలో సీట్లు దొరకడం కష్టంగా వున్న ఈ స్త్రీల విద్యాలయాలలో ఇప్పుడు చాలా సీట్లు ఖాళీగా వున్నాయి. ఆడపిల్ల అని తెలియగానే అమ్మ కడుపులోనే ఆ బిడ్డను అంతం చేసే ఈ పద్ధతికి స్వస్తి చెప్పమని ప్రభుత్వం, స్వచ్ఛంద సంస్థలు ఎంతగానో ప్రజలను కోరినా, వారు ఈ విషయం పెడచెవిని పెట్టారని తెలుస్తోంది. గత శతాబ్దంలో మధ్య తరగతి రేఖవద్ద నిలిచి వున్న డాక్టర్లు ఇప్పుడు లక్షాధికారులు అయ్యారంటే అందుకు కారణం విడిగా చెప్పవల్సిన అవసరం లేదు. ప్రభుత్వం బెదిరింపులకు భయపడి ఈ పద్ధతికి స్వస్తి చెప్పినట్లుగా పైకి కన్పించినా లోలోపల ఈ వ్యాపారం ముమ్మరంగానే సాగుతోందని తెలుస్తోంది. ఇది

## ఉచిత సలహాలు !

''మీ కొచ్చే జీతం కొద్ది పాటిదే కావచ్చు. మమ్మల్ని అడగండి. దానినెట్లా సర్ది వాడుకోవాలో మేం చెబుతాం'' అంటున్నారు పశ్చిమ జర్మనీలోని గృహ నిర్వాహక కేంద్రం వారు. తక్కువ జీతాలు తెచ్చుకుంటూ ఏ విధంగా జీవనం గడపాలో తెలియక సతమత మవుతున్న ప్రజలకు వీరు ఉపయోగకరమైన సలహాలను ఇస్తున్నారు. గత 25 సంవత్సరాలుగా వీరు 46 వేల ఉపన్యాసాల నిచ్చారు. 16 లక్షలమంది ఈఉపన్యాసాలకు హాజరైనారు. వ్యక్తిగత సలహాలకోసం వీరిని సంప్రదించే వారి సంఖ్య ఎక్కువవుతున్నది. సాధారణంగా నెలకు రెండు వేల నుండి మూడు వేల జర్మన్ మార్కులు ఆదాయం కలవారు వీరిని సంప్రదిస్తుంటారు. అప్పుడప్పుడు అధిక ఆదాయం కలవారు కూడా వీరిని సంప్రదిస్తుంటారని నిర్వాహకులు తెలియ చేశారు.

ఇలాగే కొంతకాలం నడిస్తే కట్నాల సమస్య పూర్తిగా మాసిపోయి, తిరిగి ''కన్యాశుల్కం'' అమలులోకి రావచ్చు. ఇందుకు కారణం అందరికీ అర్థం అయ్యే సూక్ష్మమైన ఆర్థికసూత్రము — ''ఉత్పత్తి పెరిగినచో విలువ తగ్గును. ఉత్పత్తి తగ్గినచో విలువ హెచ్చును ... '' మరో రెండు మూడు దశాబ్దాల తరువాత, ఒకే అమ్మాయి కోసం పాతికమంది అబ్బాయిలు క్యూలో నిలబడ వల్సి రావచ్చును

''ఇన్నాళ్లుగా వరకట్నం పేరుతో ఆరిపోయిన ఆడపిల్లల తల్లిదండ్రుల పగ చల్లారాలి. అందుకే మీ పాతికమందిలో ఎవరు నాకు ఎక్కువ డబ్బు ఇస్తారో వారికే మా అమ్మాయిని ఇచ్చి పెళ్లి చేస్తాను. అందుకు ఇష్టం లేకపోతే మీరు వెళ్లవచ్చు ... '' అని అంటాడు ఒక ఆడపిల్ల తండ్రి ఠీవీగా కూర్చుని కాలరు సవరించుకుంటూ.

ఈ విపరీత పరిస్థితులకు కారణం విజ్ఞాన శాస్త్రం అని కొందరు అపోహ పడుతున్నారు. సైన్సు ప్రసాదించిన ఈ వరం సరైన మార్గంలో ఉపయోగించకపోవడం వ్యక్తుల తప్పుగానీ విజ్ఞాన శాస్త్రం ఇందుకు ఏ విధంగా నిందార్హం అవుతుంది ? అనువంశిక రోగాలువున్న బిడ్డలను గర్భంలోనే అంతం చెయ్యడానికి ఈ ప్రక్రియ సూచింపబడింది. కానీ ప్రజలు దాన్ని తప్పు దారిలో వాడుకుంటున్నారు. సైన్సు ఏది సాధించినా మానవాళి మనుగడకోసమే. ఒక వ్యక్తి కత్తితో పొడుచుకుని చచ్చిపోతే ఆ తప్పు కత్తి కనిపెట్టినవాడిది ఎలా అవుతుంది ? ఆ కత్తి పళ్లు కోసుకుని తినేందుకని సదుద్దేశ్యంతో రూపొందించబడింది. ఆ కత్తితో గొంతు కోసుకుంటానంటే తప్పు ఆ కత్తిది కాదుకదా ! ఇదే న్యాయం 'యామినో సెంటిసిస్' ప్రక్రియకు కూడా వర్తిస్తుంది.

కనుక వ్యక్తుల్లో మార్పురావాలి. అంత వరకూ ఈ విషమ పరిస్థితి ఇలాగే కొనసాగుతూ వుంటుంది. అందుకే ప్రతి ఒక్కరూ గుండెల మీద చెయ్యి వేసుకుని, రాబోయే భయంకరమైన పరిణామాలను దృష్టిలో వుంచుకుని ప్రవర్తించాలి. ఎవరికివారు నా ఒక్కరివల్లా ఏం కాదు అని అనుకుంటే రాబోయే క్లిష్ట పరిస్థితుల నుంచి భగవంతుడు కూడా రక్షించ లేడు.

నుత్తులో ఉన్న ప్రజల వెన్నుతట్టడానికే ఈ వ్యాసం రాశాను. చట్టం దృష్టిలోపడకుండా హత్యలు చేస్తున్న వాళ్లను ఒకసారి మేల్కొలప్ప డానికే ఈ విషయం రాశాను.

ఘరానా హంతకులారా ! ఆపండి మీ దుష్కార్యాలు.

మంచితనం ముసుగు కప్పుకుని పాపాలు చేస్తున్న క్రూరులారా ... ఆలోచించండి ..

— వ్యాసకర్త,
ఫల్గుణరావు.

* * *

ది. 16—3—2053 న రాత్రి 8—45 నిముషాలకు హిందీ వార్తలు అయ్యాకా దేశ ప్రధాన మంత్రి టి. వి. లో ప్రసంగించారు. ఆ ప్రసంగం ఇలా వుంది —

ప్రస్తుతం మన దేశాన్ని పట్టి పీడిస్తున్న సమస్య '' ఆడపిల్లల కొరత ''. గత నెలలోని లెక్కల ప్రకారం ప్రతి 1000 మంది పురుషులకూ 90 మంది మాత్రమే స్త్రీలు వున్నారు. దీనికి కారణం ఏమిటో నేను విడిగా చెప్పదల్చుకోలేదు. ఎందుకంటే ఆ విషయం మీకు తెలుసు. ఆడపిల్లలను కనడాన్ని ప్రోత్సహించే సదుద్దేశ్యంతో తల్లిదండ్రులకు కొన్ని బహుమతులు ప్రకటిస్తున్నాం. ఆడపిల్లలకు కాలేజీ విద్య ఉచితం చేస్తున్నాం. అంతేకాక ఆడపిల్ల పుట్టిన తర్వాత ఆమెకు వివాహం

అయ్యేంతవరకూ ఆ ఆడపిల్లపై ఖర్చుపెట్టే ప్రతిపైసా కూడా ప్రభుత్వం భరిస్తుంది. ఆమెకు అయ్యే తిండి ఖర్చులు, బట్టల ఖర్చులు —అన్నీ ప్రభుత్వం భరిస్తుంది. ఆడపిల్లల్ని కనడం ప్రోత్సహించడానికి చేస్తున్న చర్య ఇది. కనుక ఆడపిల్లలను కని దేశాన్ని ఉద్ధరించమని కోరుతున్నాను. ఆడపిల్ల దొరక్క బ్రహ్మచారులుగా వుండిపోయిన పురుషులందరి పట్ల జాలిపడుతున్నాం. అది మన సాంప్రదాయం కాకపోయినా ఒకే ఆడది పది మందిని పెళ్లి చేసుకుందుకు చట్టరీత్యా వీలు కల్పించమని చాలామంది యువకులు పట్టుపడుతున్నారు. ఈ విషయంలో ఆందోళన కూడా లేవదీసే ప్రయత్నాలలో ఉన్నారు. ఈ విషయంలో ప్రభుత్వం తీవ్రంగా ఆలోచిస్తుంది. నిర్ణయం తీసుకోవడానికి టైము పడుతుంది.

ఏది ఏమయినా ప్రస్తుత దేశ పరిస్థితిని గమనించి ఆడపిల్లను కని ప్రభుత్వం ప్రకటించే రాయితీలు అందుకోండి. నమస్కారం...శలవు...

* * *

ది. 26–7–2065 నాటి దినపత్రికలో 'మేట్రిమోనియల్' కాలమ్‌లో పడిన ఒక ప్రకటన ఇలా వుంది.

20 సంవత్సరముల వయస్సు కలిగి, చక్కని అందచందాలతో, గ్రాడ్యుయేట్ అయిన నా కుమార్తెను వివాహము చేసుకుందుకు అర్హతగల అభ్యర్థుల నుంటి దరఖాస్తులు కోరబడుతున్నవి. ప్రతి అప్లికేషన్‌తోపాటు రు. 50 విలువగల పోస్టల్ ఆర్డర్ పంపవలెను. అప్లికేషన్ పంపుటకు ఆఖరుతేదీ 15–8–2065. ఇంటర్వ్యూ 30–8–2065 న జరుపబడును.

# కూతురు పుట్టాల

ప్రతి అభ్యర్థి కనీసము 2 లక్షలు కన్యాశుల్కం ఇయ్యడానికి సిద్ధపడాలి. ఇంటర్వ్యూలో మా కుమార్తె 5 మందిని ఎన్నుకుంటుంది. ఆ అయిదుగురి మధ్యా ఆక్షన్ జరుగుతుంది. ఎవరు ఎక్కువ సొమ్ము ఇయ్యగలరో వారినే మా అమ్మాయి వరిస్తుంది. అప్లయ్ చెయ్యగోరు అభ్యర్థుల కనీస అర్హతలు ఇలా వుండాలి :

వయసు : 23–25 కి మధ్య.
ఉద్యోగం : మంచిది.
ఆదాయం : కనీసం నెలకు రు. 5000లు.
చదువు : కనీసం గ్రాడ్యుయేట్.
కులం : ఏమయినా ఫర్వాలేదు.
రూపం : బహు చక్కగా వుండాలి.
వ్యసనాలు : అసలు వుండకూడదు.
ఎత్తు : కనీసం ఆరు అడుగులు.

పైన చెప్పిన అర్హతలలో ఎట్టి సడలింపూ వుండబోదు.

అప్లికేషన్లు పంపాల్సిన చిరునామా :

పట్టుదల పంతాలరావు,
స్టార్‌వీధి,
మూన్‌నగర్,
సన్‌స్టేట్.

* * *

ది. 14–6–2093 తేదీ నాటి ప్రముఖ వారపత్రికలో 'ఏడుగురు ఆడపిల్లల తండ్రి శ్రీ కుటుంబరావు'గారితో ఇంటర్వ్యూ ప్రచురింపబడింది.

విలేఖరి :— నమస్కారమండీ !

కుటుంబరావు :— నమస్కారం...రండి ... కూర్చోండి...

వి :— థాంక్స్... మీరు చాలా అదృష్టవంతులని అందరూ పొగుడుతున్నారు.

కు :— అంతేకాదు... కొందరు అసూయ పడుతున్నారు కూడా... నా ఒక్కొక్క కూతురు నాకు కనీసం మూడు లక్షల విలువ.

వి :— ఆడపిల్లల తండ్రు లంతా డబ్బు మనుషులైపోతున్నారని అబ్బాయిల తండ్రులంతా గోలపెడుతున్నారు. మీరు ఏమంటారు ?

కు :— చాలా సంతోషిస్తాను. గత శతాబ్దంలో వాళ్లు రాక్షసుల్లాగ ప్రవర్తించ లేదా ? ఆడపిల్ల తండ్రిని ఘోరంగా బిచ్చగాడి కంటే హీనంగా చూడలేదా ? కట్నాల పేరుతో అతన్ని పీల్చి పిప్పి చెయ్యలేదా ? తక్కువ కట్నం తెచ్చిన కోడల్ని ఇంట్లో పనిమనిషి కంటె ఘోరంగా చూడలేదా ? వాళ్లు పెట్టే బాధలు భరించలేక ఎందరు అమ్మాయిలు ఆత్మహత్య చేసుకోలేదు? ఇప్పుడు బళ్లు ఓడలు అయ్యాయి... ఓడలు బళ్లు అయ్యాయి... అంతే... మేం అంత అమానుషంగా ప్రవర్తించం ...

వి :— యామినోసెంటి ......

కు :— ఆ మాట నా ముందు ఎత్తకండి.. నాకు చికాకు కల్గుతుంది. నేను ఏనాడూ ఆ ప్రక్రియ జోలికి పోలేదు. అందుకే అందరూ నాకు ఆడపిల్లలు పుట్టారేమో !

వి :— మీ కాబోయే అల్లుళ్ల గురించి ...

కు :— నాకు గొంతెమ్మ కోరికలు లేవు. గత శతాబ్దంలో ఆడపిల్లను పెళ్లిచూపుల్లో గొడ్డుగా చూసిన నేరానికి ఇప్పుడు అబ్బాయిలను ఆ రకంగా చూస్తాం... ఏ మాత్రం చిన్న లోపం కన్పించినా మా అమ్మాయిలు వాళ్లని తిప్పి కొడతారు. ఈ రోజుల్లో అబ్బాయిలకు కొదవ ఏముంది ? ఒకడు కాకపోతే ఇంకొకడు దొరుకుతాడు. మా బంగారు బొమ్మలకు ఏ లోపం లేదు మరి...

వి :- ఇవి మీ అభిప్రాయాలేనా లేక మీ అమ్మాయిలు కూడా ...

కు—: మా అమ్మాయిలవే. వాళ్లు తమ పెళ్లి చూపుల్లో అబ్బాయిలను ఏ రకంగా తికమక పెట్టాల అని సరదాగా మాట్లాడుకుంటూ వుంటారు. నేను వాళ్ల మాటలు సపోర్టు చేస్తాను.

వి :— మీ అమ్మాయిల వయసులు ?...

కు :— చెప్పను... కాని పెళ్లికి మాత్రం ఇప్పుడు ఇద్దరు రెడీగా వున్నారు.

వి :— మీ కుమార్తెలపై మీ అభిప్రాయం ?

కు :— వాళ్లు నాకు ప్రాణం కంటె ఎక్కువ. కన్యాశుల్కం తెస్తారని నేను అలా అనటం లేదు.

విజయనగరం లయన్ లేడీస్ క్లబ్ వారోత్సవాలని ప్రారంభిస్తున్న లయన్ జిల్లా ఛైర్మన్ శ్రీ జి. కృష్ణమోహన్‌రావు, శ్రీ ఎల్.కె. జైన్, శ్రీమతి సుశీలా జైన్, శ్రీమతి వి. కుసుమాంబ, శ్రీమతి బి. దేవిగార్లని కూడా చిత్రంలో చూడనచ్చు.



వి :— ఇంకా ఏమైనా చెప్పదల్చు కున్నారా ?

కు :— నా అంతట నేను ఏమీ చెప్పను. మీరు ఏదైనా ప్రశ్న వేస్తే దానికి జవాబు చెప్పాలని అన్పిస్తే చెప్తాను.

వి :— మగపిల్లల తండ్రులను చూస్తే మీకు ఏమనిపిస్తుంది ?

కు :— వెనుక తరాల్లో వాళ్ల చేసిన రాక్షస కృత్యాలకు ఇప్పుడు చక్కని శిక్ష లభిస్తోందని ఆనందించాలని వుంటుంది. వాళ్లంటే జాలి లేదు నాకు.

వి :— చాలా సంతోషం. అడగ్గానే ఇంటర్వ్యూ ఇచ్చారు. మా పత్రిక తరపున థాంక్స్... నమస్తే.

కు :— నమస్తే... శలవు.

* * *

సామాన్య గృహిణి శ్రీమతి సుగుణ ది. 23–1–2098న తన డైరీలో ఇలా రాసుకుంది.

"యామినోసెంటిసిస్" ద్వారా నేను పరీక్ష చేయించుకుంటే నా కడుపులో పెరుగుతున్నది మగబిడ్డ అని తేలింది. ఫలితం తెలిసిన వెంటనే అబార్షన్ చేయించుకుంటానని ఆయనకు చెప్పాను. ఆయన ఒప్పుకోలేదు.

"తొలిసారి కదా! ఎవరైనా ఒక్కటే..." అన్నారు.

నాకు ఇష్టంలేదు. నాకు అందరూ అమ్మాయిలే కావాలి. ఒక్క కొడుకును కూడా భరించలేను. అలిగాను. మొత్తానికి పంతం నెగ్గించుకున్నాను. ఆయన ఒప్పుకున్నారు. డాక్టర్‌తో మాట్లాడాము. రేపే నేను అబార్షన్ చేయించుకునేది.

ఆడపిల్లల కొరత వున్న ఈ రోజుల్లో ఆడపిల్లను కంటే గౌరవం వస్తుంది. అంతే కాదు... ప్రభుత్వం ఇచ్చే రాయితీలుకూడా అందుకోవచ్చు. మగపిల్లవాడు ఈ రోజుల్లో గుండెలమీద ఎలక్ట్రిక్ **హీటర్**లా తయారయ్యాడు. డబ్బు ఖర్చుపెట్టి చదువు చెప్పించడం కాకుండా లక్షలు పోసి ఆడపిల్లను కొని పెళ్లి చెయ్యాలి. ఎందుకొచ్చిన గొడవ ?

ఇప్పుడేకాదు... ఎప్పుడెప్పుడు కొడుకు పుడతాడని తెలిసినా అన్నిసార్లూ అబార్షన్ చేయించుకుంటాను.

* * *

ప్రముఖ గైనకాలజిస్ట్ శ్రీమతి అన్నపూర్ణ ది. 26–2–2100న టి. వి. లో ప్రసంగించారు. ఆ ప్రసంగం ఇలా వుంది.

"ఈ సంవత్సరం నేను 2000 అబార్షన్లు చేశాను. అవన్నీకూడా "యామినోసెంటిసిస్"లో మగపిల్లవాడని నిర్ధారణ చేసిన కేసులే. మగపిల్లలు పుట్టకుండా ప్రభుత్వం తీసుకున్న చర్యల్లో అబార్షన్ చేయించుకున్న స్త్రీకి ప్రభుత్వం రు. 2000, అబార్షన్ చేసిన డాక్టర్‌కి రు 1500 ఇస్తోంది. ఆ ప్రోత్సాహమే నేను ఈ అధిక సంఖ్యలో అబార్షన్ చెయ్యడానికి కారణం ఆడ జనాభాను వృద్ధి చెయ్యడానికి మనం ప్రభుత్వంతో సహకరించాలి. ఏ వస్తువయినా మన దేశంలో లేకపోతే విదేశాలనుంచి దిగుమతి చేసుకుంటాం. కానీ... ఆడవాళ్లను దిగుమతి చేసుకుంటే వాళ్ల విదేశీయులే అవుతారు కదా !... అందుకే ప్రజలందరకూ నా విన్నపం ఒకటే. గర్భం రాగానే పరీక్ష చేయించుకోండి. మగపిల్లవాడని తెలిస్తే అబార్షన్ చేయించుకుని బహుమతి పొందండి. ఆడపిల్ల అని తెలిస్తే ఆనందించండి. ఈ పరీక్షలు చేసే డాక్టర్లూ, అబార్షన్ చేసే డాక్టర్లూ ఇంచుమించు అన్నిచోట్లా వున్నారు ఎవరికైనా ఏ రకమైన సహాయం కావల్సినా నేను తోడ్పడతాను. నమస్తే... 

# సీరియల్: గోరంతదీపం — వింధ్యవాసిని

(గత సంచిక తరువాయి)

## 23

హరి వ్రాసిన "కదిలే బొమ్మల చరిత్ర" విడుదల అయిన మొదటి రెండు నెలల లోపునే, వరుసగా ప్రతీ తెలుగు, వార, మాస పత్రికల్లోనే కాకుండా, ఇంగ్లీష్— తెలుగు దిన పత్రికల్లో కూడా సమీక్షలు వచ్చేయి, పుస్తకాన్ని గూర్చి ఇందుకొంత వరకూ విశ్వమూర్తి ఇన్‌ఫ్లూయన్స్ ఉపయోగపడింది ఆవేళ హరి సేల్స్ ప్రమోషన్ గురించి చెప్పిన మాటల్లో నమ్మకం కుదిరింది ఆయనకి మంచి సలహాని చిన్నవాడు చెప్పినా, పెద్దమనిషి చెప్పినా దాని విలువ ఒక్కటే అనుకుంటాడు ఆయన అయితే పరశురాం అలాకాదు— ఏ పద్ధతి మీదయినా, ప్రయత్నించి ఫలితం చూసేక గానీ, పూర్తిగా నమ్మకం ఏర్పరచుకోడు ఆయన కానీ స్నేహితుడు విశ్వం అభిప్రాయాలకి విలువ నివ్వటం మొదటి నించీ అయిన అలవాటు

మొదట్లో పుస్తకం ఎక్కువ కాపీలు తీసుకుందుకు ఇష్టాన్ని చూపలేదు, డిస్ట్రిబ్యూటర్లు కొత్త రచయిత అనగానే అందరికీ భయమే మరి "చూసావా మనం పెట్టిన ఖర్చు అంతా బూడిదలో పోసిన పన్నీరవుతోంది" అని పరశురాం పయికి అనకపోయినా, అతని మనసులో ఉన్న మాట అదేనని విశ్వమూర్తికీ, హరికీ కూడా తెలుసు

హరి మనసునిది పూర్తిగా కుంగదీస్తోంది పబ్లిసిటీ కోసం, అతను తన స్వంత డబ్బు ఖర్చు చేసిన విషయం ఎప్పుడో మర్చిపోయాడు పరశురాంచేత చేయించిన ఖర్చే, అతన్ని దోషిలా తలవంచుకునేటట్లు చేస్తోంది యాంత్రికంగా ఆఫీసుకి వెళ్ళి వస్తున్నాడే తప్ప, ఎవరితోటీ ఎక్కువగా మాట్లాడటం లేదు వీలయినంత ఎక్కువగా పని కల్పించుకుని, దానిమీద మనసుని లగ్నం చేస్తున్నాడు

శంకరంగారామధ్యే రిజైన్ చేసి అమెరికా వెళ్లిపోయారు హరి ఆయన పోస్ట్‌కి ప్రమోట్ అయాడు కాబట్టి, పనికేం తక్కువ లేదు మామూలు ఆఫీసు పనికాక, "కర్నూలు మండల చరిత్ర" అనే వ్యాసాన్ని వారం వారం ప్రచురించేందుకు తనే వ్రాస్తున్నాడు అది ఎందరో పాఠకుల మెప్పుని సంపాదిస్తున్నది కానీ, అందుకోసం అతను చాలా పరిశోధన, ఎన్నో చారిత్రాత్మక గ్రంథాలు చదవటం చేయాల్సి వస్తోంది

తన పుస్తకం సేల్స్‌కండిషన్ గూర్చి రావుకో ఉత్తరం రాసాడు హరి "పుస్తకాలంటే ఏం వంకాయలనుకున్నావా ? పబ్లిసిటీ ఎఫెక్ట్ అంటే మాజిక్ కాదు కొంత టయిము అవుతుంది, వెయిట్ చేయాలి" అని జవాబు రాసాడు రావు

శరీరానికీ, మనసుకీ కూడా విశ్రాంతి తక్కువయి పోయింది ఒకరోజు అర్ధరాత్రి పడక చేరిన మనిషికి, హై టెంపరేచర్ వచ్చేసి ఉదయం ఫోన్ చేసేందుక్కూడా లేవలేకపోయాడు లీవ్ లెటర్ ఒకటి రాసి ఇల్లు గల వాళ్లతో ఆఫీసుకి పంపించాడు

అతను ఆఫీసుకు రాకపోవటం మూడో రోజుగ్గానీ రమణకి తెలియలేదు అతను ఎప్పుడో ఊర్లకి వెళితే తప్ప, ఉద్యోగంలో చేరింది మొదలు ఇంతవరకూ సెలవు తీసుకోలేదు. అందుకనే ఏమయిందోనని ఆదుర్దాగా ఉందామెకి తండ్రినో ఆఫీసులో వేరే ఎవరినయినా అడుగుదామంటే ఏమనుకుంటారోనని బెదురు అసలే అతనీ మధ్యలో తనతో మనసు విప్పి మాట్లాడక చాలా రోజులయింది గంభీరంగా, ఆఫీసులో అప్పుడప్పుడు కన్పించినా, దూరంగా వుంటున్నాడు అతడి మనసులో ఉన్న బాధ ఏమిటో, అతనెంత బిజీగా ఉన్నాడో తనకి తెలుసు అయినా అప్పుడప్పుడూ అతను తన్ని పలకరించటం కూడా చెయ్యకపోవటం బాధగా వుంది వారం వారం అతను వ్రాసే సీరియల్ వ్యాసానికి, నీట్ కాపీ రాసేది తను రఫ్ కాపీ ఎవరో ఆఫీసు అటెండర్ వచ్చి తన టేబిలు మీద పెట్టేస్తాడు తను వ్రాసి మరో మనిషితో పంపేస్తుంది

విషయం తెలిసిన తర్వాత మధ్యాహ్నం అంతా ఏ పనీ సవ్యంగా చేయలేకపోయింది రమణ అతనెక్కడుంటాడో కూడా తనకి తెలీదు తెలుసుకునే అవసరం ఇంతదాకా రానూ లేదు అతను ఎప్పుడూ మాటవరసకయినా తనతో అనమాలేదు

ఆలోచించగా పరశురాంగారి కారు డ్రయివర్‌కి తెలిసి ఉండచ్చునేమోనని అనుమానంవచ్చింది పరుశురాం ఊళ్ళోలేదు కాబట్టి కారు ఇంటిదగ్గరేవుండాలి, అనుకుని ఇంటికిఫోన్ చేసింది ఫోన్ అరుణ తీస్తే తను ఇరకాటంలో పడుతుంది చిన్నప్పట్నించీ పరిచయం ఉన్నా ఎందుకో తనకీ, అరుణకీ అంతగా సరిపడదు ఒకరి పద్ధతులొకరికి నచ్చవు అరుణ ఎప్పుడూ మాటల్లో, చేతల్లో, తను ఆస్తినీ, అంతస్తునీ, ప్రదర్శిస్తున్నట్లు తనకి తోస్తుంది, అది తనకు నచ్చదు తన మాటలు ఎదుటివారిని బాధ పెడతాయని తెలిసినా, ఆ విషయానికి అంత ప్రాముఖ్యత ఇవ్వదు అరుణ! తన తండ్రి విశ్వమూర్తికి బాస్ కాబట్టి, ఎంత స్నేహితులైనా, ఎవరి స్టేటస్ వారిదే అని ఆమె అభిప్రాయం రమణ మనసు అసలే సున్నితం అందుకే ఎప్పుడూ అరుణకి కాస్త దూరంగానే ఉంటూ ఉంటుంది

రమణ అదృష్టం బాగుంది ఆమె కోరుకున్నట్లు ఫోన్ కరుణే తీసింది, "నువ్వా అక్కయ్యా! ఏమిటీ విశేషం ఇవాళొసారి ఇంటికి రారాదూ ? చాలా రోజులయింది, నువ్విటువచ్చి నన్నే రమ్మన్నావా ? పోనీ, ఇప్పుడిప్పుడే కారు స్వంతంగా డ్రైవ్ చెయ్యగల ధైర్యం వచ్చింది ట్రయిల్‌గా మీ ఇంటి కొచ్చేస్తా "

"అదికాదు కరుణా ! హరిప్రసాద్‌గారెక్కడుంటారో నీకేమయినా తెలుసా ?"

"ఎవరూ మా మాస్టారా ? ఊ ఎప్పుడో ఒకసారి చూసాను గుర్తుపట్టగలననుకుంటాను ఎందుకూ ? ఆయన ఆఫీసులో లేరా ?"

"మూడు రోజులు సెలవు పెట్టేరట ఏమయినా ఒంట్లో బాగాలేదేమోనని నా అను

**జరిగినకథ — 8 :** గుంశూరావ్ కూతురు కామేశ్వరిని పెళ్లి చేసుకొంటాడు పరుశురావ్ తన భార్య పిన వాడి కొన్ని కష్టం అయి చనిపోగా విశ్వం బెంగుళూరులో వున్న వొక ఆంగ్ల పత్రికలో రిపోర్టరుగా చేరతాడు 'గోరంతదీపం' అనే వారపత్రికను పరశురావ్, విశ్వం కలసి నెలకొల్పుతారు హరిప్రసాద్, రమణ ప్రేమించుకుంటారు హరి తనపుస్తకం పబ్లిసిటీ వర్క్‌మీద హైదరాబాదు వెళుతూంటే కరుణ వీడ్కోలు చెప్పను స్టేషన్‌కు వస్తుంది రైల్లో తన చిన్నతనపు రోజులు జ్ఞప్తికి తెచ్చుకుంటాడు హరి — తన తండ్రి తల్లిని వదిలేయగా తను అనాధగా, తల్లి అక్కడే ఆయాగా ఒక అనాధశరణాలయంలో చేరుతారు తల్లి మరణిస్తుంది కాలేజీలో చదివే రోజుల్లోనే రావు పరిచయమవుతాడు హైదరాబాదులో రావుని కలిసిన హరి అతని ప్రవర్తనలో మార్పు రానందుకు చింతిస్తాడు హరి అతనితో తన పని ముగించుకొని అరుణ, రమణ, కరుణలకు ప్రెజెంట్స్ తీసుకొని హైదరాబాదు నుంచి వస్తాడు రమణ మనస్సులో తనకు స్థానం ఉందని తెలుసుకుంటాడు

మానం" ఆదుర్దా బయట పడకుండా జాగ్రత్తగా మాట్లాడింది రమణ

"ఏమోమరి పోనీ మనం వెళ్ళి కనుక్కుందామా ? అయిదు గంటలకి నేను ఆఫీస్‌కి వస్తాను, నువ్వు రెడీగా ఉండు ఇద్దరమూ కలిసి వెళ్దాం "

"పోనీ డ్రయివర్ కయితే బాగా తెలుస్తుందేమో అతన్ని తీసుకునే రా "

"డాడీ వూరికి వెళ్ళేరని డ్రైవర్ ఇవాళ సెలవు తీసుకున్నాడక్కయ్యా ఫరవాలేదు కనుక్కోగలంలే ఏం నా డ్రైవింగ్‌మీద నమ్మకం లేదా ?"

"అబ్బే! అది కాదు కరుణా "

"కాకపోతే నువ్వు రెడీగా వుండు నేనొస్తాను " అని ఫోన్ పెట్టేసింది కరుణ

"ఫరవాలేదు మంచి పిల్ల మాస్టారిపై ఆ మాత్రం అయినా అభిమానం ఉంచుకుంది" అని కొంత రిలీఫ్‌గా ఫీలయింది రమణ

సరిగ్గా అయిదు గంటలకి కరుణ ఆఫీసుకి వచ్చింది ఇద్దరూ కలిసి బయలుదేరారు నిజానికి కరుణకు తెలిసింది, హరి మొదట్లో ఉంటున్న చాంద్ టాకీసు పక్కసందులోని గది అతను మరో చోటికి మారేడు చాలా రోజులక్రితమే ముందుగా తనకి తెలిసిన చోటికి తీసుకెళ్ళింది కరుణ అక్కడ ఓనర్స్‌తో విచారించితే, అతనిప్పుడు మద్దూరు సుబ్బారెడ్డినగర్‌లో ఉంటున్నాడని అడ్రస్ ఇచ్చారు

అక్కడికి వెళ్ళేందుకు మరో అయిదు నిముషాలు పట్టింది ఒక పెద్ద ఇంటి మేడమీద రెండు గదుల్లో ఉంటున్నాడు హరి

మంచంమీద పడుకుని కళ్ళు మూసుకుని ఏదో ఆలోచిస్తున్నవాడల్లా ఉలిక్కిపడి లేచి మంచం దిగబోయాడు, తలుపు చప్పుడుకి

దగ్గరగా వేసిఉన్న తలుపులు తోసుకుని లోపలికొచ్చేశారు రమణా, కరుణా ఆ గదిలో అతను పడుకున్న మంచం కాకుండా మరో టేబిలు, రెండు కుర్చీలు మాత్రమే ఉన్నాయి ఇద్దరూ చెరో కుర్చీలో కూర్చున్నారు

"ఏమిటి మేస్టారూ ? బాగా సుస్తీపడినట్లున్నారే" పలకరించింది కరుణ

"రెండ్రోజులయి జ్వరం వస్తోంది "

జ్వరంవల్ల పీక్కుపోయిన ముఖం, పెరిగిన గెడ్డం, చెదిరిపోయిన క్రాపు, నలిగిన లుంగీలో అస్తవ్యస్తంగా కనిపిస్తున్నాడు హరి

రమణకి అతను ఆఫీసుకి రావటంలేదని తెలిసినప్పట్నుంచీ తనెంత ఆరాటపడిందీ, ఎలా అతనికోసం ఆదుర్దాగా వెతుక్కుంటూ వచ్చిందీ, అన్నీ, అతని పక్కన కూచుని చెప్పాలనీ, అతన్ని దగ్గరికి తీసుకోవాలనీ ఉంది ఏం చేయటానికీ కరుణ ఎదురుగా ఉంది అందుకే, ఆ అమ్మాయినే మాట్లాడనిస్తూ, తను మౌనంగా ఉండిపోయింది అతను మాట్లాడుతున్నది కరుణతో అయినా, తన ముఖంలో భావాలని చదివేందుకు అతను చేస్తున్న ప్రయత్నం చూపుల్లో తెలుస్తోనేవుంది

"మీరొకసారి మొదటిరోజే మాకు ఫోన్ చేస్తే బావుండేది నేను డాక్టర్ని తీసుకొచ్చేదాన్ని" కరుణ మాటల్లో ఎప్పుడూ అమాయకత్వమే కనిపిస్తుంది హరికి

"ఓ అదో పెద్ద విషయమా అందర్నీ కంగారు పెట్టేందుకు ? మామూలు జ్వరమే కరుణా మా ఇంటి ఓనర్‌వాళ్ళు మంచివాళ్ళు డాక్టర్నీ పిలిపించి చూపించారు "

"ఏం తింటున్నారో ఏమో! మనం పళ్ళయినా తెస్తే బావుండేది కదూ ?" రమణ అంది

"ఓస్ ఇంతేకదా! ఒకపని చేద్దాం నువ్విక్కడే మాస్టారితో మాట్లాడుతూ వుండు నేనిప్పుడే వెళ్ళి తీసుకొచ్చేస్తాను" అని, హరి వద్దని వారిస్తున్నా వినిపించుకోకుండా బయటికి పరిగెత్తింది కరుణ

హరి, రమణని దగ్గరికి రమ్మని కళ్ళతోనే సైగచేశాడు ఆమెవచ్చి పక్కనే మంచంమ్మీద కూర్చోగానే, తల ఆమె ఒళ్ళో దాచుకున్నాడు, చిన్నపిల్లాడిలాగా తలమీద చెయ్యేసి, వెంట్రుకల్లో వేళ్ళని కదిలిస్తూ,

"మీకేమయిందోనని ఎంతగా హడలిపోయానో తెలుసా ?"

"పోనీ జ్వరం రావటం మేలయింది చూసేందుకయినా వచ్చావు నా గదికి "



"ఛ! అదేందుకు? మీరెప్పుడన్నా అసలు రమ్మని పిలిచేరా వచ్చేందుకు? అయినా, ఈ మధ్యలో ఎందుకో నాకు దూరంగానే వుంటున్నారులే. నాకు తెలీదనుకున్నారా? ఆఫీసులో కన్పించినా పలకరించరు. కాఫీకి రమ్మనయినా పిలవరు."

"సారీ రమణా! నిన్ను దూరం చేయాలని కాదు. ఏమిటో నా మనసేమీ బాగుండటంలేదు. మూడ్ బాగున్నప్పుడు, నీతో మాట్లాడినా సంతోషంగా వుంటుంది. నా ఆలోచనలే బాగులేనప్పుడు, నిన్ను కలిసి నీ మూడ్ కూడా ఎందుకు పాడుచేయాలి? అని. అంతకు మించి ఇంకేం లేదు. అబ్బ. ఇలా నీ ఒళ్ళో తల ఉంచితే ఎంత హాయిగా ఉందో."

"అదేం మాట! మూడ్ సరిగాలేనప్పుడు, మనని అభిమానించేవాళ్ళతో మనసు విప్పి చెప్పుకుని తేలిక పడాలి."

"అవునేమో! ఈ రెండురోజులూ, జ్వరం పడినప్పట్నించీ నువ్వు వస్తే బాగుండునని ఎంతగా కోరుకున్నానో తెలుసా? దేవుడు వరమిచ్చినట్లు, ఇవాళ వచ్చేసావు. ఈ నీరసం వదిలేస్తుంది నన్ను."

మెట్లమీద కరుణ అడుగుల చప్పుడు విన్పించగానే, ఉలిక్కిపడి ఇద్దరూ సర్దుకుని కూర్చున్నారు.

అయినా అప్పటికే వాళ్ళిద్దరూ సన్నిహితంగా ఉండటం కరుణ కళ్ళలో పడిందని వాళ్ళకి తెలీదు. కరుణకేమీ ఆశ్చర్యమూ కలుగలేదు. మొదటి నుండి వాళ్ళిద్దరి మధ్యా పెరుగుతున్న స్నేహాన్ని గమనిస్తోనే ఉంది ఆమె. ఇవాళ ఫోన్లో రమణ మాట్లాడినప్పుడు, ఆమె స్వరంలో కనిపించిన ఆరాటమే చెప్పింది, ఆమె హరిని ఎంతగా ప్రేమిస్తున్నదీ. "పాపం మాస్టారు ఒంటరివారు. ఇన్నేళ్ళూ తన వాళ్ళు అంటూ లేకుండానే గడిపేసారు, ఎన్నో కష్టాలుపడి. ఆయనకి, రమణక్కయ్యలాంటి మంచి మనసున్న అమ్మాయి భార్య అయితే, తోడుగా ఉండి, ఆయన్ని అభిమానంగా చూసుకుంటుంది" అనుకుంది సంతృప్తిగా, మనసులోనే.

* * *

ఆవేళ హరి ఆఫీసుకి వచ్చాడు. ఉదయం అంతా కలెక్టర్ ఆఫీసులో ఒక మీటింగ్ అటెండ్ అవటం సరిపోయింది. లంచ్ టయిముకి రమణ రూముకి వెళ్ళాడు. అప్పుడే చేతులు కడుక్కుని టేబిల్ మీద టిఫిన్ బాక్స్ ఉంచుకుని కూర్చొనుంది రమణ.

అవాళ హరి ఆఫీస్‌కి వచ్చాడని ఆమెకి తెలుసు. అయినా ఇంతవరకూ తనకతను కన్పించనందుకు అసంతృప్తిగా ఉంది. అందుకే ఆలోచనగా బాక్స్ తెరిచి పెట్టుకుని చూస్తూవుంది. "హాయ్ రమణా!" అంటూ వచ్చిన హరిని చూడగానే ఆమె ముఖం వికసించింది.

# గోరంత దీపం

"రండి. భోంచేద్దాం" అని నవ్వుతూ ఆహ్వానించింది. అతను వాష్‌బేసిన్‌లో చేతులు కడుక్కుని వచ్చేలోగా డ్రాయర్ లోంచి మరో స్పేర్ స్పూను, రెండు అరటిపళ్ళు తీసి టేబిల్ మీద పెట్టింది. బాక్స్‌లో ఉన్న వాంగీబాత్‌ని సగం మూతలో సర్దింది.

"ఎలా వుందివాళ మీకు?"

"బ్రహ్మాండంగా వుంది. కనబట్టంలే కాకపోతే పొద్దుటంతా ఆ మీటింగ్‌తో తల వాచిపోయి, కాస్త అలసినట్లు కనిపిస్తున్నానేమో. కడుపులోకి కాస్త ఇంధనం వెళితే సరి, మామూలుగా అయిపోతాను. అబ్బ వాంగీబాత్ కదూ ఇది. భలే రుచిగా వుంది. ఏయ్. నువ్వేమిటి తినకుండా అలా నన్ను చూస్తూ కూర్చున్నావ్. జాగ్రత్త అమ్మాయి. అంత ముద్దుగా బొమ్మలా కూర్చున్నావంటే అన్నం మొత్తం తినేసి ఆపైన నిన్నూ తినేయాల్సి వస్తుంది" అన్నాడు మెల్లిగా హరి.

## జీవన ప్రసూనాలు

ఊహాగానాలూ, ఆశాసౌధాలూ,
ఎండమావులనీ, గగన కుసుమాలనీ
అంటారు కానీ, అవి —
నిర్భాగ్యులకు, నిరాధారులకు
ఆనందానుభూతుల్ని
ప్రసాదించే ఇంధనాలు,
శాస్త్రజ్ఞుల్ని, చిత్రకారుల్ని,
రచయితల్ని, గాయకుల్ని
సృష్టించే సాధనాలు,
సుఖమయ జీవనానికి ఆశాజ్యోతుల్ని
నాగరిక సంఘాలకు సంస్కారాన్ని
వెలయించే జీవన ప్రసూనాలు

— సత్యశ్రీ

భోజనం అయింది. కాఫీకి బయలుదేరారు.

"రమణా. ఒక చిన్న రిక్వెస్ట్. సాయంత్రం ఇద్దరం కలిసి సాయిబాబా గుడికి వెళదాం వస్తావా?" ఏమంటుందో నన్న అనుమానంతోనే అడిగాడు హరి.

ఆమె 'సరే' అనగానే, "ఆరింటికి మీ ఇంటి కొస్తానయితే రెడీగా ఉండు" అని చెప్పేసి వెళ్లిపోయాడు.

సాయంత్రం ఇల్లు చేరగానే, త్వరత్వరగా వంట మొదలు పెట్టింది. రెండు కూరలు, ఫ్రెష్‌గా రసము పెట్టేసింది. ఆ వేళ కాస్త ఎండగా వుండింది మధ్యాహ్నం. ఆ మాటకొస్తే కర్నూల్లో సంవత్సరానికి తొమ్మిదినెలలు ఎండలు కాయటం మామూలే. ఒళ్లంతా చితచితగా ఉండి స్నానం చేద్దామా అన్పించింది.

ఎక్కువ నీళ్లతో, ఎక్కువసేపు స్నానం చేయటం అంటే ఇష్టం రమణకి. టయిం చూసుకుంది. అయిదున్నరే. ఫరవాలేదు అనుకుంటూ, కొత్త మైసూరు సాండల్ సబ్బు పట్టుకుని స్నానాల గదిలో దూరింది. ఏ చీర కట్టుకుందామా అని ఆలోచించింది. హరి తన కోసం హైదరాబాదు నుంచీ తెచ్చిన చీర గుర్తొచ్చింది. చందనం రంగు సిల్కు చీర, తొండాలెత్తి నిలుచున్న కాఫీ కలర్ ఏనుగుల బార్డర్, దాన్ని ఎన్నోసార్లు విప్పిచూసుకుని, కట్టుకుంటే ఎలా ఉంటుందోనని మురిసిపోవటమే గానీ, అసలు కట్టుకోనేలేదు. ఏదయినా ప్రత్యేక సందర్భం రావాలనే దాన్ని అట్టేపెట్టింది. ఇవాళ కట్టుకుంటే అతనికీ సంతోషంగా వుంటుంది అనుకుని, మాచింగ్ బ్లవుజ్ ఉన్నదా లేదా అని ఆలోచనలో పడింది.

ఆమె ఆలోచన ఇంకా అవకముందే కాలింగ్ బెల్ శబ్దం వినిపించింది. పని కుర్రవాడు అయితే తలుపు మూసి ఉంటే ఈ సమయంలో నేరుగా అటుతిరిగి వెనుక తలుపులోంచి లోపలికి వస్తాడు. తన తండ్రి ఇప్పుడప్పుడే రారు. ఇక హరిప్రసాదే అయి ఉండాలి. తనున్న పరిస్థితిలో అతన్ని తలచుకోగానే చెప్పలేనంత సిగ్గుగా ఉంది. అతను ఉండి ఉండీ మోగిస్తూనే ఉన్నాడు బెల్.

రమణ గబగబా ఒళ్ళు అయినా సరిగ్గా తుడుచుకోకుండానే, దొరికిన జాకెట్టు వేసుకుని, ఆదరాబాదరాగా చీర కట్టుకుని వెళ్ళి తలుపు తీసింది.

"ఏమిటంతసేపు?" అని అతన్నూ, "ఏమిటంత తొందర?" అని ఆమె ఒకేసారి ఒకర్నొకరు ప్రశ్నించుకున్నారు.

అడిగాడేకానీ కారణం తెలుస్తూనే ఉంది హరికి. ముఖంమీద అక్కడక్కడా ముత్యాల్లా మెరుస్తున్న నీటి బిందువులు, ఒళ్ళు బాగా తుడుచుకోనందువల్ల కొద్దిగా తడిసి భుజాల మీద అతుక్కుపోయిన జాకెట్టు, తొందరలో కాస్త తమాషాగా కుదిరిన చీర, ముడిగా బిగించిన వెంట్రుకలు — అన్నీ చెపుతున్నాయి, ఆమె ఇంతసేపూ ఏం చేస్తూ వుండిందో.

"సారీ" అన్నాడు నొచ్చుకుంటూ.

"పోనీ. రండి లోపలికి. ఒక్కనిముషం అలా కూర్చుంటే నేనొచ్చేస్తాను." అంటూ తన గదిలోకి వెళ్ళిపోయింది.

అప్పుడే విరిసిన గులాబీ అంత ఫ్రెష్‌గా ఉన్న ఆమె ముఖాన్నే స్మరించుకుంటూ, తను తెచ్చిన మల్లెల పొట్లం విప్పి టీపాయ్ మీద ఉంచాడు. ఎంతకీ రాదేమిటా అని అసహనంగా అటూ ఇటూ చూసాడు.

"రమణా. ఒక్కనిముషం అన్నావు రెండు నిముషాలు అయిపోయింది. ఇంకెంతసేపు" అని పిలిచాడు కాస్త స్వరాన్ని హెచ్చించి.

"అయిపోయిందండి. బొట్టు పెట్టుకుంటున్నాను."

# ఇంటింట రస్న

## ప్రతి చిన్న రస్న పేకెట్ నుండి 32 గ్లాసుల మధుర రసం.

ఎంతో రుచి, ఎంతో ఆదా మంచి నీళ్ళలో పంచదారను కలిపి, అందులో
రస్నను కలపండి నిముషాలలో 32 గ్లాసులకు సరిపోను 2 సీసాల
సిరప్ తయారవుతుంది సేవించండి రస్నను తనివితీరా
ఎందుకంటే రస్న మీకు ఎంతో ఆదా నిస్తుంది
ఇతర సిరప్/స్క్వాష్ ధరలతో రస్నను పోల్చి
చూడండి— సగంకన్నా కూడా తక్కువే!
రస్న మీకు సప్త రుచులలో లభిస్తుంది

ఇప్పుడు! సరికొత్త అంతర్జాతీయ శ్రేణికి చెందిన ప్యాక్‌లో

Rasna
soft drink concentrate
Orange

# రస్న

**సాఫ్ట్ డ్రింక్ కాన్‌సెన్‌ట్రేట్**

**ఎంతో రుచి.**
**ఎంతో ఆదా.**

తయారుచేయువారు
పియోమి ఇండస్ట్రీస్ అసర్వా, అహమదాబాద్-380016
అబుదాబి మస్కట్ బహ్రెయిన్ కువైట్ దుబాయ్ ఒమాన్ మారిషస్ కైరో ఖార్టూమ్ లుసాకా నైరోబీ జెద్దా, ఆస్లో లండన్

Mudra/PI/1507 TEL

మెల్లిగా లేచి లోపలికి నడిచాడు ద్వారానికి రెండు వయిపులా చేతులాన్చి నిలుచుని, "నన్ను హెల్ప్ చేయమంటావేమిటి ?" అన్నాడు

చురుకుగా ఇటు తిరిగి, అతని వంక చూసింది

అతను చేతిలో మల్లెలదండ పట్టుకుని నవ్వుతూ నిలుచుని వున్నాడు తనెక్కువగా లైక్ చేసే వైట్ సఫారీసూట్ వేసుకుని ఉన్నాడు చిలిపిగా చూస్తున్న అతని కళ్ళలోకి సూటిగా చూడబోతే, బుగ్గలమీదికి పాకిన మీసాలు కొట్టొచ్చినట్లు కన్పించాయి 'ఈయనీ మీసాలు కొంచం తగ్గించేస్తే బావుండు' అనుకుంది

"ఇదేం హెల్ప్‌చేస్తారుగానీ, కిచెన్‌లో కాఫీ ఉంది తెచ్చుకుని తాగండి నాదయిపోయింది వచ్చేస్తాను" అన్నది

"ఇదిగో" అని పూవులామెకి అందించి తను వెళ్ళి కాఫీ తెచ్చుకున్నాడు ఆమె రెడీ అవుతుంటే తను అలా చూస్తూ నిలుచోవటం, కాఫీ తెచ్చుకొమ్మని ఆమె పురమాయించటం, తాను బుద్ధిగా వెళ్ళి తెచ్చుకోవటం— అన్నీ అతనికి తమకప్పుడే పెళ్ళి అయిపోయిన భ్రమ కల్పిస్తున్నాయి

ఆమె కట్టుకున్నది తను తెచ్చిన చీరేనని గుర్తించాడు కుందనపుబొమ్మలా ఉంది అనుకున్నాడు ఆమె పక్కన తను దిష్టిబొమ్మలా ఉంటానేమో అనిపించింది ఎదురుగా అద్దంలోంచి, ఆమె పక్కగా కనిపిస్తున్న తన ప్రతి

# గోరంత దీపం

బింబాన్ని చూసుకున్నాడు మరీ అంత అధ్వాన్నం కాదులే అని సర్దిచెప్పుకున్నాడు

"అవునూ నువ్వు రోజు కెన్నిసార్లు స్నానం చేస్తావోయ్" అన్నాడు నవ్వుతూ

"ఎన్నిసార్లయినా చేస్తాను స్నానం చేయటం అంటే ఇష్టం నాకు"

"చిన్నప్పట్నించీ బాగా సబ్బులు అరగదీసే ఇంత చక్కగా ఉందేమో నీ శరీర ఛాయ"

"ఫేర్‌గా ఉన్నానని కాంప్లిమెంట్ చేస్తున్నారా ? లేక సబ్బుల కెంత ఖర్చు చేస్తుందో బాబోయ్ అని భయపడుతున్నారా ?"

"రెండూనూ" అన్నాడు హరి తొణక్కుండా

"అందం పెరగడంకోసమే కాదు అలసిపోయినప్పుడు స్నానం చేస్తే, శరీరం ఫ్రెష్‌గా అవటమే కాకుండా, మనసు కూడా చల్లబడినట్లయి, ఆలోచనలూ ఫ్రెష్‌గా ఉండి మూడ్ బాగుంటుంది తెలుసా ?" ఏదో రహస్యం చెబుతున్న దానిలా అన్నది రమణ

"మనం వెళ్ళినప్పుడు మీ నాన్నగారుగాని వస్తే ?" స్కూటర్ స్టార్ట్ చేస్తూ తన అనుమానం వెలిబుచ్చాడు

"ఫరవాలేదు ఆయన పర్మిషన్ తీసుకునే వస్తున్నాను మీరు నన్ను పిక్చర్‌కి తీసికెళుతున్నారని చెప్పాను పిక్చర్ టయిం అయేదాకా ఆయన రానేరారు అక్కడే ఏదో పని చూసుకుంటూ ఉండిపోతారు"

"మంచిపని చేశావ్ పద ఆలయం నుంచి అలాగే పిక్చర్‌కి పోదాం" ఇద్దరూ బయలుదేరారు

కొబ్బరికాయ కొట్టించి, పూజ చేసుకొని వెళ్ళి మెట్లమీద కూర్చున్నారు హరీ, రమణ చెరో కొబ్బరికాయ ముక్క తింటూ ఉన్నారు నలుగురయిదుగురు అడుక్కునే పిల్లలు చుట్టుముట్టారు హరి వాళ్ళందర్నీ లైన్‌గా నుంచోమ్మని, ఓపిగ్గా తలో కొబ్బరి ముక్కా, అయిదుపైసల బిళ్ళా ఇచ్చి పంపేశాడు

"ఏమని మొక్కుకున్నావు ?" అడిగాడు సరదాగా రమణని

కొద్దిగా సంశయించి చెప్పింది, "మీరెప్పుడూ ఆరోగ్యంగా ఉండాలని"

"ఊహూ నేనయితే, మనిద్దరికీ త్వరగా పెళ్ళయిపోవాలని కోరుకున్నాను తెలుసా ?"

## 24

హరి, ప్రకాశ్‌నగర్‌లో ఒక చిన్న పోర్షన్‌కి మారేడు కొత్తగా టెలిఫోన్ కూడా వచ్చిందిటికి పెళ్ళి చేసుకోవాలనే అయిడియా మనసులో రూపుదిద్దుకోగానే, సంసారానికి అవసరమయిన వస్తువులన్నీ ఒక్కొక్కటిగా వీలునుబట్టి కొని చేరుస్తున్నాడు అప్పుడో ఇప్పుడో సమయం చూసుకుని విశ్వమూర్తిగార్ని అడగాలని అనుకుంటున్నాడు

ఒకప్పుడు 'గోరంతదీపం'లో చాలా మటుకు కర్నూలు లోకల్ న్యూస్, దగ్గరున్న చిన్న ఊర్లలో విశేషాలకి ఎక్కువగా ప్రాముఖ్యత ఇవ్వబడేది అప్పుడప్పుడు ఎడిటోరియల్ సెక్షన్ నుంచి ఎవరో ఒకరు అనంతపురం, కడప, చిత్తూరు, తిరుపతి టూర్‌చేసి వస్తుండేవారు చాలా మటుకు ఆయా వూర్ల గురించి దినపత్రికల్లో వచ్చే 'స్పాట్ న్యూస్' తర్వాత, ముఖ్యమయిన వాటికి 'ఫాలోఅప్' చేసేవారు ఈ పద్ధతి వల్ల న్యూస్ 'స్టోరీ' ఇవ్వటం ఆలస్యం అయిపోతూందని హరి అభిప్రాయపడ్డాడు ఆ విధంగా ఆయా వూర్లలో పేపర్ సర్క్యులేషన్ అంతగా అభివృద్ధి అయే వీలు లేదని అన్పించింది అతనికి

అందుకు అతనొక కొత్త పద్ధతి కనిపెట్టాడు వీలయినన్ని జిల్లా, తాలూకా హెడ్‌క్వార్టర్స్‌లో తమ ఏజంట్లుగానీ, లేదా ఏ హైస్కూలు టీచరుతోగానీ, తమకి న్యూస్ పంపేలా ఏర్పాటు చేయించాడు ముఖ్యమయిన ఏ విశేషం అయినా ఉంటే తమకి వెంటనే టెలిగ్రాం ఇచ్చేట్లు, ప్రతీ టెలిగ్రాంకి అయే ఖర్చు తాము భరించటం, ఆ విశేషాన్ని గూర్చి పూర్తి 'ఎన్‌క్వయిరీ' చేసి తమ పేపర్లో పబ్లిష్ గనక చేసుకుంటే, మెసేజ్ ఇచ్చినవారికి కొంత రెమ్యూనరేషన్ ఇవ్వటం — ఇదీ ఏర్పాటు ఇది

## అయస్కాంత చికిత్స!

శరీర అంతర్భాగాలను చూసేందుకు పశ్చిమ జర్మనీలో ఎక్స్‌రేలకి బదులు అయస్కాంత టోమోగ్రఫీని ఉపయోగిస్తున్నారు ఎక్స్‌రేలను ఉపయోగించటం, ముఖ్యంగా గర్భిణీ స్త్రీలకు పనికిరాదు అటువంటి వారికి టోమోగ్రఫీ సురక్షితమైనదని భావించారు కానీ దీనివలన కూడా దుష్ఫలితాలు ఏర్పడగలవని డాక్టర్లు అంటున్నారు అయస్కాంత శక్తి వలన ఆయా భాగాల ఉష్ణోగ్రత తగ్గుతుంది ఉష్ణోగ్రత తిరిగి మామూలు స్థాయికి చేరుకోటానికి కనీసం అరగంట పడుతుంది దీనివలన రక్త ప్రసరణలో కూడా మార్పులు సంభవిస్తున్నాయి టోమోగ్రఫీలో 0 1 టెస్లాల అయస్కాంత శక్తి కంటె రెండువేల రెట్లు ఎక్కువ ఈ దుష్ఫలితాలదృష్ట్యామరింత విస్తృతంగా దీనిని గురించి పరిశోధనలు జరగాలని వారు సూచించారు

టెక్కలి సాహిత్య సాంస్కృతిక సమాజం వారు ఇటీవల నిర్వహించిన సాంస్కృతిక కార్యక్రమం "భూమి భాగోతం" నాటికలోని ప్రధాన ఘట్టంలో 'సూరి — మంగి' పాత్రధారులని చిత్రంలో చూడవచ్చు



చేయటం ఏమీకష్టం అవలేదు ఎందుకంటే చాలాచోట్ల, ఏజంట్లకన్నా ఎక్కువగా, కాలేజి విద్యార్థులు, స్కూలు టీచర్లు ఉత్సాహాన్ని చూపించారు కాకపోతే ఆయావూళ్ళకి వీలుని బట్టి, తనే స్వయంగా వెళ్ళి ఏర్పాట్లు చేయాల్సి వచ్చింది హరికి ఈ విధంగా అతనికీ జర్నలిస్ట్‌కి అవసరమయే అనుభవమూ కొంత వచ్చింది ఆ విధంగా ఆంధ్రదేశమంతా తిరిగి చూడాలనే అన్పించింది గానీ, తమ పత్రికకి ఎక్కువగా ఉన్నది రాయలసీమ సర్క్యులేషనే అందుచేత రాజధాని వార్తలు తప్పిస్తే, మిగతా విషయాల్లో రాయలసీమలో ఊళ్ళకే హెచ్చు ప్రాముఖ్యత ఇవ్వబడుతుంది

ఉదయం స్నానం చేస్తూ ఉన్నాడు హరి ఫోను మోగుతూ ఉంది గబగబా కానిచ్చేసి వచ్చి అందుకున్నాడు ఆఫీసు నుంచీ, నైట్‌వాచర్ చేశాడు

"సార్! మీకో పర్సనల్ టెలిగ్రాం వచ్చింది, ఇంటికి తెచ్చేదా?"

హరి టయిం చూసుకున్నాడు వాడు ఇక్కడికి సైకిలు మీద రావాలంటే సులభంగా అరగంట పడుతుంది తనెలాగూ రెడీ అవుతున్నాడు అందుకని "వద్దు నేనే వస్తాను" అని చెప్పి ఫోన్ పెట్టేశాడు 'నాకు టెలిగ్రాం ఇచ్చే వాళ్ళెవరా' అని లోలోపల ఆశ్చర్యపోతూనే డ్రస్ చేసుకున్నాడు టిఫిన్ తర్వాత తినొచ్చులెమ్మనుకుని నేరుగా ఆఫీసుకి వెళ్ళిపోయాడు

తన టేబిల్‌మీద బొత్తిగాపెట్టి ఉన్న అయిదు టెలిగ్రాముల్లో మొదటి దానిమీద తన పేరు ఉంది 'ఏమయివుంటుందా' అనుకుంటూనే తెరిచి చదువుకున్నాడు విషయం అర్థం అవగానే కలా నిజమో అర్థం అవక తల తిరిగిపోయింది అలాగే కుర్చీలో కూలబడ్డాడు

అతని పుస్తకం 'కదిలే బొమ్మల చరిత్ర'కి నవ్యసాహితి అకాడెమీ అవార్డు వచ్చినట్లు, హైదరాబాదునించీ వచ్చిన టెలిగ్రాం అది తనలాంటి మామూలు వాడికి అంత గొప్ప అవార్డు రావటం ఏమిటి అని ఒక వయిపు ఆశ్చర్యంగానూ, అసలు అవార్డు కమిటీకి తన పుస్తకాన్నెవరు పంపారా అని అయోమయంగానూ ఉంది విశ్వమూర్తి, పరశురాం గార్లలో ఎవరయినా తనకు చెప్పకుండ ఈపని చెయ్యరు ఆలోచించగా, ఇంకొక్కరు మాత్రమే ఈ పని చేసి ఉండటానికి అవకాశం ఉంది అనిపించింది

విశ్వమూర్తి ఆఫీస్‌కి రాగానే ఆయనకి విషయం తెలియజేశాడు ఆయన సంతోషం పట్టలేక వెంటనే, పరశురాంకి ఫోన్ చేశాడు "హరి వ్రాసిన పుస్తకం అనుకున్నంతగా సేల్ అవటంలేదని వర్రీ అయిపోతున్నావ్ కద రామూ! ఇప్పుడింకేం భయంలేదు కావాలంటే రీప్రింట్‌కి రేట్ కూడా పెంచెయ్యి ఫరవాలేదు ఇంతకీ అసలు విషయం చెప్పనేలేదు కదూ! నవ్య సాహితి అవార్డు అంటే ఎంత గౌరవమో తెలుసు కదూ! ఈ ఏడు ఉత్తమ నవలగా సెలక్ట్ అయింది మన పుస్తకం ఇందుకు హరికి అవార్డు వచ్చిన గౌరవంతో బాటు పదివేల రూపాయలు కాష్ ప్రైజ్ కూడా ఇస్తారు ఇప్పుడే చెప్పాడు హరిప్రసాద్ ఈ వార్తని ఏమిటీ అతన్తో మాట్లాడుతావా? ఇదుగో ఇక్కడే ఉన్నాడతను నీ ఆఫీసుకి పంపమంటావా? అబ్బే అలా వీలుకాదు అతనిప్పుడు చాలా బిజీగా ఉన్నాడు నవలలు పట్టుకుని నీ చుట్టూ తిరిగే మామూలు రచయిత అనుకుంటున్నావేమో అతన్ని" అని పరశురాంని ఫోన్లోనే అదరకొట్టేసాడు

"ఇదిగో హరీ నీతో మాట్లాడతాడట" అంటూ రిసీవర్ హరికి అందించాడు

"హలో—నమస్తే సర్ థాంక్యూ వెరీమచ్ అలాగే సండే తప్పకుండా వస్తాను"

సాయంత్రం బయలుదేరేముందు, "రాత్రికి ఇంట్లో భోజనం చెయ్యవోయ్" అని ఆహ్వానించాడు విశ్వం

"అమ్మాయికి చెప్పేశాను ఏర్పాటు చెయ్యమని నేనువచ్చేసరికి ఆలస్యమవుతుందేమో అయినా ఫర్లేదులే అమ్మాయితో మాట్లాడుతూ వుండు వచ్చేస్తాను" అని కూడా చెప్పాడు

"అలాగేనండి సరేసార్" అని తల ఊపి వెళ్లిపోయాడు హరి

ఏడుగంటలకి విశ్వమూర్తిగారిల్లు చేరాడు హరి

తలుపు తీసి ఎదురుగా నిలుచున్న రమణని చూడగానే, కళ్లు చిట్లించి, "ఏయ్ దొంగా, ఉండు నీ పని చెబుతాను" అని చేయి అంది పుచ్చుకోబోయాడు. గబుక్కున తప్పించుకుని లోపలికి పరిగెత్తి పోయింది రమణ

వెంటనే ఓ మైసూర్‌పాకం ముక్కతెచ్చి అతడి నోటికి అందించింది కొద్దిగా కొరికి, మిగిలింది ఆమె నోట్లోనే పెట్టేసి, "ఎందుకూ రాగానే స్వీటు ఇస్తున్నావ్?" అడిగాడు హరి, ఆమెని దగ్గరగా తీసుకుంటూ

"మీ నవల అవార్డుకి సెలక్ట్ అయినందుకు" తల వంచుకుని జవాబు చెప్పింది

"ఊహూ నీపనేకదూ ఇది అప్లికేషన్లో సంతకంకూడా ఫోర్జరీ చేశేశావా?"

" చెబితే ఒద్దంటారని " మెల్లిగా నసిగింది

తర్వాత మిగిలిన వంట చేస్తున్నంతసేపూ, వంటగదిలోనే కూర్చున్నాడు హరి రమణతో కబుర్లు చెబుతూ

"మీ పుస్తకాన్ని పబ్లిసైజ్ చేసేందుకు టూర్ చేయాలనుకున్నారుగా ఇప్పుడు వెళితే బావుంటుందేమో!"

"అవును. నిజమే" అనిపించింది హరికి విశ్వమూర్తితో ఆ విషయాన్ని ప్రస్తావిద్దామనుకున్నాడు

(ఇంకా వుంది)



# వ్యక్తిగతం



భారతదేశం హాకీ బృందం మాజీ కాప్టెన్ సుర్జీత్ సింగ్ జనవరి 6 మధ్యరాత్రి ప్రాంతంలో మరణించారు ఆయన అమృత్‌సర్ నుంచి జలందర్‌కి కారులో వస్తూ ఉండగా ప్రమాదం జరిగింది ఆయనతో వస్తున్న మరొకరు కూడా చనిపోయారు సుర్జీత్ సింగ్ సతీమణి శ్రీమతి చంచల్ కూడా హాకీ క్రీడాకారిణిగా పేరు పొందినవారే

నైజీరియాలో మళ్ళీ మిలిటరీ పరిపాలనని నెలకొల్పిన మేజర్ జనరల్ మహమ్మద్ బుహారీ





జియార్జియో కాలిస్పోనీనీ, అతని తల్లి అన్నానీ కొందరు దొంగలు ఎత్తుకుపోయారు బాగా డబ్బు ఇస్తేనే విడిపిస్తామన్నారు తమ కోరికని బలపరిచేందుకు జియార్జియో చెవిని ఒక దానిని కోసి పంపారు ఎలాగయితేనేమి తల్లీ, కొడుకూ ఇద్దరూ విడిపించబడ్డారు



ఒక రోడ్డు ప్రమాదంలో హృదయ రాజ్ కేశవ్(26) తలలోకి ఇనుపచువ్వ చొచ్చుకుపోయి మెదడులో దిగబడింది డాక్టర్లు శస్త్రచికిత్స చేసి దాన్ని తీసివేసి, దెబ్బతిన్న మెదడులోని భాగానికి అతని తొడపై చర్మాన్ని తీసి అతికారు మృత్యుముఖంనించి వెంట్రుకవాసిలో తప్పించుకొన్న అతను ఇప్పుడు పూర్తిగా కోలుకున్నాడు ఇది ఎంతో అత్యద్భుతమైన విషయం అని డాక్టర్లు అన్నారు

# వారఫలం

3-2-1984 శుక్రవారం మొదలు 9-2-1984 గురువారం వరకు

♈ మేషం అనవసరంగా అపవాదులు రాగల సూచనలున్నాయి వస్తువులో, ముఖ్యమయిన కాగితాలో, పోగొట్టుకొనే అవకాశమున్నది ధనం ధారాళంగా ఖర్చు చేయవలసిన పరిస్థితులుంటాయి. ఇతరులు మీ సాయాన్ని కోరగలరు స్త్రీలకు నూతన నాంశాలు గ్రహింపగలరు

♉ వృషభం వృత్తి వ్యాపారాలు గత వారం కన్నా సుకరంగా ఈవారం నెరవేరగలవు లౌకిక వ్యవహారాలందు విజయం సాధింపగలరు చాల కాలంగా వివాద గ్రస్తమయిన ఆస్తి వ్యవహారం పరిష్కారం కాగలదు మధ్యవర్తిత్వమే లాభదాయకమని గ్రహించగలరు స్త్రీలకు ధనాదాయమున్నది.

♊ మిథునం సులభంగా ఒకానొక విషయం నెరవేరనున్నది రుణదాతలవత్తిడి అధికం కాగలదు ఇంతకుముందు చేసిన యత్నాలు, ఈవారం సఫలం కాగలవని గ్రహింపగలరు ఇతరులకు ఒకానొక విషయంలో సహాయపడవలసిన బాధ్యత ఏర్పడుంది వ్యాపారం సుకరంగా సాగిపోగలదు స్త్రీలకు ఉద్యోగయత్నాలు సఫలం

♋ కర్కాటకం ఈ వారం యితరుల సహాయం లేకుండా కొన్ని పనులు నెరవేరనున్నాయి సంతోషదాయకమైన వారమే శుభ ప్రస్తావనలకు అవకాశమున్నది ఒకానొక విషయంలో స్థిరత్వం ఏర్పడుతుంది కొందరు ఆహార ధాన్యాలు కొనుగోలు చేయగలరు స్త్రీలకు ఓర్పుతో మెలగవలసిన వారం, గ్రహించాలి

♌ సింహం ఎంత మంచిగా మెలగినా, ఎంత మధురంగా మాట్లాడినా, అనవసరంగా అపనిందలో, తగాదాలో నెత్తికి రాగలవు ఒకానొక విషయంలో చాల ప్రశాంతంగా మెలగవలసిన సమయం 'కోర్టు' వ్యవహారాలలో యితరుల సాయం అపేక్షింపదగిన వారం స్త్రీలకు బంధువుల రాకతో, ఉద్యోగ నిర్వహణతో సతమతం కాగల దినాలు

♍ కన్య ఉత్సాహ జనకమైన వారం ఉద్యోగ యత్నాలు సత్ఫలదాయకాలు కావలసిన వారం నూతన మిత్రులను కలిసికొనుటకు అనువైన సమయం. అధిక లాభార్జనకు యత్నించి నిరుత్సాహం చెందగలరేమో, గ్రహించి మెలగండి స్త్రీలకు అన్ని విధాలా అనుకూలదాయక వారమే గౌరవం, సభాసమావేశాలలో పాల్గొనుట కొందర విషయంలో చెప్పదగిన అంశం

♎ తుల డబ్బు అనవసరంగా ఖర్చు చేయవలసిన వారం వాహన సంపాదనా యత్నమే గాని సమకూర్చుకోగలరను ఆశ ఈ వారం లేదు బిడ్డల అభివృద్ధిని గోరి చేసే యత్నాలు ఫలదాయకాలే స్త్రీలకు చాలమంది ఆరోగ్య విషయంగా జాగ్రత్త పడాలి

♏ వృశ్చికం వస్తువులు సంపాదించుకొనుటకు, నూతన మిత్రులతో సంభాషిచుటకు, చాల కాలంగా జరుగని పనులు సాధించుకొనుటకు, 'జాయింటు' వ్యాపారంలో అనుకూలత సాధించుటకు అవకాశం గలవారం స్త్రీలకు యథావిధిగా జరుగవలసిన పనులకు యిబ్బంది లేదు ద్రవ్యాదాయమున్నది కళారంగ ప్రసిద్ధి ఏర్పడుతుంది, గ్రహించాలి

♐ ధనుస్సు స్థిరాస్తి పెంపకమునందు శ్రద్ధ వహించాలి అప్పులు వసూలు చేసికొనుటయందు శ్రద్ధ వహించాలి సభా కార్యక్రమమందు పాల్గొనుట కొందరకు అనివార్యమవుతుంది ఉద్యోగ వ్యాపారాలు శ్రమకరంగా సాగగలవని గ్రహించాలి స్త్రీలకు బిడ్డల శుభకార్య ప్రస్తావనలందు, ప్రయత్నాలందు శ్రద్ధ ఏర్పడుతుంది

♑ మకరం చాలమంది వ్యాపార నిమిత్తమూ, వ్యవహార పరిష్కారం కొరకో దూర ప్రాంతాలకు ప్రయాణించవలసిన అగత్యం ఏర్పడుతుంది నిర్ణయించిన కార్యక్రమమందు ఎగుడు దిగుడు పరిస్థితులుంటాయి నూతనంగా వ్యాపారం సాగించాలనే ప్రయత్నం మానుకోవటం శ్రేయస్కరం, గ్రహించాలి స్త్రీలకు ఉత్సాహ జనకమైన వారం

♒ కుంభం సంఘంలో గాని, మిత్రులకు గాని, బంధు వర్గానికి గాని, ఏవైనా అక్రమాలు జరుగుతూ ఉంటే చూస్తూ ఊరుకోలేరు చాల ఆసక్తితో దైవకార్యాలు నెరవేర్చుకోగలరు వ్యాపార యత్నాలలో ఈవారం లాభదాయకమైన వారం స్త్రీలకు ఆస్తి పెంపకానికి, ఉద్యోగ మార్పులకు అవకాశమున్నది

♓ మీనం మీరు చేసే వ్యాపారంలో ఈవారం అనవసరమైన యిబ్బందులు కనిపిస్తాయి, ఎదుర్కొనవలసిన అవసరం ఏర్పడుతుంది సంఘకార్య నిమగ్నతతో కాలం వ్యయించవద్దు వ్యాపార విస్తరణకు యత్నించటం ఏమంత సుకరమైన వారం గాదు, 'శని గురుగ్రహాలు' ఆశించిన మేలు సమకూర్ప నున్నారు, గ్రహించండి

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి

# The stove that not only glows but glitters



STAINLESS STEEL

# chetak

## Gas Stove

IS : 4246



**Highlights :**

* Perfectly Engineered
* Swiss Technology Control Valve for Prevention of Gas leakage
* Plated Burner Tops  Rust free
* Better fuel efficiency
* Economically Priced

**DISTRIBUTORS FOR ANDHRA PRADESH**
MADICON INDO-INTERNATIONAL
1-10-197/4 First Floor, Ashok Nagar X Roads
Hyderabad 500 020 A P INDIA
Phone 61286 64757 Grams MADICON

**PRODUCT OF**
**JAINCO INDUSTRY**
NEW DELHI

MAYURA

ప్రసిద్ధి చెందిన హిందుస్థాన్ పెట్రోలియం, భారత పెట్రోలియం మరియు ఇండియన్ గ్యాస్ డీలర్లవద్ద కూడ లభించును.

# ఛాలెంజ్!

ఎ.యం. అయోధ్యారెడ్డి



"గురూ! మన ఆఫీసరుగారికి క్రికెట్ కామెంటరీ వినే అలవాటుందా ?" జారిపోతున్న ఉత్సాహాన్ని కూడగట్టుకుంటూ తన చుట్టూ మూగినవార్ని ప్రశ్నించాడు ఎల్డీసీ రాంబాబు

"ఏంటి మహాత్మా అట్నుంచి నరుక్కొద్దామనుకుంటున్నావా ? లాభంలేదు నాకు తెల్సినంత వరకూ ఆయనకా పిచ్చిలేదు—" అన్నాడు టైపిస్టు రంగారావు మరో మార్గం వెతుక్కోమన్నట్లుగా రాంబాబు వంక చూస్తూ

"ఏమో! ఆయనకా పిచ్చి వుందేమో యెవడు చూశాడు ?" అనుమానం వ్యక్తం చేశాడు డిస్పాచ్ క్లర్క్ రామనాథం కళ్ళద్దాలను కర్చీఫ్‌తో తుడుచుకుంటూ

"నేను చాలాసార్లు చూశాను గురూ! ఆయనగారి ఛాంబరులో యెప్పుడూ ట్రాన్సిస్టర్ వున్నట్లుగా గుర్తులేదు అయినా ఆ కర్కోటకుడికి అంత హ్యూమర్ కూడానా ? అసలు క్రికెట్ అనే ఆటొకటుందనీ, దానికి రన్నింగ్ కామెంటరీ ప్రసారం చేస్తారనీ, జనం దాన్ని వదలకుండా వింటారనీ యింకా "

"అబ్బా నీ సుత్తి కొంచెం ఆపవయ్యా వెంకట్రావూ "అంటూ యుడీసీ వెంకట్రావు మాటల్ని మధ్యలోనే అడ్డుకున్నాడు సెక్షనాఫీసరు రమణారెడ్డి

అతనిమీదున్న గౌరవంవల్ల వెంట్రావుతో సహా అంతా మౌనం వహించారు రమణారెడ్డి లేచాడు తన టేబుల్ వద్దనుంచి కదిలి రాంబాబు దగ్గర కొచ్చాడు పాంటు జేబుల్లో వుంచుకున్న రెండు చేతుల్లోంచి కుడిచేతిని కొద్దిసేపటికోసం బయటకు తీసాడు ఆ కుడి చేతిని తీసుకెళ్ళి రాంబాబు భుజంమీద వేసి అలవోకగా తట్టాడు— "నీకు సెలవు కావాలి కదూ రాంబాబూ !" అన్నాడు స్టైల్‌గా నిలబడుతూ

"అవునుసార్ చాలా అర్జంటు—"

"ఎందుకోయ్ ?"

"మా మరదలు పెళ్ళి సార్ ! ఇవిగో శుభలేఖలు" చంకలో ఉన్న శుభలేఖల కట్టనోసారి అందరికీ చూపిస్తూ అన్నాడు

"ఎన్ని రోజులు కావాలి ?"

"కనీసం వారం రోజులు సార్ !"

"అబ్బా అన్ని రోజులెందుకోయ్ ?"

"పనులు సార్ ! ఊపిరి సలుపనివ్వని పనులున్నాయి ఈ పెళ్ళికి అన్నీ నేనే సార్ ! దగ్గరుండి చూసుకోవాలి పెళ్ళంటే ఊరికే అవుతుందా సార్ !"

"ఐసీ !" రమణారెడ్డి రాం బా బు భుజంమీద వేసిన తన కుడిచెయ్యి వెనక్కి తీసేసుకున్నాడు మరోక్షణంలో అది పుట్టలోకి దూరిపోయిన పాములా అతని పాంటు జేబులోకి వెళ్ళిపోయింది

రమణారెడ్డి ఒక్క సీట్లో కూర్చునప్పుడు తప్ప — నిలబడి వున్నపుడూ, నడుస్తున్నపుడూ అతని చేతులు బయటుండటం ఎవ్వరూ చూడ లేదు అసలతను పాంటుజేబులు రెండూ చేతులుంచుకోడానికే కుట్టిస్తాడని అనుకొంటా రందరూ

"చూడు మిస్టర్ రాంబాబూ ! మన ఆఫీసరుగారి పేరేమిటో నీకు తెలుసా ?" రమణారెడ్డి ప్రశ్నించాడు

"తెలుసండీ వినాయకరావుగారు —"

"అసలు పేరు కాదు మన ఆఫీసులో వాడుకలో ఉన్నది —"

"కర్కోటకుడు— " ఈసారి రాంబాబు కాకుండా మరెవరో చెప్పారు జవాబు

"కరెక్ట్ ! మరి మన కర్కోటకుడెంత స్ట్రిక్టో కొత్తగా ఈ ఆఫీసుకొచ్చావు గనుక నీకు తెలియకపోవచ్చు అతను మస్కారాయుళ్లను చాలా దూరంగా ఉంచుతాడు తప్పుచేసి నంగి నంగి జవాబులు చెప్పినా, సెలవుకోసం డొంక తిరుగుడు కారణాలు చూపించినా అసలు కే మోసం వొస్తుంది అన్యాయాన్ని సహించడు అవినీతి అంటే వాంతి చేసుకుంటాడు మిలటరీ లోంచి వచ్చిన మనిషి అతను—అండర్‌స్టాండ్ ?"

"మరెలాగ సార్ ? మన టెక్నిక్ యేదీ ఆయనమీద పన్చేయదంటారా ?" అన్నాడు నిరాశగా రాంబాబు

"అవును ! మియర్ వేస్ట్ ముఖ్యంగా ఇందాక నువ్ చెప్పావే — క్రికెట్ టెక్నిక్— అది అస్సలు పన్చెయ్యదు ఆ విధంగా నువ్వతన్ని ఎక్స్‌ప్లాయిట్ చెయ్యలేవు ఆయనకి క్రికెట్ పిచ్చి వుందనుకున్నా నువ్వేం చేస్తావ్ ? కపిల్‌దేవ్ గొప్ప కేప్టెనండీ అంటావు వరల్డ్ కప్ గెలవటం మన ఇండియాకే గర్వకారణం సార్ అంటావు ఇంకా గవాస్కర్ తిరిగి ఫామ్‌లోకి వొస్తాడనీ, రాబోయే పాకిస్తాన్ జట్టును మనవాళ్ళు చిత్తుగా కొట్టేస్తారనీ ఏమేమో చెబుతావు—అవునా ? ఇదంతా విని సింపుల్‌గా ఆయనేమంటాడో తెలుసో ? ఐనో ఆల్ దీజ్ థింగ్స్ ! యుకెన్ గో అవుట్ అని — వింటు న్నావా ?"

— ఈ మాటలు చెప్పి రమణారెడ్డి వెళ్లి తన సీట్లో కూర్చున్నాడు

ఆయనతోపాటు రాంబాబు చుట్టూ నిలబడ్డ స్టాప్ కూడా కదిలి యెవరి సీట్లలోకి వాళ్లు చేరిపోయారు

"సార్ ! మా మరదలు పెళ్లిసార్ !" మళ్లీ అన్నాడు రాంబాబు దీనంగా, ఆఫీసరుగారి మూసివున్న ఛాంబర్ తలుపుల వంకా, రమణారెడ్డి వంకా మార్చి మార్చి చూస్తూ

రమణారెడ్డి యేదో రాయబోతున్న వాడల్లా ఆగాడు — "నిన్ను చూస్తే జాలేస్తుందోయ్ రాంబాబూ ! మరదలు పెళ్లి కాదుగదా నీ కూతురు పెళ్లి అన్నా ఆ కర్కోటకుడు సెలవు ఇవ్వడు కనుక భగీరథ ప్రయత్నాలు మాని నీ పని చూసుకోవటం మంచిది "

"సార్ ! కనీసం రెండ్రోజులు మీరే ఎలాగైనా యిప్పించాలి సార్ "

"నో నెవ్వర్ ! ఆ కర్కోటకుడి అందరూ వొక్కటే ఐకాంట్ హెల్ప్—"

స్టాపంతా జాలిగా చూశారు రాంబాబు వంక

రాంబాబు అవమానం ఫీలయ్యాడు మొహం కందగడ్డలా అయ్యింది ఆగ్రహంతో టేబుల్ మీద పిడికిలి బిగించి ఒక్కగుద్దు గుద్దాడు ఆ చప్పుడుకి అదిరిపడి అంతా అతని కేసి చూశారు

—"మీరెవరూ సాయం చెయ్యకుండానే నేను వారం రోజుల లీవ్ గ్రాంట్ చేయించుకుంటాను చూస్తారా ? మీకు దమ్ములుంటే నాతో ఛాలెంజ్ చెయ్యండి" బిగ్గరగా అరిచాడు

ఈ మాటకి ఆఫీసులో అంతా ఒకరి మొహాలొకరు చూసుకున్నారు రాంబాబుకి మతిగానీ చలించిందేమోని అనుమానంగా చూశాడు సెక్షన్ ఆఫీసరు రమణారెడ్డి

"ఆర్‌యూ ఆల్ రైట్ మిస్టర్ రాంబాబూ ?" అని ప్రశ్నించాడు

"యస్ సార్ ! ఐయామ్ క్వయిట్ ఆల్‌రైట్ లెట్ మీనో ఎనీబడీ గోయింగ్ టు ఛాలెంజ్ మీ" యింకా బిగ్గరగా అరిచాడు రాంబాబు టేబిల్ మీద మరో గుద్దు గుద్దుతూ

అతని అవతారం చూసి బిల బిల మంటూ మళ్లీ స్టాపంతా రాంబాబు చుట్టూ మూగి పోయారు రమణారెడ్డి కూడా లేచి జేబుల్లో చేతులుంచుకొని బూట్లు టక టక లాడించు కొంటూ నడిచొచ్చాడు

"బి బోల్డ్ మై బోయ్ !" అన్నాడు అతన్ని శాంత పర్చడానికి

"నో ! నాటెటాల్ ! చెప్పండి ఎవరు ఎంత ఛాలెంజ్ చేస్తారు నాతో —" వెనక్కి తగ్గకుండా అన్నాడు రాంబాబు

"ఓకే ! నీకంత తిమ్మిరిగా వుంటే నా వంతు పందెం ఇరవై రూపాయలు నువ్‌గనుక వారం రోజులకి లీవ్ గ్రాంటు చేయించుకొస్తే ఈ ఇరవై నీవి లేదా మరో ఇరవై నువ్ నాకివ్వాలి—" యూడీసి వెంకట్రావ్ డబ్బును మధ్యవర్తిగా సెక్షనాఫీసరుకి అంద జేస్తూ అన్నాడు

"నా వంతు పందెం పాతిక "

"నా వంతు ముప్పయ్ "

"నా వంతు ఏభయ్ —"

దాదాపు ఆఫీసు స్టాపంతా పందెం కాసారు డబ్బంతా రమణారెడ్డిగారి చేతిలో చేరిపోయింది

"మరి మీ మాటేమిటి ? మీరు పందెం కాయరా సార్ ?" అన్నాడు నిబ్బరంగా చూస్తూ రమణారెడ్డి నుద్దేశించి రాంబాబు

"ఓయస్ ! వై నాట్ ! కానీ నీ మొండిధైర్య మేమిటో నా కర్థం కావటం లేదు రాంబాబూ ! మరదలు పెళ్లికి ఈ ఆఫీసు లోనే కాదు మరే ఆఫీసులోనూ వారం రోజులకి సెలవు ఇవ్వరు నువ్ ఓడిపోతే ఇంతమందికి డబ్బు చెల్లించాల్సి వొస్తుంది ఇవ్వకపోతే నీ జీతంలోంచి కట్ చెయ్యాల్సి వొస్తుంది తెలుసా ?"

"తెలుసు సార్ !" చిరునవ్వుతో అన్నాడు రాంబాబు — "ఇంతకీ మీ బెట్ సంగతేమిటి ?"

"నా వంతు బెట్ వంద రూపాయలు —" అన్నాడు రమణారెడ్డి

"ఓకే సార్ ! ఆ మొత్తం డబ్బు



### గ మ ని క

పాఠకులు పడ్డ వంటలే పడితే "ఎప్పుడూ అవే వంటలా ?" అంటారు. కనుక 'వంటలు' పంపే వారు ఓసారి పాత సంచికలు తిరగేసి అందులో లేనివి వ్రాసి పంపమని— సాధ్యమైనంత క్లుప్తంగా వ్రాయమని మనవి.

—సం.

### 'ఉత్తరాలు' శీర్షికకి రాసేవారు

తమపేరు, పూర్తి చిరునామా తెలుగు లిపిలో రాయాలని మనవి చేస్తున్నాము.

—సంపాదకుడు.

## ఛాలెంజ్ !

ఎంతయిందో ఒక్కసారి లెక్కించండి. ఈలోగా లీవ్ అప్లికేషన్ రాస్తాను—'' అన్నాడు రాంబాబు కాగితం కలం తీసుకుంటూ.

ఆఫీసులో వాళ్ళంతా చోద్యం చూస్తున్నట్లుగా వుండిపోయారు. అందరికీ రాంబాబో వింత జంతువులా అగుపించాడు.

రమణారెడ్డి డబ్బు లెక్కించాడు. మొత్తం నాలుగు వందల తొంభై రూపాయలున్నాయ్. ఈలోగా రాంబాబు అప్లికేషన్ రాయటం పూర్తిచేశాడు.

''మొత్తం ఫోర్‌నైన్టీ రూపీసోయ్—''
చెప్పాడు రమణారెడ్డి.

''ఓకే సార్ ! మరి నేను వెళ్లిరానా ఆఫీసరు ఛాంబర్‌లోకి ?'' అన్నాడు రాంబాబు వెళ్ళడాని కుద్యుక్తుడవుతూ.

రమణారెడ్డి చెయ్యి కుడివైపు పాంటు జేబులోంచి మరోసారి బైటకొచ్చి రాంబాబు భుజంమీద పడింది— ''డోంట్ బి చైల్డిష్ రాంబాబూ...! మరోసారి ఆలోచించు. నీకు లీవ్ ఎట్లాగూదొరకదు. ఎంతో పెద్ద కారణముంటే తప్ప వారం రోజుల సెలవు నీకీ సమయంలో దొరకడం ఇంపాసిబుల్. నా మాట విని బెట్ వెనక్కి తీసుకో. లేకపోతే చాలా నష్టపోతావ్—''

''నో... నెవ్వర్‌సార్...!'' రాంబాబు రఫ్‌గా ముందుకి నడిచాడు. స్వింగ్ డోర్స్ నెట్టుకొని ఆఫీసరుగారి గదిలో జొరబడ్డాడు. తలుపులు వెనకనుంచి మూసుకున్నాయి. ఊపిరి బిగపట్టుకొని స్టాఫంతా అటు చూడసాగారు.

* * *

పదిహేడు నిముషాల తర్వాత ఛాంబర్ తలుపులు తెర్చుకొని బయటకొచ్చాడు రాంబాబు. చకచకా నడుస్తూ సెక్షన్ ఆఫీసరు రమణారెడ్డి టేబుల్ ముందుకి పోయాడు. తను తెచ్చిన అప్లికేషన్ ఆయన ముందు పడేస్తూ— ''సార్ ! కర్కోటకుడుగారు వారం రోజులకి కాదు పది రోజులకి సెలవు గ్రాంట్ చేసారు. కావాలంటే చూస్కోండి. అలాగే ఆ పందెం డబ్బు కూడా ఇలా పారేయండి'' అన్నాడు.

కాగితాన్ని చదివిన రమణారెడ్డి ఉసూరు మన్నాడు. కళ్ళద్దాలు సవరించుకొంటూ నమ్మలేనట్లుగా రాంబాబు వంక చూశాడు. క్షణాల మీద ఆ అప్లికేషన్ కాగితం ఆఫీసు స్టాఫ్ అందరి చేతులూ మారంది.

అందర్లోంచి నిరాశగా నిట్టూర్పులు వెలువడ్డాయి—

నమ్మకపోవడానికీ ఆస్కారం లేదు. ఆకు పచ్చటి అక్షరాలతో పదిరోజులకి సెలవు గ్రాంటు చేసినట్లుగా రాసుంది దానిమీద. కింద కర్కోటకుడి సంతకం కూడా వుంది.

''ఎలా సాధించావోయ్...? కొంపతీసి కత్తిగానీ చూపించి బెదిరించలేదుకదా ?'' అన్నాడు అందర్లోకి తనే ముందు మాట్లాడుతూ రమణారెడ్డి.

''ముందా పందెం డబ్బు యిలా పారేయండి సార్ ? తర్వాత చెప్తాను—''

అతని నిరుత్సాహమాటానికి ఒకపక్క వొళ్ళు మండుకొచ్చినా చేసేదిలేక నోట్లు లెక్కబెట్టి ఇచ్చాడు. రాంబాబు సంతోషంగా డబ్బు జేబులో పెట్టుకొంటూ అందర్నీ ఓమారు పరిశీలనగా చూసి అన్నాడు—

''మా మరదలు పెళ్ళని నేనెంత చెప్పినా మీరు పట్టించుకోలేదు. చాలా చిన్న కారణంగా దాన్ని త్రోసిపారేసారు. మా మరదలెవరో తెలుసా మీకు...? ఆమె మరెవరోకాదు ఈ కర్కోటకుడి

యువభారతి 20వ వార్షికోత్సవ సందర్భంగా ఇటీవల జరిగిన 'సంస్కృత సాహితీ లహరి' కార్యక్రమంలో 'నాగానందం' నాటకాన్ని గురించి ప్రసంగిస్తున్న శ్రీ ఘనశ్యామల ప్రసాదరావు, డా. సి. నారాయణరెడ్డి, శ్రీ ఎల్. మాలకొండయ్య, శ్రీ అవధానం చంద్రశేఖరశర్మ, డా. ఇరివెంటి కృష్ణమూర్తిగార్లని చిత్రంలో చూడవచ్చు.



## హైదరాబాద్ నోట్‌బుక్

### మహా మహోపాధ్యాయ నూకల చినసత్యనారాయణ :

హైదరాబాద్ సంగీత కళాశాల ప్రిన్సిపాల్, మహా మహోపాధ్యాయ శ్రీ నూకల చినసత్యనారాయణగారు ఇటీవల దక్షిణ, ఉత్తర అమెరికాలలో ఆరునెలలపాటు జరిపిన సంగీత జైత్రయాత్రకు ఒక ప్రత్యేకత ఉంది నూకలవారు అమెరికాలో కర్నాటక సంగీత విద్యార్థుల శిక్షణ కోసం దాదాపు 30 క్యాసెట్లు, వీడియో క్యాసెట్లు అందజేసి వచ్చారు ఇవి అక్కడి సంగీత ప్రియులైన భారతీయులకు, అమెరికనులకు ఎంతగానో ఉపయోగపడుతాయి నూకలవారు వాషింగ్టన్‌లో గడిచిన మే 28, 29 తేదీలలో జరిగిన ఉత్తర అమెరికా తెలుగు సంఘం ద్వితీయ మహాసభలో గానకచ్చేరీ జరుపడానికి వెళ్లారు ఆయన గానసభను ఆస్వాదించిన శ్రోతలు ఉత్తర దక్షిణ అమెరికాలలో మరికొన్ని కచ్చేరీలు జరుపండని కోరారు ఆయన వయోజన సంగీత విద్యాశిక్షణ అక్కడి తెలుగు వారిని ముగ్ధులను చేసింది డాక్టర్‌మున్న, ఆయన శ్రీమతి డాక్టర్ సీతాలక్ష్మిగార్లకు ఈ పద్ధతి బాగా నచ్చింది డాక్టర్ సీతాలక్ష్మికి నూకలవారు శిక్షణ ఇవ్వడం ప్రారంభించారు దానిని పిట్స్‌బర్గ్ శ్రీ వేంకటేశ్వరాలయం నిర్వహణ సంఘం రికార్డు చేసింది ఉన్నత శిక్షణకు డాక్టర్ సీతాలక్ష్మి, ప్రారంభ శిక్షణకు మంజులమున్న, అనితా చెన్నపాటి విద్యార్థినులు నూకలవారు త్యాగరాజ పంచరత్న కీర్తనలపై విడిగా మూడు, 72 మేళకర్తలపై నాలుగు, 31 రాగాలపై రెండు క్యాసెట్లు సిద్ధపరచారు గడచిన ఆగస్టు 6న పిట్స్‌బర్గ్ వేంకటేశ్వరాలయంలో జరిపిన రెండుగంటల కచ్చేరికి విడిగా కొన్ని క్యాసెట్లు, వీడియోలు తయారయ్యా వీటి హక్కులన్నీ వేంకటేశ్వరాలయంవే ఎన్నో అమ్ముడుకూడపోయాయి డాక్టర్‌మున్న, డాక్టర్ సీతాలక్ష్మిమున్నగార్లు వేంకటేశ్వరాలయం నిర్వహణ సంఘంలో సభ్యులు కావడం వల్ల, ఆలయానికి మేలైన రికార్డింగ్ యంత్ర పరికరాలు వున్నందున ఇదంత సాధ్యమయింది

అమెరికాలో నూకలవారు కర్నాటక సంగీత ప్రచారానికి చేసిన మరొక గొప్ప కృషి ప్రిన్స్‌టన్, కొలంబియా, కొలరాడో, డెన్వర్, విస్కాన్సిన్ మున్నగు విశ్వవిద్యాలయాలలో ప్రదర్శక ప్రసంగాలు జరుపడం విస్కాన్సిన్ విశ్వవిద్యాలయం సంగీత శాఖ ప్రసంగానికి చాల సంతోషించింది డెన్వర్ విశ్వవిద్యాలయంలో మూర్ల రారు అమెరికా విద్యార్థులు సహజంగా మోహనరాగంలోని 'నిరజ దళ నాయన' కీర్తనను పాడేట్టు చేశారు నూకల వారు అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని 30 రాష్ట్రాలలోను, కెనడాలో టొరంటో, అట్టావా, మాంట్రీల్‌లలోను మొత్తం 60 కచ్చేరీలు చేశారు అక్కడివారు పాశ్చాత్య సంగీతంపై ఆదరం వున్నా, కర్నాటక సంగీతం పట్లా ఎంతో ఆసక్తి చూపి ఆనందించారు కచ్చేరీలు శ్రోతలతో కిటకిటలాడాయి నూకలవారి సేవను గుర్తిస్తూ, పిట్స్‌బర్గ్ వేంకటేశ్వరాలయ నిర్వాహకులు



ఆయనను 'ఆస్థాన సంగీత విద్వాన్' పదవితో గౌరవించారు న్యూయార్క్ హిందూ దేవాలయం వారు, హరేరామ హరేకృష్ణ బృందావన్ దేవాలయం వారు ఆయనను సన్మానించారు అక్కడ జీవితం ఉత్సాహకరంగాను, ఫలవంతంగాను వుందని, వాతావరణం కాలుష్యరహితంగాను, ఆహారం పుష్టికరంగాను, రోడ్లు విశాలంగాను, శుభ్రంగాను ఉన్నవని, ప్రతి ఇంటికీ పచ్చికబయలు వుందని ఆయన తెలిపారు తరాల అంతరం కన్పిపిస్తుందన్నారు అక్కడి డాక్టర్ కె వి విశ్వనాథన్ వారం వారం రేడియోలో సంగీతం గురించి కార్యక్రమం నిర్వహిస్తారు ఆయన నూకల వారి ప్రసంగాలను రేడియో కోసం సిద్ధపరచారు నూకల వారు కే జి ఎన్ యు రేడియో కోసం 'గంగ నుంచి నైలుకు' అనే శీర్షిక కింద సంగీత కార్యక్రమం రూపొందించారు చికాగో కచ్చేరీలో డాక్టర్ కృష్ణమూర్తి అనేవారు 50 డాలర్లు, మరొకరు 50 డాలర్లు బహూకరించారట శాన్‌ఫ్రాన్సిస్కోలో డాక్టర్ మాధవన్ కుట్టీ ఏర్పాటు చేసిన కచ్చేరీకి 200 మంది సంగీత విద్యాసులు వచ్చారట డెన్వర్‌లో నూకల రేడియోలో పాడారు అక్కడి గొప్ప క్షయరోగ పరిశోధకులు డాక్టర్ గంగాధరం ఈయన శిష్యులయ్యారు హ్యూస్టన్‌లో శ్రీలాల్‌గుడి జయరామన్ నూకల వారిని చూచి, తన కచ్చేరీని ఆపి, ఆయన రాక తనకొక గౌరవమని ప్రకటించారు నూకలవారు 1983 మే 24 నుంచి నవంబర్ 4 వరకు సంగీత జైత్రయాత్ర జరిపి భారతదేశానికి తిరిగి వచ్చారు

### ఉపశ్రుతి :

ఏంసార్, మీ తెలుగువారు భగత్‌సింగ్‌ను భగవత్‌సింగ్ అంటారు, భగవత్‌ఝా ఆజాద్‌ను భగత్‌ఝా ఆజాద్ అని అంటారేమిటి ? — అనడిగాడు ఒక హిందీ మిత్రుడు వెర్రివాడా, భక్తునికీ, భగవంతునికీ చివరికి భేదం సమసిపోతుంది కదోయ్ ! — అన్నారు మా మాటలు వింటున్న ఒక అద్వైతి ★

---

రెండో కూతురే వరుసకి నాకు మరదలు అవుతుంది—''

''మైగాడ్ ! ఎంత నాటకమాడావోయ్'' ఒక్కసారిగా నోరు తెరిచారందరూ

''అయితే ఆఫీసరుగారికి నువ్ బంధువన్న మాట —''

''అవును —'' చిరునవ్వుతో అన్నాడు రాంబాబు

''అయితే మాత్రం ? కర్కోటకుడికి బంధుప్రీతి నచ్చదే నీకు పెళ్లి కూతురు వరుసకి మరదలైనంత మాత్రాన, ఆమె ఆఫీసరుగారి కూతురైనంతమాత్రాన, నీకిన్ని రోజుల సెలవు యెలా గ్రాంట్ చేశాడు ? ఇందులో ఏదో తిరకాసు వుంది—'' అప్పటికీ నమ్మకుండా తీక్షణంగా చూస్తూ అన్నాడు రమణారెడ్డి

ఈ మాటకి రాంబాబు బిగ్గరగా నవ్వాడు

''యూ ఆర్ జీనియస్ సార్ !'' అంటూ రమణారెడ్డికో మెచ్చికోలు కామెంట్ పాస్ చేసి, చంకలోవున్న వెడ్డింగ్స్ అందరికీ పంచిపెట్టాడు

''మోసం ! ఇదన్యాయం !!'' శుభలేఖలు చూసుకున్న వారందరూ ఒక్కసారిగా గొల్లుమన్నారు.

''బ్లడీ ఇడియట్ !'' గొణుక్కుంటూ ఆగ్రహంతో తలెత్తాడు రమణారెడ్డి

అప్పటికే రాంబాబు ఆఫీసు వొదిలేశాడు ఇంతకీ ఆ శుభలేఖలో ఏముంది ??

వెరీ సింపుల్ ! రాంబాబు చెప్పినవేవీ అబద్ధాలుకావు అతని మరదలు పెళ్లి మాట నిజమే ఆ మరదలు తండ్రి కర్కోటకుడుగారే నన్నమాట కూడా నిజమే

ఎటొచ్చీ వరుడు మాత్రం మన రాంబాబే !! ★

# ఆంధ్రపత్రిక

## చందా వివరాలు

| | ఏజంటు ద్వారా | పోస్టు ద్వారా |
|---|---|---|
| 1 మాసం | 15–40 | 17–30 |
| 3 మాసములు | 46–20 | 51–90 |
| 6 మాసములు | 92–40 | 103–80 |
| 1 సంవత్సరం | 184–80 | 207–60 |


*Printed and Published by S Nageswara Rao at the Andhra Patrika Press Mallikarjuna Rao Street Gandhinagar Vijayawada-3*
*Editor S Radhakrishna*


## అవీ–ఇవీ–అన్నీ

### నూతలపాటి సాహితీ సత్కారం రచయిత(త్రు)లకు విజ్ఞప్తి

గంగాధరం సాహితీ కుటుంబం (రిజి) చిత్తూరు, "నూతలపాటి సాహితీ సత్కారం" పేరుతో ప్రతి సంవత్సరం మే 29న యిచ్చే రు 116/– అవార్డుకోసం తమ రచనలు పంపదలచిన రచయిత(త్రు)లు క్రింది సూచనలు పాటించాలని కార్యదర్శి ఎస్ మునిసుందరం తెలియజేస్తున్నారు

1 కథా సంకలనాలకు యీ సంవత్సరం అవార్డు యిస్తారు

2 కథా సంకలనం రచయిత ఒకరే అయి వుండాలి వివిధ రచయితల సంకలనం అవార్డుకు స్వీకరించబడదు

3 అనువాదాలు, ప్రాత ప్రతులు పంపరాదు

4 కథా సంకలనం ప్రథమ ముద్రణ జనవరి 1981 నుండి డిశంబరు 83 లోగా జరిగివుండాలి ప్రథమ ముద్రణ కాపీ పంపాలి గడువులోపల మా కందిన పుస్తకాలనుండే ఉత్తమ సంకలనం ఎంపిక జరుగుతుంది

5. ప్రచురణ కర్తలుకూడా పుస్తకాలు పంపవచ్చు అయితే అవార్డు రచయితకే యివ్వ బడుతుంది

6 పరిశీలనకై నాలుగు ప్రతులు 15–3–84 లోగా 'కార్యదర్శి, గంగాధరం సాహితీ కుటుంబం (రిజి) 3–4–124, గిరింపేట, చిత్తూరు–2' అన్న చిరునామాకి పంపవలసిందిగా సంస్థ కార్యదర్శి కోరుతున్నారు

### "వారు అర్హులు కారా?" నాటిక ప్రదర్శన

దాసరి కల్చరల్ అసోసియేషన్‌వారు ఇటీవల హైదరాబాదు రవీంద్ర భారతి మినీ థియేటర్‌లో "వారు అర్హులుకారా?" నాటికను ప్రదర్శించారు అందరూ ఉస్మానియా ఇంజనీరింగు విద్యార్థులే నటించిన ఈ నాటికను ప్రసిద్ధ రచయిత, ఒరిస్సాలో అసిస్టెంట్ డ్రగ్ కంట్రోలరుగా పనిచేస్తున్న శ్రీ పి సూర్యప్రకాశరావు రచించారు ఇంజనీరింగు విద్యార్థి శ్రీ కె కె రాజా దర్శకత్వం వహించారు శ్రీ బ్రహ్మానందం సంగీతం సమకూర్చారు శ్రీయుతులు రఘు, పి ఆర్ బాబు, జాన్ మదన్, గోపాలకృష్ణ, మొగ్గల్యా, యస్ శ్యామ్ నటించారు

ఈ నాటికకు ముందు శ్రీమతి పద్మలతా దేవ్ నృత్య ప్రదర్శన జరిగింది

ఈ కార్యక్రమానికి ఉస్మానియా ఇంజనీరింగ్ కళాశాల ప్రిన్సిపాలు శ్రీ బదురుద్దీన్, ఒరిస్సా డ్రగ్ కంట్రోలర్ శ్రీ ఎస్ పాణి ముఖ్య అతిథులుగా విచ్చేశారు 

